మే 1979

సంపుటి : 2 సంచిక : 4

# చతుర

## ఈ నెల సమగ్ర నవల

తెలుగులో బాలల కోసం వ్రాసిన నవలలుగానీ, బాలలే ముఖ్య పాత్రలుగా వ్రాసిన నవలలుగానీ బహు తక్కువ. ఈ లోపాన్ని దృష్టిలో ఉంచుకుని అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 'చతుర' సమర్పిస్తున్న ప్రత్యేక కానుక

# హంసద్వీపం

పన్నెండేళ్ళమ్మాయి అనుకోకుండా పది గజాల ఎత్తున్న అంగారక గ్రహవాసికి మిత్రురాలైంది. ఆ వెంటనే ఆరంగుళాలు కూడా లేని పొడవరాని లిల్లిపుట్ వారసులైన మరుగుజ్జుల్ని కలుసుకుంది. అంతలో వాళ్ళను జంతువుల్లా అమ్మేసి లక్షలు సంపాదించాలనుకుంటున్న దుర్మార్గుల్ని ఎదుర్కోవలసి వచ్చింది... ఆ తర్వాత...? ఆసక్తికరంగా కొనసాగే ఫాంటసీ నవల 'హంస ద్వీపం' రచయిత్రి

## ఆర్. కరుణకుమారి

# చతుర

ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్–500 004

## ఈనెల ముఖపత్రం

"మీ చిరునవ్వులు లోకానికి వెలుగులు, మీ మందహాసాలు పెద్దల హృదయానందానికి జిలుగులు" అని కవితాత్మక ప్రశంసల, నందుకున్న చిన్నారుల్లో ఒక చిన్నారి ఈ నెల 'చతుర' ముఖపత్ర 'సుందరి'

## రెండవ, మూడవ కవర్లు

తెలుగు దేశపు కాకతీయ శిల్పాలకు సమకాలికమైన కర్నాటక రాష్ట్రపు బేలూరు, హాలె బీడు శిల్పాలు జగద్విఖ్యాతాలు. అపురూపమైన అలంకార శిల్పానికి, రూప సౌందర్య విలసితమైన దేవతాప్రతిమలకు ఈ 'హోయసల' శిల్పాలు సుప్రసిద్ధాలు. అలాంటి అపురూప శిల్పాలలో రెండు ఈనెల 'చతుర' సమర్పిస్తోంది.



## మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా చేసుకోవాలని ఆతృతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి®

అలసటను ఎదుర్కొనేందుకు




dCA/GL/54/TL/Rev

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని వివిధ కోణాలనుండి ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపటం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంతవరకూ కుదించవలసివచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతోసహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పిపంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పని సరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం వుండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుదినిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్ సోమాజిగూడ, హైదరాబాద్-500 004

# ప్రపంచమంతా మీదే!

అవును! 'విపుల' చేతిలో ఉంటే మీరు ఏ తీరాన ఉన్నా సరే మలయమారుత సౌరభాల్ని ఆస్వాదిస్తూనే సునాయాసంగా అన్ని తీరాల్నీ చుట్టి రాగలరు. తీరాల్ని దాటి దేశాల ఎల్లల్ని అధిగమించి అక్కడి ప్రజలను అత్యంత సన్నిహితంగా దర్శించి రాగలరు. కాలు కదుపనవసరం లేకుండానే మీ చేత ప్రపంచ ప్రదక్షిణం చేయిస్తుంది 'విపుల' మాస పత్రిక.

*ఈ అవకాశాన్ని తెలుగు పాఠకులకు మాత్రమే అందుబాటులోకి తెచ్చిన వివిధ భాషల విశిష్ట కథల వేదిక 'విపుల'. అందరికీ అందుబాటులో కేవలం 125 పైసలకే రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో 132 పేజీలతో వెలువడుతోంది 'విపుల'.*



# విపుల

విశ్వకథా విపంచి






Marketed by
Margadarsi Marketing
PRIVATE LIMITED Eenadu Compound Hyderabad-500 004

# పాముల వేట

ఓ రోజున మద్రాసు ఇంజనీరింగ్ కళాశాలలో విద్యార్థులు హడావుడిగా అటూ యిటూ పరుగెడుతున్నారు. అందరి ముఖాల్లోనూ ఆశ్చర్యం, ఆందోళన తారట్లాడుతున్నాయి. మూడడుగుల [illegible] పాము ఆ కాలేజీ ఆవరణ[illegible] విప్పి నాట్యం చేస్తోంది. ఆ [illegible] చూసి ఆనంది[illegible] ద్రోహులు "[illegible] దాన్ని చంపం[illegible]" అని [illegible].

"పాము[illegible] చంప[illegible]. మహా పాపం!" అ[illegible] చక్రవర్తులు.




"మనం చంపటం దేనికి ? వెళ్ళి పాముల్ని పట్టేవాడిని పిల్చుకొస్తే సరి" అని సెలవిచ్చారు ఇంకొందరు.

ఇంతలో యింజనీరింగ్ నాలుగో సంవత్సరం చదువుతున్న విద్యార్థి రవి చంద్రన్ అక్కడి కొచ్చాడు.

అతణ్ని చూస్తూనే "రవీ ! కాలేజీ స్టేజి మీద కథానాయకుడిగా ఎన్నో సాహస కృత్యాలు చేసి చూపావు కదా, ఏదీ నీ ప్రతాపం చూపించి ఈ పాముని ప్రాణంతో పట్టుకో చూద్దాం !" అంటూ సవాల్ చేశారు అతని మిత్రబృందం.

రవి వెంటనే ఓ గోనెసంచి తెప్పించి, ఒక చేతో దాన్ని తెరిచి పట్టుకుని, రెండో చేతో పామును కవ్వించసాగాడు.

"[illegible] పని ఇలా వుందా? చూడు నిన్నేం చేస్తా[illegible]" అన్నట్టు ఆ పాము రవి వైపు [illegible] చూసి, ఒక్క ఉదుటున [illegible] సంచిలోకి దూకింది. [illegible]యకుండా ఆ సంచీ [illegible] యువ కిశోరుడు.

[illegible] అతని సమయ స్ఫూర్తికి [illegible], ఆ సంచిని పాముతోసహా '[illegible]పార్క్' అధికారులకు అందచేశాడు. ఆ విద్యార్థి సాహసానికి అధికారులు ముచ్చటపడి, అతనికో సర్టిఫికెట్ బహూకరించి, తరువాత "చూడు బాబూ, పాములతో ఆటలాడటం ప్రాణాలతో చెలగాటమే. జాగ్రత్త సుమా!" అని హెచ్చరించారు.

చిన్నప్పుడు తాను చూసిన సినిమా షూటింగులో హీరోగారు పామును ఆ పద్ధతిలోనే పట్టుకున్నాడని అతను నవ్వుతూ చెప్పేసరికి, అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. అధికారులు అతని తెలివితేటల్ని ప్రశంసించి తమవద్ద పాముల్ని పట్టటంలో ప్రత్యేక శిక్షణ తీసుకోమని సలహా యిచ్చారు.

ఆ హీరోయే యిప్పుడు 'స్విమ్మింగ్ పూల్' అనే తమిళ చిత్రంలో విలన్ అయి కూర్చున్నాడట!

# ప్రపంచం

## కోళ్ళ పందెం

కోళ్ళ పందెం మనకు జూదంలాంటిదైతే ఫిలిప్పైన్స్‌లో దీన్ని చట్టబద్ధమైన ఆటగా చేసి వినోదిస్తున్నారు. పోటీలకు ముందుగా 8 నెలలు ఎంతో కష్టపడి వాటికి అన్ని మెలకువలూనేర్పి, జాగ్రత్తగా కాపాడితే పందెపుగిరిలో వాటి ప్రతిభలు నిమిషాల్లో తేలిపోతాయి.

ప్రత్యేకమైన స్టేడియంలలో ప్రతివారం వేలాది కోళ్ళ పందాలు నిర్వహించేందుకు ప్రభుత్వం అనుమతి ఇసుంది.

జాతీయ ఆటగా పరిగణింపబడుతున్న ఈ పందాలు వారాంతపు శెలవు దినాల్లోను, పండుగ రోజుల్లోను ఎక్కువగా జరుపుకుంటారు.

చాలా దేశాల్లో కోడి పందాలు దాదాపు మాసిపోయినా ఫిలిప్పైన్స్‌లో మాత్రం అన్ని క్రీడల్లోకి దీన్ని అగ్రగామిగా లెక్క వేస్తున్నారు. ఈ పందాల్లో ప్రతి వారం కొన్ని లక్షల డాలర్లు చేతులు మారుతుంటాయి.

ఒక్కొక్క ఫిలిప్పైన్ పౌరుడు 20 కోడిపుంజుల్ని పెంచుకోవచ్చు. పోటీకి ముందురోజు 'డేగ' రక్తాన్ని పోటీలో పాల్గొనే పుంజుకు ఇంజక్షన్ ద్వారా ఎక్కిస్తారు. ఇందువల్ల డేగకుండే చొరవ, ధైర్యం, రెక్కల్లో శక్తి పుంజులు పుంజుకుంటాయని వారి నమ్మకం.

వీటికి వుడికించిన జొన్నలు, పచ్చి మాంసం, ఉడకబెట్టిన గ్రుడ్లు ప్రత్యేక ఆహారంగా ఇస్తారు. ఎటువంటి వ్యాధులు రాకుండా మందులు వాడతారు. కోడి పుంజులకు ఈ ఎనిమిది నెలలూ పెట్టలు కనబడకుండా చేసారు. చూపిస్తే పుంజుల్లో హుషారు తగ్గిపోతుందట.

కొద్ది పెట్టుబడితో వచ్చే కోళ్ళు ప్రత్యేక శిక్షణ పొంది ఒక్క రోజులో వేలు సంపాదించిపెట్టగలవు.

పందేనికి ముందు ఒకడు ఒక కోడి తలను కదలకుండా పట్టుకుంటే ఇంకో కోడి ముక్కుతో పొడిచి రక్తాన్ని తెప్పిస్తుంది. అప్పట్నించీ పోటీ మొదలవుతుంది. యజమానులు దగ్గరుండి పట్టుకుని ముందుగా పోట్లాటకి తర్ఫీదు యిస్తారు.

ఈ పోటీ జరిగే మైదానాన్ని 'కాక్ పిట్' అంటారు. ఒకదానినొకటి ఆకర్షించుకోవడానికని వాటి మెడలో రంగురంగుల తోకలు కడతారు. కోళ్ళు బాగా పైకి



ఎగరడంలో శిక్షణ పొంది వుండడంవల్ల బాగా ఎగిరే కోళ్ళే విజయాన్నిసాధిస్తాయి. అవతలి కోడి చచ్చిపోవడం లేదా గాయపడ్డం జరుగుతుంది. ఒక్కోసారి ఒక పెద్ద కోడికి రెండు చిన్న పుంజుల్ని ప్రత్యర్థులుగా నిలబెడతారు.

## అపర బకాసురుడు

**పు**రాణ కాలంలో బకాసురుడు బళ్ళ కొద్దీ ఆహారం తినేవాడని విన్నాం. అతని వారసులు కొందరు ఇంకా వున్నట్టు తేలింది.

అమెరికన్ సైన్యంలోని చెస్టర్ అనే అతను ఉదయం ఉఫాహారంగా 40 గుడ్లు, 30 రొట్టెలు, ఓ ఎనిమిది పెద్ద పెద్ద పంది



మాంసం ముక్కలు, పెద్ద గిన్నెడు పులుసు, మూడు గ్లాసుల పాలు తాగి చివర్న ఓ కప్పు కాఫీ కూడా సేవిస్తాడుట. ఇంతా తిని మధ్యాహ్నం మళ్ళీ ఆవురావురుమంటూ 18 పౌన్ల కోడి మాంసం, 24 వేయించిన పెద్ద పెద్ద మాంసం ముక్కలు తింటాట్ట. ఇహ రాత్రికి 6 డజన్ల గుడ్లు వగైరా తిని ఆరోజు గడిచిందనిపిస్తాట్ట. సైన్యంలో ఎవరు ఎంత తినగలిగితే అంతా పెట్టాలి అన్న రూలు ప్రకారం పాపం వంట వాళ్ళు ఇతని గురించి ఎవరికీ ఫిర్యాదు చేసేందుకు అవకాశం లేకపోయింది. చూడ్డానికి మామూలుగా వుండే ఇతగాడికి అంత తిన్నా కడుపు నొప్పి, భుక్తాయాసం వగైరాలేవీ లేకపోగా తిన్న ఆహారం హాయిగా మామూలు వాళ్ళ కంటే తేలిగ్గా జీర్ణం అయిపోతుందిట.

ఇదేదో రోగం అని అనుమానించిన అధికారులు చెస్టర్‌ని డాక్టర్ల వద్దకు పంపగా వారు పరీక్షించి ఇతను శారీరకంగా చాలా ఆరోగ్యంగా వున్నాడు. ఏ రోగం లేదు గానీ మనస్తత్వ నిపుణులకు చూపించమన్నారు. వాళ్ళెవరూ ఇతని కున్న మానసిక దౌర్బల్యమేమిటో తేల్చలేక పోయారు. ఆ అపర బకాసురుడు అమెరికన్ సైన్యంలో వుండబట్టి బతికిపోయాడు. సుమండీ!

## భూగర్భ రైలుమార్గం

**హాంగ్‌కాంగ్** ఇంజనీర్లు నాలుగు సంవత్సరాలు ఏకదీక్షతో భూమిలో సొరంగాలు త్రవ్వి, రైలుమార్గం వేయడంలో కృతకృత్యులయ్యారు. ఈ భూగర్భ రైలు మార్గం ద్వారా వెళ్ళే ఎలక్ట్రిక్ రైళ్లో ప్రతి రోజూ 20 లక్షల మంది ప్రయాణం చేయవచ్చు.

ప్రపంచంలోనే అతి పెద్దదయిన హాంగ్‌కాంగ్ భూగర్భ రైలుమార్గంలో ఒక లైను ఉత్తర, తూర్పు కౌలూన్‌లను కలుపుతూ పోతుంది. హాంగ్ కాంగ్ ఐలాండ్‌ను, మెయిన్ లాండ్‌ను కలిపే రెండవ లైను 1980 మార్చినాటికి తయా

రవుతుంది. హాంగ్‌కాంగ్ ఓడరేవు కిందుగా కూడా వెళ్ళే ఈ రైలుమార్గం 1975లో మొదలైంది.

1974 నాటి లెక్కల ప్రకారం ప్రాథమిక దశలో దీనికయ్యే ఖర్చు 90 కోట్ల డాలర్లట.

హాంగ్‌కాంగ్‌లోని తీవ్రమైన ఎండల తాకిడిని భరించలేని ప్రజలు ఎయిర్ కండిషన్ చేసిన ఈ భూగర్భ రైలు మార్గం తమపాలిట వరంఅనుకుంటున్నారు.

ఈ రైలుమార్గ నిర్మాణానికి స్థానిక



సంస్థలు, అంతర్జాతీయ వ్యాపారస్థులు, జపాన్, బ్రిటన్, జర్మనీ, ఫ్రెంచి, స్వీడన్ దేశాలు తమ సహాయం అందించారు.

పెరిగిపోతున్న జనాభాతో రోడ్లను పెంచలేక ఈ భూగర్భ సొరంగ పద్ధతిని ప్రవేశపెట్టారు. మొత్తం 52 కిలోమీటర్ల ప్రాంతాన్ని ఈ మార్గం చుట్టబెడుతుంది. 8 బోగీలుగల రైలు 3, 300 మంది ప్రయాణీకుల్ని కేవలం 90 సెకన్లలో గమ్యస్థానం చేరుస్తుంది.

నిర్మాణం పూర్తయ్యాక 1980వ సంవత్సర మధ్యకాలానికి సాలీనా 50 కోట్ల మిలియన్ డాలర్ల లాభం వస్తుందట

## గతస్మృతులు

అస్సాంలోని ఓ చిన్న గ్రామంలో ఓ మధ్య తరగతి కుటుంబంలో మూడవ సంతానంగా పుట్టిన పాప 7,8 నెలలు వచ్చేసరికి ఇధర్, ఉధర్ (ఇక్కడ, అక్కడ) అనే హిందీ మాటలు మాట్లాడేదట. వారి కుటుంబంలోగాని, చుట్టు పక్కలవారుగాని ఎవరూ హిందీ మాట్లాడరు. అలాంటిది ఆ పిల్ల హిందీ మాట్లాడ్డం తల్లిదండ్రులను భయ భ్రాంతుల్ని చేసింది.

అంతేగాక ఈ పాప ఒక్కొక్కసారి "ధుక్కీ భాయ్!" అని పిలిచేది. ఒక్కోసారి 'టినియా నన్ను నీళ్ళలోకి తోయకు' అనేది. తండ్రి కొంతవరకు ఆమె మాట్లాడే హిందుస్తానీ అర్థం చేసుకునే వాడు. మిగతావారికి ఆమె ఏం మాట్లాడుతోందో అర్థం అయ్యేది కాదు. తన తండ్రిని 'నాన్నా నువ్వు మా నాన్నవి కాదు' అనేది. తల్లిని తన ఛాయలకు రానిచ్చేదికాదు. పూర్వజన్మ స్మృతి వున్న ఆ పాప ఆ జ్ఞాపకాలనుండి బయటపడలేక తన ఇదివరకటి తండ్రి పేర 'తనను తీసుకు పొమ్మని' ఉత్తరం రాసి అత గాడి రాకకోసం ఎదురు చూస్తూ కూర్చునేది. తనకి మంచి అందమైన ఇల్లుండేదనీ; కారు, ట్రక్కు, ఇల్లంతా కరెంటు దీపాలు వుండేవనీ; తను, తన తమ్ముడు ధుక్కీభాయ్ రోజూకార్లో స్కూలుకి వెళ్ళే వారమనీ; బాలి, దేష్, లత్నాలా వీరంతా

తన పాత స్నేహితులని; భోజ్‌కాలాల్ బట్టల దుకాణంలో తన తండ్రి తమ కోసం బట్టలుకొనేవారని; అసలు తను మగపిల్ల వాణ్ణని; తన పేరు 'మున్నా' అని; తనను అలాగే పిలవాలని నానా అల్లరి చేయసాగింది.

పండగలొస్తే తనతో బాటు ధుక్కీ భాయ్‌కి కూడా కొత్త బట్టలు తెమ్మని పంతం పట్టేది.

మున్నాకునాలుగేళ్ళ వయసున్నప్పుడు వాళ్ళ ఇప్పటి నాన్నకి ఇంకొవూరు బదిలీ అయింది. అక్కడ స్కూల్లో తను హిందీయే నేర్చుకుంటానని మారాం చేసే వాళ్ళమ్మ ఆ బడిలో హిందీ నేర్పించరని చెప్పి బలవంతంగా అదే స్కూల్లో చేర్పించింది.



ఆ పాప ఇప్పుడు ఆరో తరగతి చదువుతోంది. కానీ ఇదివరకటిలా హిందీ ధారాళంగా మాట్లాడలేకపోవడమే గాక క్రమేపీ పాత జ్ఞాపకాలు మర్చిపోతోంది.



## కుందేళ్ళ ద్వీపం

తమిళనాడులో మండపం అనే చోట 600 ఎకరాల విస్తీర్ణంగల ఓ ద్వీపం వుంది. దాని పేరు కుందేళ్ళ ద్వీపం. మరకాయర్ అనే అతను దానికి యజమాని.

మండపం ప్రాంతానికి నాలుగు కిలో మీటర్ల దూరంలో వున్న ద్వీపం కొబ్బరి చెట్లు, తాటి చెట్లతో నిండి వుంటుంది. ఆ ప్రదేశంలో చెట్లు ఎక్కువగా ఎత్తుగా పెరగవు. నెలకి ఒకసారో, రెండు సార్లో మరకాయర్ తరపున కొన్ని పడవలు వచ్చి ఇక్కడి కొబ్బరికాయలన్నీ కోసుకుని వెళతాయి. ఈ కొబ్బరి చాలా తియ్యగా వుంటుంది.

అక్కడి వాతావరణం ఎంతో ఆహ్లాదకరంగా వుంటుంది. అక్కడ మొలిచే పచ్చని గడ్డికోసం వచ్చిన ఆవులు, మేకలు అటూ ఇటూ తిరుగుతూ వుంటాయి. సముద్రపు అలల శబ్దం తప్ప మరే శబ్దం వినిపించనంత ప్రశాంతంగా వుంటుంది. అక్కడ కూడా తాబేళ్ళు తిరుగాడుతూ వుంటాయి.

ఇన్ని అందాలున్న అక్కడ కనీసం పేరుకైనా ఒక్క కుందేలు కూడా కనబడదు. వేటగాళ్ళ తాకిడికి తట్టుకోలేక కుందేళ్ళు పారిపోయాయని అక్కడి గైడ్స్ చెప్తారు. కుందేళ్ళు పోయినా ఆ ద్వీపానికి ఆ పేరు మాత్రం అలాగే వుండిపోయింది.

ద్వీపం చుట్టూ వున్న నదీ జలాల్లో రకరకాల చేపలున్నాయి. మొత్తం వంద కంటే ఎక్కువ రకాల చేపలే వున్నాయి. అక్కడ జనసంఖ్య చాలాతక్కువ. మంచి



సీటికోసం ప్రజలు కొన్ని మైళ్ళ దూరం వెళ్ళాలి. ఈ మధ్య ఓ సిమెంటు కంపెనీ ఆ ద్వీపాన్ని కంట్రాక్టుకు తీసుకుంది. కుందేళ్ళ ద్వీపమని పేరు పొందిన ఈ ద్వీపంలో కనీసం ఒక్క కుందేలయినా కనబడక పోవడం చూడవచ్చిన వారికి నిరాశ కలిగించకమానదు. 'కుందేళ్ళ ద్వీపం' అంటే నేతి బీరకాయలోని నెయ్యేనన్నమాట!

## చచ్చి బ్రతికిన మనిషి

కేరళలో ఒక గ్రామం చెరువులో ఓ యువకుడి శవం తేలుతోందని ఫిర్యాదు అందుకుని పోలీసులు కార్యరంగంలోకి దూకారు.

ఆ గ్రామ వాసులెవ్వరూ శవాన్ని గుర్తుపట్టలేక పోయారు. వారం తర్వాత అంతకు ముందెప్పుడో కనిపించకుండా పోయిన రాబర్ట్ అనే అతని ఫొటో ఆధారంగా ఆ శవం అతనిదేనని పోలీసులు తేల్చారు.

రాబర్ట్ తన దూరపు బంధువైన ఆంథోని స్వామి పళ్ళ దుకాణంలో పనికి కుదిరాడు. స్వామి తరచుగా ఈ అబ్బాయిని బాగా తిడుతూ వుండేవాడు. ఆ తిట్లు భరించలేక కొన్ని రోజులకు రాబర్ట్ పారిపోయాడు. ఎక్కడున్నాడో ఎవరికీ తెలీదు. ఈ కథనం బట్టి ఆంథోనిస్వామి కోపంతో రాబర్ట్‌ను చంపి వుండవచ్చని గ్రామవాసులు అభిప్రాయ పడ్డారు.

విషయం తెలిసిన ఆంథోని కొన్నాళ్ళు పోలీసులకు కనబడకుండా దాక్కున్నాడు. కానీ అతని స్నేహితులు ధైర్యం చెప్పి 'తప్పు నీది కాదు కదా!'- అలా అని కోర్టులో అర్జీ పెట్టుకోమని సలహా ఇచ్చారు. అర్జీ దాఖలు చేసిన ఆంథోనీ దగ్గర్లో చిన్న కాంటీన్‌కి వెళ్ళేసరికి అక్కడ సర్వరు డ్రస్సులో ప్రత్యక్ష



మయ్యాడు రాబర్ట్.

ఆంథోని స్వామి ఆనందం పట్టలేక అతనికి జరిగిన సంగతంతా చెప్పి పోలీసు స్టేషన్‌కి వెళ్ళి ప్రత్యక్ష సాక్ష్యాధారాలతో తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకున్నాడు.

కేసు కొట్టేసి పోలీసులు మళ్ళీ శవం గురించిన విషయాన్వేషణలో పడ్డారు. రాబర్ట్ కనిపించకపోతే నిర్దోషి అయిన ఆంథోనీయే ఆ హత్య చేసినట్లు సాక్ష్యాధారాలతో నిరూపించి కోర్టు అతనికి ఉరిశిక్ష విధించి వుండేదే!

## వెలుగురేఖలు

రద్దీ గల రోడ్ల మీద అలవాటున్న వాళ్ళు నడవడమే కష్టంగా వుంది. గుడ్డివాళ్ళ సంగతి వేరే చెప్పక్కరలేదు. ఎలాంటి ఇబ్బంది లేకుండా నడిచేందుకు అంధులకు ఆప్త మిత్రుడిలాంటి కొత్త పరికరాన్ని కనిపెట్టారీమధ్య.

ఈ పరికరం మనిషి అరచేతి పరిమాణంలో వుండి ఎనిమిది రకాల ప్రత్యేక ధ్వనులనిచ్చే స్కేలు అమర్చి వుంటుంది. దీనిలోని కోడ్ పదాన్ని 'నోడ్' అంటారు. ఈ నోడ్ స్విచ్ వేయగానే పనిచేయడం ప్రారంభించి వస్తువు ఎంత దూరంలో వుందో తెలియజేస్తుంది. వస్తువు దూరంగా వుంటే గట్టిగాను, సమీపంలోనే వుంటే మెల్లిగానూ శబ్దం చేస్తుంది.

డా॥ ఎ.డి. ఆంస్ట్రాంగ్ పర్యవేక్షణలో ఓ వైద్యుల బృందం ఈ పరికరాన్ని రూపొందించారు. కొద్ది అనుభవంతో కొత్త వ్యక్తి కూడా దీన్ని వుపయోగించగలడు.

దీనివల్ల రోడ్డు మలుపులు, మెట్ట పల్లాలు, మేడ మెట్లు కూడా తేలిగ్గా తెలుసుకోవచ్చు. ఎవరి సహాయం అక్కర్లేకుండానే సంకేత శబ్దం మెల్లిగా వినబడే సరికి ప్రమాదం గుర్తించి అంధుడు నడవడం ఆపేస్తాడు.

పోస్ట్ బాక్సులను, టెలిఫోన్ బూత్‌లను, రోడ్డు దాటేందుకు వుపయోగించే సూచికలను, ఆగివున్న కార్లు మొదలైన వాహనాలను కూడా ఈ పరికరం ఇచ్చే శబ్దాలను బట్టి గ్రహించవచ్చు.

దగ్గర్లోవున్న ప్రమాదాన్ని సూచించే శబ్దం తక్కువ స్థాయిలో వుండటంవల్ల సరిగా వినిపించక ప్రమాదం పాలు కావచ్చు. అందుకని హియరింగ్ ఎయిడ్ లాగా వుండే చిన్న సాధనాన్ని చెవిలో పెట్టుకుందుకు ఈ పరికరాన్ని అమర్చారు. దీనివల్ల ఎంతటి ప్రమాదం నుండయినా తప్పించుకునే వీలుంది. ముసలి వారికి గ్రహణ శక్తి తక్కువ అయినందున ఇది యువకుల్నే ఎక్కువగా ఆకర్షిస్తుంది.



అంధులు ఊతగా ఒక కర్ర, ఒక చేతి సంచి, ఇంకేమైనా అవసరం అయిన సరుకులతో పాటు ఈ 'నోడ్' పరికరాన్ని పట్టుకెళ్ళాలంటే ఇబ్బందిగా వుంటుందని, ఇక ముందు ఆ పరికరాన్ని శరీరానికి తగుల్చుకునేందుకు వీలుగా తయారుచేయాలనుకుంటున్నారు.

# జీవజలం

గ్రీకులు, ఎస్కిమోలు, బ్రిటిష్ దేశస్థులు, ఎంతో మంది ఎప్పటి నుండో మూత్రాన్ని దివ్యౌషధంగా భావించి వుపయోగిస్తున్నారట. మన ప్రధానిగారి సంగతి సరేసరి.

ఆంస్ట్రాంగ్ అనే బ్రిటిష్ వైద్యుడు 1944లో రాసిన 'ది వాటర్ ఆఫ్ లైఫ్' గ్రంధమే తనకు మార్గదర్శకమని, ప్రతి రోజూ ఉదయం ఒక గ్లాసుడు మూత్రం త్రాగడం వల్లనే 80 ఏళ్ళ వయసులో కూడా తను చాలా ఉత్సాహంగా, ఆరోగ్యంగా వున్నానంటారు శ్రీ మొరార్జీ.

మొదటి ప్రపంచ యుద్ధంలో వాలంటీరుగా వున్న ఆంస్ట్రాంగ్‌ను క్షయరోగి అని పనిలోంచి తీసేశారు. డాక్టర్ల వైద్యం నచ్చక ఆంస్ట్రాంగ్ 45రోజులు ఉపవాసం చేసి రోజూ తన మూత్రం తానే తాగి, కొంత ఒళ్ళంతా రుద్దుకునే వాడట. దాంతో అతను ఆరోగ్యవంతుడయ్యాడు.

మూత్రంతో వ్యాధుల్ని నివారించే పద్ధతి మొదట గ్రీకులో అమల్లో వుండేదట. "తొమ్మిది రోజులు వరసగా మూత్రాన్ని త్రాగితే 'స్కర్వీ' వంటి వ్యాధులు నయమై శరీరం తేలిక పడి హాయిగా ఆనందంగా వుండగలదని" 19వ శతాబ్దంలో బ్రిటన్‌లో అచ్చయిన "తెలుసుకోవల్సిన వెయ్యి విశేషాలు" గ్రంథంలో రాసి వుంది. పచ్చకామెర్లు, జలోదర వ్యాధి, కళ్ళకు, చెవులకు సంబంధించిన వ్యాధులూ నయమవుతాయట.

1695లో ప్రచురితమైన 'సాల్‌మన్స్ ఇంగ్లీషు ఫిజిషియన్' పుస్తకంలో మూత్రం తలకి రాసుకుంటే చుండ్రు పోతుందని వుంది. 18వ శతాబ్దానికి చెందిన పర్షియన్ దంత వైద్యుడు పళ్ళ వ్యాధులు రాకుండా మూత్రం పుక్కిట పట్టుమని తన రోగులకు చెప్పేవాడట.

టిబెట్‌లోని లామాలు, జిప్సీలు, దీర్ఘకాలం జీవించడంలో గల రహస్యం మూత్రపాన మేనట.

మూత్రం రుచి 'పటిక' మాదిరిగా వుంటుందనీ, దాన్ని ఎంత ఎక్కువగా వాడితే అంత ఆరోగ్యకరమనీ అంటాడు ఆంస్ట్రాంగ్.



శరీరంలోపలి ఏ విభాగాల్లో వడపోయబడి బయటికి వస్తుంది గనుక మూత్రం చాలా స్వచ్ఛమైనదని, దాన్ని తాగడం వల్ల శరీరం గట్టిపడి అదనపు శక్తి వస్తుందని వైద్యులంటున్నారు.

అనేక మంది మూత్రాలు కలసి వుండటం చేతనే 'గంగా'నదిని సర్వరోగ నివారిణి అంటారుట. 'పవిత్ర గంగానది' అంటే ఇదే కాబోలు!

ఉదయం ఎనిమిది గంటల వేళ...

తెల్లవారకముందే లేచిన కామేశ్వర రావు అప్పటినుంచీ అలా కాలు కాలిన పిల్లిలా, అటూ ఇటూ తిరుగుతూనే ఉన్నాడు. ఎనిమిది గంటలు కొట్టినా భార్య రాజేశ్వరి ఇంకా మంచం దిగలేదు. నిద్రపోతూనే ఉంది.

అతనికి అర్జంటుగా వెయ్యిరూపాయలు కావాలి!

రాజేశ్వరి నెమ్మదిగా కదిలింది. లేవ బోయి, మళ్ళీ పడుకుండిపోయింది. బాధగా 'అమ్మా' అంటూ మూలిగింది.

కామేశ్వరరావు గాభరాగా "అదేంఅలా ఉన్నావు?" అన్నాడు ఆప్యాయత నటిస్తూ.

"నిన్నట్నుంచీ జ్వరం!" అంది రాజేశ్వరి ముక్తసరిగా.

"అలాగా, చెప్పావు కాదేం? మందు తీసుకున్నావా?"

"ఆ(. తీసుకున్నాను"

ఏం మాట్లాడాలో తోచలేదు కామేశ్వర రావుకి. తల ఎత్తి దూలాలు లెక్క పెట్టడం ప్రారంభించాడు. వెయ్యి రూపాయల ప్రసక్తి ఎలా తేవడం?

"రేపు అరుణకి మైనారిటీ తీరి పోతుంది. మేజరవుతుంది. అప్పుడు మన గతి ఏం కావాలి? ఏమయినా ఆలోచిం చావా?" అంది రాజేశ్వరి.

ఏం లేదన్నట్టు తలూపాడు కామేశ్వర రావు.

"ఇంకో నాలుగేళ్ళు గడువుంది. ఈలోగా ఆస్తి మనం దక్కించుకోవాలి. దానికే దయినా పథకం వెయ్యాలి..."

"ఏం చేస్తే బాగుంటుంది?"

"అరుణ బతికి ఉండగా ఈ ఆస్తి మనకు దక్కదు."

"అలాగే" అన్నాడేకాని - అరుణని హతమార్చాలన్న ఊహే పరమ భయంక రంగా తోచింది అతనికి. ఏదో అనబోయి మళ్ళీ అంతలోనే ఊరుకున్నాడు.

"డబ్బేమయినా కావాలా?" అంది రాజేశ్వరి భర్త కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"అవును."

"ఎంత కావాలి?"

"వెయ్యి రూపాయలు" అంటూ నసిగాడు.

"అందులో ఉన్నాయి తీసుకోండి" అంటూ తాళాల గుత్తి ఇచ్చింది.

తిట్టకుండా, రాద్ధాంతం చెయ్యకుండా డబ్బు ఇస్తున్నందుకు కామేశ్వరరావు సంబరపడ్డాడు. డబ్బు తీసుకొని తాళాల గుత్తిని మళ్ళీ ఆమెకు ఇచ్చేశాడు.

"అరుణ విషయం మరిచిపోకండి" అంటూ భర్తను మరోసారి హెచ్చరిం చింది.

"అలాగే అలాగే" అంటూ ఆమె గది నుంచి బయటపడ్డాడు.

* * *

ఆ భవనం పేరు శ్రీ నిలయం. ఆ భవనం దాదాపు నూరేళ్ళనాటిది. అక్కడికి దగ్గరలో వున్న పల్లెప్రజలు దాన్ని 'దెయ్యాలమేడ' అని పిలుస్తారు. వెల్ల, మరమ్మతులూ ఏదీ లేక ఇప్పుడు శిథిలా వస్థలో వుందది.

ఆ భవనానికి యజమానురాలు అరుణ కుమారి. 'శ్రీనిలయం' వాళ్ళ తాతగారు కట్టించినది. ఆ అమ్మాయి వయస్సు పధ్నాలుగేళ్ళు. తల్లీతండ్రీ చిన్నప్పుడే చనిపోవటంతో మేనత్త సంరక్షణలో పెరిగింది. పెరుగుతూంది. మేనత్త అంటే

అరుణా వాళ్ళ నాన్నగారికి స్వయానా చెల్లెలు కాదు. ఆవిడ పేరు రాజేశ్వరి. వయస్సు ముప్పయ్యే అయినా కఠిన హృదయురాలు. అరుణని సరిగా చూడదు.

అలాంటి రాజేశ్వరి భర్త, కామేశ్వరరావు. వయస్సులో భార్యకన్నా నాలుగేళ్ళు పెద్దవాడు. ఖరీదైన మంచి బట్టలు వేసుకుని షోకిల్లాలాగ సైకిలుమీద ఊరంతా తిరగడం తప్ప, అతనికి వేరే పనిలేదు. దానికి తోడు విపరీతమైన నాటకాలపిచ్చి. ఎప్పటికైనా సినిమాల్లో హీరోగా వేషం వెయ్యాలని అతనికి పెద్ద ఆశ! సైకిలెక్కి, నాటకాల రిహార్సల్స్ కోసం మూడు మైళ్ళ దూరంలో వున్న పట్నానికి వెళ్తూ వుంటాడు. అరుణని సంరక్షించడానికి కోర్టువారు రాజేశ్వరినీ, కామేశ్వరరావునీ నియమించటంవల్ల ఆస్తి వ్యవహారాలన్నీ వాళ్ళే చూస్తూ వుంటారు. అరుణకోసం నెలనెలా ప్లీడరుగారిచ్చే డబ్బుతో వీళ్ళిద్దరూ విలాసంగా కాలం గడుపుతూ వుంటారు.

వంటలక్క పేరమ్మ చాలా వృద్ధురాలు. అయినా, ఓర్పుగా ఎంతో చక్కగా వంట చేస్తుంది. అరుణ మీద ఎంతో అభిమానం.

మాస్టారు మాధవయ్యకి కూడా అరుణ అంటే విపరీతమైన ప్రేమానురాగాలు. శ్రీనిలయానికి దగ్గర్లో వున్న చిన్న పల్లెలో వుంటాడు మాధవయ్య.

ఇవాళ అరుణకి చాలా ఆనందంగా వుంది. కారణం రాజేశ్వరి అత్తయ్య వుదయంనుంచీ మూలుగుతూ మంచంమీద పడుకుని వుంది. జ్వరం వచ్చిందిట.

'దేవుడా, మా అత్తకి ఇంకో నాలుగు రోజులవరకూ జ్వరం వుండేలా చూడు. నా ఆస్తి నా చేతుల్లో పడగానే నీకు నాలుగు కొబ్బరికాయలు సమర్పించుకుంటాను' - అనుకుంది మనస్సులో.

మామయ్య బాధ పెద్దగా ఏంలేదు, రోజూ వుదయాన్నే పోయి ఏ అర్ధరాత్రికో వస్తాడు గనక!

ఆ రోజు మధ్యాహ్నం భోజనం కాగానే బోనులోంచి బయటపడ్డ పులిపిల్లలా పరుగెత్తింది అరుణ. శ్రీనిలయం గేటుదాటి అక్కడికి రెండు ఫర్లాంగుల దూరంలోని చిలక సరస్సువేపు నడిచింది. ఎక్కడెక్కడినుంచో చిలకలు వచ్చి ఈ సరస్సులోనే స్నానం చేస్తాయిట. అందుకే ఆ పేరు వచ్చింది. ఆ సరస్సు చివరికి సముద్రంలో కలుస్తుందిట. చిలక సరస్సుమీద రెండు ఫర్లాంగులు పడవలో ప్రయాణం చేస్తే 'హంసద్వీపం' వస్తుంది.




ఈ ద్వీపం అరుణదే. వాళ్ళ తాతగారు బతికివున్న రోజుల్లో ఆ ద్వీపం మధ్యగా ఒక విలాసగృహం కట్టించేరు.

ఆ గృహం పైకి మాత్రం పాడుబడ్డ భవనంలా కనిపిస్తుంది. ఆ విలాసగృహంలో ఏదో దెయ్యం వుందని చాలా మంది అనుకుంటూ వుంటారు. పట్టపగలప్పుడే లోపలికి వెళ్ళడానికి భయపడతారు. ఆ ద్వీపం మరీ పెద్దదేం కాదు. రెండు ఫుట్‌బాల్ కోర్టులు కలిపితే ఎంతుంటుందో— అంతే వుంటుంది. ద్వీపం

మీద దట్టమైన చిన్న అడవి. అడవికి మధ్య విలాసగృహం. అక్కడికి వెళ్తే గంటలు క్షణాల్లా దొర్లిపోతాయి అరుణకి. అందుకే కనీసం వారానికి ఒకసారైనా పడవమీద ఒంటరిగా అక్కడికి వెళ్తుంది.

హంస ద్వీపం చేరుకోగానే పడవ దిగింది అరుణ. ఒడ్డుని వున్న మర్రి చెట్టుకి పడవతాడుని కట్టేసి, జేబురుమాల్తో మొహం తుడుచుకుని తలెత్తి చూసింది. అంతే! అయిదు నిమిషాలపాటు నిర్ఘాంత పోయి అలాగే నిలబడి పోయింది. కాస్తంతదూరంలో ఎదురుగా పెద్ద తాటి చెట్లంతవున్న నాలుగు తెల్లని స్తంభాలు వున్నాయి. వాటిమీద కోడిగుడ్డు ఆకారంలో బ్రహ్మాండమయిన పెద్దగోళం వుంది. ఆ గోళం పసుపుపచ్చరంగులో తళతళా మెరుస్తోంది. గోళానికి మధ్యగా ద్వారం వుంది. అక్కడి నుంచి కిందకి నిచ్చెన వేలాడుతోంది... అంతలో మాధవయ్య మాస్టారి పుస్తకాల్లోబొమ్మలు అరుణకి గుర్తుకు వచ్చాయి. 'రోదసీ నౌక' అసంటారు దీన్ని. విమానం అయితే రెక్కలుంటాయి. దీనికి రెక్కల్లేవు. రాకెట్ అయితే పొడవుగా వుంటుంది. ఇది అలా లేదు. అంచేత— ఇది రోదసీ నౌక అని తీర్మానించుకుంది అరుణ.

అంతలో గోళం తలుపు తెరుచుకుంది. ఎవరో మనిషి నిచ్చెనమీంచి క్రిందికి దిగి బైనాక్యులర్స్‌తో చుట్టూ చూస్తున్నాడు. అతనికి కనిపించకుండా చెట్టు చాటున దాక్కుందామనుకుంది అరుణ. కానీ అంతలోనే అతను అరుణని చూసి పెద్ద పెద్ద అడుగులు వేస్తూ అరుణవేపు రాసాగేడు. ధైర్యంగా నిలబడిందేగానీ, ఆ వస్తూన్న మనిషి ఆకారం చూస్తే, కొంచెం భయం వేసింది అరుణకు. ఆ వ్యక్తి పది గజాల పొడవు వున్నాడు. నీలం రంగు సూటు వేసుకుని ఎర్రని టై కట్టుకున్నాడు. తెల్లని బూట్లున్నాయి. ఫర్లాంగు దూరం పది క్షణాల్లో నడిచి, అరుణముందు నిలబడ్డాడు. తాటిచెట్టంత ఎత్తున్న మనిషిని మెడ ఎత్తి చూడాలంటే కష్టమనిపించింది అరుణకి. అతను అది గ్రహించినట్టున్నాడు. పెద్దసైజు తువాలు అంతున్న తన జేబు రుమాల్ని నేలమీదపరిచి, దాని మీద కూర్చున్నాడు. అలా కూర్చున్నప్పటికీ అతను అయిదుగజాల ఎత్తువున్నాడు ఎంత పెద్ద తలో! మన తలకన్నా అయిదురెట్లు పెద్దదిగా వుంది. పెద్దపెద్ద కళ్ళు...ఎందుకో నవ్వుతూ—

"నీ పేరేమిటి అమ్మాయ్?" అన్నాడు.

"అరుణ" అంది యాంత్రికంగా.

"నన్ను చూస్తే నీకు భయంగా వుందా?"

"నాకేం భయం!" అంది భయంగానే.

"మరి—నా పేరేమిటో అడగలేదేం?"

"మీ పేరేమిటి సార్?"

"నా పేరు ఆర్టిమస్ ..." అంటూ కరచాలనం చెయ్యడానికి తన కుడిచేతిని ముందుకి చాపేడు. అంత పెద్ద చేతిని చూసి భయపడినా, తనూ తన చిన్న చేతిని అందించింది.

"మీకు మా తెలుగు భాష వచ్చా సార్?" అనడిగింది అరుణ.

"భూగోళం మీదవున్న అన్ని భాషలూ నాకు వచ్చు"

"మీదేవూరు?" అంది కుతూహలంగా.

అతను ఆకాశంవేపు చెయ్యి చూపించి "అక్కడుంది మా వూరు" అన్నాడు.

"అంటే!?"

"మాది అంగారక గ్రహం...అదిగో, అది చూశావా ? దానిని రోదసీ నౌక అనంటారు. దాంట్లో ప్రయాణంచేసి వచ్చాం !"

"ఇక్కడ యింకా ఎన్నాళ్లుంటారు?"

"మీ లెక్క ప్రకారం ఇంకో నెల రోజులు వుంటాం."

"వుంటాం – అంటున్నారు ... మీరు ఒక్కరే గదా?"

"కాదు. నేనూ, నా భార్యా కలిసే వచ్చాం. అమెరికా, ఆఫ్రికా, స్విట్జర్లాండ్ వగైరా దేశాలన్నీ తిరిగి చివరికి ఇండియా వచ్చాం"

"మీ భార్య గారు కూడా మీ లాగే మీ అంత ఎతుగా వుంటారా?" అనడిగింది అరుణ సందేహిస్తూనే.

ఆర్టిమస్ నవ్వి – "నా కన్నా ఒక గజం పొట్టి" అన్నాడు. అంతలోనే "మా ఆవిడను చూస్తావా? తనూ నిన్ను చూసి సంతోషిస్తుంది" అన్నాడు మళ్ళీ.

"మీరు మానవులేనా...ఇంకేదయినా పేరుందా మీకు?"

"మేము మానవులం కాము. మమ్మల్ని 'అంగారక గ్రహవాసుల'ని అంటారు"

"మరి, మీరూ మాలాగే వున్నారే!?" అంది ఆశ్చర్యంగా.

అతను మళ్లీ నవ్వాడు. "అదంతేలే. సరే గానీ–ఇది అడవి కదా...ఒంటరిగా ఇక్కడికి ఎందుకొచ్చావ్?" అన్నాడు.

"నాకేం భయం. ఈ ద్వీపం మా తాతగారిది. అంటే నాదే! అదుగో–ఆ మేడ కూడా నాదే!!" అని జవాబిచ్చింది అరుణ గర్వంగా.

"ఓహో ... అయితే మేం నీ భూమి మీద దిగామన్నమాట. సరే – అందుకు ప్రతిఫలంగా నువ్వు కోరుకున్న సహాయం ఏదయినా చేస్తాను" అన్నాడు ఆర్టిమస్.

"అలాగే–థేంక్స్ !" అంది అరుణ.

"మళ్ళీ ఇటువేపు వస్తావా !"

"ఓ"

"సరే. ఈసారి వచ్చినప్పుడు మా రోదసీ నౌక దగ్గర నిలబడి ఆ స్తంభం మీద చెయ్యి వెయ్యి. నేను వెంటనే వస్తాను. వచ్చి నిన్ను మా రోదసీ నౌక లోకి తీసుకు వెళతాను. ఏమంటావ్?"

"అలాగే సార్"

"మళ్ళీ ఎప్పుడొస్తావు?"

"రేపు కాక ఎల్లుండి వస్తాను."

"రైట్" అంటూ అతను లేచి నిలబడ్డాడు.

మెడని బాగా వెనక్కి వంచి "మిస్టర్ ఆర్టిమస్‌గారూ, టాటా!" అంటూ చేతిని ఊపింది అరుణ.

నవ్వుముఖంతో తలూపి, పెద్ద పెద్ద అంగలో అతను రోదసీ నౌక వేపు నడిచాడు. అతను కనుమరుగయ్యేవరకూ శిలాప్రతిమలా నిలబడి అటే చూసింది అరుణ.




ద్వీపం మధ్య ఉన్న తన తాతగారి విలాస గృహం వేపు నడిచింది అరుణ. ఇదివరలో యిక్కడికి ఎన్నో సార్లు వచ్చింది గానీ, ఎప్పుడూ మేడ

లోపలికి వెళ్ళే ప్రయత్నం చెయ్యలేదు. లోపలేమైనా దెయ్యాలూ, పాములూ వుంటాయేమో అని భయసందేహాల్తో బైట మెట్లమీదే విసుగొచ్చే వరకూ కూర్చు నేది. ఎదురుగా కనిపించే చెట్లనీ, కుందే ళ్ళనీ, కోతుల్నీ, ఉడతల్నీ సరదా తీరే వరకూ చూసేది.

మరో నిమిషం కల్లా మేడ ముందున్న మెట్లమీద కూర్చుని వుంది అరుణ. ఎక్కడా గాలి లేదేమో చెట్ల ఆకులు కద లటం లేదు. వుండి వుండి చెట్ల కొమ్మల మీది పక్షులు కీచుగా అరుస్తున్నాయి. మెట్ల పక్కనే వున్న మామిడిచెట్టు అరుణ మీద ఎండ పడకుండా చేస్తోంది. కాసేపు తన అత్తయ్య, మామయ్యల గురించి ఆలోచించింది. మరి కాసేపు వంటలక్క పేరమ్మనీ, మాస్టారు మాధ వయ్యనీ తలుచుకుంది. వాళ్ళిద్దరి ఆదరణే గనక లేకపోతే-తన బ్రతుకు ఎంత హీనంగా వుండేదో అన్న ఆలోచన రాగానే అరుణ ఒళ్ళు ఝల్లుమంది. వాళ్ళ కూడా రాజేశ్వర త్తయ్యనిచూసి సింహాన్ని చూసినట్టు భయపడతారు. అంతలోఆమెకి 'పది గజాల మనిషి' ఆర్టిమస్ గుర్తుకి వచ్చేడు. 'ఎంత గమ్మత్తుగా వున్నాడో!' అనుకుని తనలోనే నవ్వుకుంది.

అప్పుడే అరుణ దృష్టిని ఒక విచిత్ర దృశ్యం ఆకర్షించింది. మేడమెట్లకి పై నున్న అరుగు మీద పెద్ద స్తంభం వుంది. స్తంభానికి ఎనిమిది అంగుళాల వెడల్పూ-పది అంగుళాల పొడవూ వున్న ఒక నలు చదరపు కన్నం కన్పించింది. అది ఎల కలు చేసిన కన్నంలా లేదు. పైగా దానికి కర్రతో చేసిన తలుపు వుంది. ఆ తలుపుకి అడుగు దూరంలో చిన్న నిమ్మ కాయంత ఆలిచిప్ప కనిపించింది... ఎంత అందంగా వుందో ఆలిచిప్ప!? చటుక్కున లేచి అరుగు ఎక్కింది. కొద్దిగా వంగి ఆలిచిప్పని చేతుల్లోకి తీసుకుంది.

ఎంత ఆశ్చర్యం!

ఆలిచిప్పలో చిన్న పాపాయి వుంది. చూడగానే ఏదో పురుగనుకుంది. కానీ, మానవాకారం స్పష్టంగా కన్పిస్తోంది. చిన్ని తల. చిన్ని చేతులూ, కాళ్ళూ. చిట్టి బొజ్జ - అచ్చం మనిషే. ఆ పాపాయి అంగుళం పొడవుంది. బాగా చెయ్యి తిరిగిన శిల్పి ఎన్నో ఏళ్ళు కష్టపడి ఈ పాపాయి బొమ్మని తయారు చేశాడా అనిపించింది. అంతలో తను చూస్తున్నది బొమ్మ కాదని గ్రహించింది అరుణ. ప్రాణం వున్నట్టు ఆ పాపాయి కాళ్ళూ చేతులూ కొట్టు కుంటోంది. పైగా అరుణని చూసి సంతో షించినట్టు బోసి నోరు తెరిచి నవ్వింది. ఆశ్చర్యంతో అరుణ ఒళ్ళు గగుర్పొడిచింది. ఆలిచిప్పని అరిచేతిలో పెట్టి అతి జాగ్రత్తగా తన ముఖానికి దగ్గరగా తీసుకు వచ్చింది. తను విడిచే వూపిరికి ఆ పాపాయి ఎక్కడ ఎగిరిపోతుందో అన్న భయంతో శ్వాస బంధించింది... నిజమే! ఇది బొమ్మ కాదు. నిజంగా ప్రాణం వున్న పాపాయి...ఆనందంతో కేరింతలు కొట్టడం స్పష్టంగా విన్పిస్తోంది. సంతోషంతో ఇందాకటికన్నా ఎక్కువగా కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూంది. చేతి వాచీ పని చేస్తోందో లేదో చూసేందుకు చెవి దగ్గర పెట్టినట్టు, ఆ పాపాయిని తన చెవి దగ్గరగా తెచ్చింది. శ్రద్ధగా విన్నది. ఆకలేసి పాలకోసం మారాం చేస్తున్న చంటిదాన్లా ఆ 'అంగుళం పాపాయి' అదే పనిగా 'ఊఁ...ఊఁ...' అంటోంది.

అంతలో అరుణకి పాదంమీద ఏదో సూది గుచ్చుకున్నట్టయింది. ఏ తేనెటీగో, కందిరీగో కుట్టి వుంటుందని, పాపాయిని జాగ్రత్తగా పట్టుకొనే కిందకి చూసింది. మళ్ళీ మరోసారి కుట్టినట్టయింది. 'అమ్మా' అంది బాధగా. ఒక అడుగు వెనక్కి వేసి మళ్ళీ కిందకి చూసింది. చూస్తూ, మరో సారి మరింతగా ఆశ్చర్యపోయింది అరుణ.

కిందని అరుగుమీద ఒక ఆడమనిషి వుంది. అయిదు అంగుళాలకన్నా ఎక్కువ ఎత్తు లేదు. తను ఇందాక చూసిన కన్నం దగ్గర నిలబడి వుంది. ఆ ఆడమనిషి చేతిలో గుండుసూదంతే వున్న ఆయుధం లాంటిదేదో వుంది. దాంతోనే తన పాదం మీద పొడిచి వుంటుందని అనుకుంది అరుణ. కొన్ని క్షణాలపాటు పరిశీలనగా ఆ స్త్రీ వేపు చూసింది.

అనాగరికులు కట్టుకున్నట్టుగా చీర లాంటిదేదో ఒంటికి చుట్టబెట్టుకుంది ఆ ఆడది. ఆ బట్ట దూరంనుంచే ముతకగా కనిపిస్తున్నది. ఆ బట్టని మోకాలికి పైనుంచి కట్టింది. దాన్నే నడుం చుట్టూ తిప్పి పైటలా భుజంమీద వేసుకుంది. జుత్తు శ్రద్ధగా దువ్వి, ఎడమవేపు కొప్పు పెట్టుకుంది. చెవుల దగ్గర తలకి ఇరు పక్కలా ఏదో గొలుసుల్లాంటివి వేలాడు తున్నాయి. మెడలో రకరకాల పూసల గొలుసులు వేసుకునివుంది. జాకెట్టు లేదు. జబ్బలమీద ఏవేవో పచ్చబొట్లు వున్నాయి... మరికొంచెం ఒంగి, ఆ అయిదు అంగుళాల స్త్రీని శ్రద్ధగా చూసింది అరుణ. ఆ విచిత్రస్త్రీని చూస్తూ తన పాదం నొప్పిని మరిచిపోయింది.

ఆ స్త్రీ శివమెత్తినదానిలా ఆవేశంతో వూగిపోతూంది. పిచ్చిదానిలా కోపంగా ఏవేవో కేకలు వేస్తూ రెండుచేతుల్తో ఛాతీ బాదుకుంటోంది. ఆమె చిన్నచిన్న కళ్ళలో కోపం వుంది. ఊగడం మూలాన కొప్పు విడిపోయి, జుత్తంతా చిందర వందరై దెయ్యం పట్టినదానిలావుంది. ఆమె వేస్తున్న కేకలు అరుణకి అర్థం కావడంలేదు. అసలు, ఆ భాషే అదో రకంగా, గమ్మత్తుగా వుంది...ఈలోగా అరుణ చేతిలోవున్న 'అంగుళం పాపాయి' ఏడవడం మొదలుపెట్టింది.

ఈ గొడవంతా ఏమిటో, ఎందుకో అప్పటికిగాని అరుణకి అర్థంకాలేదు. ఆ అయిదు అంగుళాల ఆడది ఈ అంగుళం పాపాయికి తల్లి. అందుకే అదలా మొత్తు కుంటోంది. ఈ పాపాయేమో ఇలా ఏడు స్తోంది. అంటే— తను తల్లినీ, పిల్లనీ వేరు చేసిందన్నమాట? ఇలా చెయ్యడం మహా పాపం అన్న మాధవయ్య మాస్టారి వాక్యాలు జ్ఞప్తికి వచ్చాయి. సరిగ్గా అప్పుడే అరుణకి తన తల్లి గుర్తుకి వచ్చింది.

కానీ, ఆ పాపాయిని వదిలిపెట్టబుద్ధి కావటం లేదు అరుణకి. 'జీవంవున్న బొమ్మ'ని ఎలా వదులు కోవటం!

కాసేపు ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది అరుణ. అరుగుమీద ముంగాళ్ళ మీద కూర్చొని, ఆ ఆడమనిషివేపు సూటిగా చూసింది. ఆ స్త్రీగోల మరీ ఎక్కువ కాసాగింది. తన భాషలో తిడు తున్నది కాబోలు...!

"అబ్బ. ఆపు నీ గోల! ఎందుకలా అరుస్తావు? నీ ముద్దుల కూతుర్ని నేనేం చెయ్యడం లేదులే...కావాలంటే చూడు!" అని గట్టిగా కసిరింది అరుణ.

మళ్ళీ అంతలోనే— "నీ కూతురు

ఎంతో ముద్దుగా, ముచ్చటగా వుంది సుమా..." అంది శాంతంగా.

ఆ అనాగరికస్త్రీకి తెలుగుభాష రాదు కాబోలు... అరుణ మాటలు విని కూడా, ఇంతకుముందులాగే శివమెత్తినట్టు తెయ్యి మని గెంతుతున్నది. ముక్కు ఎగపీలుస్తూ, ఏడుస్తూ, ఏమిటో కీచుగా అరుస్తోంది. తన పాపాయి కోసం ఆ తల్లి పడ్తున్న బాధ చూడలేకపోయింది అరుణ.

"మహాతల్లీ ... ఇహ నీ గోల చాలించు. నీ కూతురికేమీ కాలేదు. నేనేమీ బ్రహ్మరాక్షసిని కాను. చూడు... నీ పాపాయి ఎంత భద్రంగా వుందో..." అంటూ తన చేతిలోని పాపాయిని ఆ తల్లి కాళ్ళ దగ్గర ఆలిచిప్పతో సహా వుంచబోయింది.

మళ్ళీ అరుణ చేతిమీద ఆ స్త్రీ గుండు సూదిలాంటి ఆయుధంతో గుచ్చింది. సూది మొన చాలా లోతుకి పోయింది. ఈసారి మరీ బాధగా 'అమ్మా' అని అరిచింది. కాలితో ఒక్క లాపు తందా మన్నంత కోపం వచ్చింది అరుణకి. బలవంతాన నిగ్రహించుకుంది. 'నీ పని ఇలా వుందా ?' అనుకుని, పిల్లని తల్లికి ఇచ్చే ప్రయత్నం మాను కుంది. జాకెట్లో దోపుకొన్న జేబు రుమా లుని తీసి - హఠాత్తుగా - ఆ అయిదు అంగుళాల స్త్రీ బుర్రమీద పడేసింది. ఊహించని ఈ సంఘటనకి ఆ స్త్రీ నేల మీద చతికిలబడింది. ఇదే అదనుగా అరుణ ఆ స్త్రీని ఆ రుమాల్లోనే మూట కట్టింది. జాగ్రత్తగా నాలుగు అంచుల్ని ముడి వేసింది. కుడి చేత్తో పాపాయినీ, ఎడమ చేత్తో ఆ రుమాలు మూటనీ పట్టుకుని రెండు క్షణాలు అరుగు మీదే నిలబడింది. మూటలోని ఆడది వెర్రిగా కాళ్ళూ చేతులూ తన్నుకొంటూ, గింజు కుంటోంది.



అరుణ వెనక్కి తిరగబోయేంతలో- అరుగుమీద స్తంభం దగ్గర ఏదో చిన్న గొడవ వినిపించింది. పరీక్షగా అటే చూసింది. ఒక మగాడు తనవేపు పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. అదే సమయంలో స్తంభానికున్న కన్నంలోంచి నలుగురైదుగురు వచ్చి అతన్ని ఆపారు. అంతమంది ఆపినా అతనింకా గింజుకుంటూనే వున్నాడు. మిగతా వాళ్ళు ఏదో చెప్పి అతన్ని సమాధానపరుస్తున్నట్టున్నారు. ఆ మగాళ్ళందరూ ఆరేసి అంగుళాల కన్నా ఎక్కువ ఎత్తు లేరు. వాళ్ళు అనాగరికుల్లా వున్నారు. చిన్న గోచీ తప్ప ఒంటిమీద మరో వస్త్రం లేదు. మునుల్లా జుత్తుని నెత్తిమీద ముడి వేసుకున్నారు. ఆరు అంగుళాల మనుషులే అయినప్పటికీ వాళ్ళు కండలు తిరిగిన శరీరాల్తో బలిష్టంగా వున్నారు.

'ఆ స్తంభానికి వున్న కన్నంలో ఇలాంటి చిట్టిపొట్టి మనుషులు ఇంకెందరున్నారో!?' అన్న అనుమానం వచ్చింది అరుణకి. ఇంకా స్సేపు వుంటే ఏం ప్రమాదమో అనుకొని గబగబ మెట్లు దిగింది.

పడవ ఎక్కి శ్రీనిలయంవేపు సాగుతూ 'అమ్మయ్య' అని నిట్టూర్చింది.




చిలక సరస్సులో అరుణ వున్న పడవ నెమ్మదిగా సాగుతోంది. ఎదురుగా బల్లమీద ఆ స్త్రీ వున్న రుమాలు మూటనీ, ఆలిచిప్ప పాపాయినీ సంతృప్తిగా చూసింది అరుణ. తెడ్డు వెయ్యడం ఆపి రుమాలు మూటని విప్పింది. చటుక్కున ఆ స్త్రీ లేచి నిలబడింది. చుట్టూ ఓసారీ, ఆకాశం వేపు ఓసారీ బెంగగా చూసింది. తనకి అడుగు దూరంలోవున్న పాపాయి దగ్గరికి చిన్నచిన్న అడుగులు వేస్తూ పరుగెత్తింది. తటాలున వంగి ఆలిచిప్ప వుయ్యాలలో వున్న పాపాయిని ఎత్తుకుని తన ఛాతీకి అదుముకుంది. తన భాషలో ఏమేమో అంటూ, మధ్య మధ్య పాపాయిని ముద్దు పెట్టుకుంటున్నది.

పాపాయిని ఎత్తుకున్న ఆ స్త్రీ ఏమంటుందో వూహించడానికి ప్రయత్నించింది అరుణ, మెల్లిగా గెడవేస్తూ.

'నా చిట్టి తల్లీ...మా అమ్మే...నేనిక్కడే వున్నాను తల్లీ! నేను వచ్చేశానుగా మరింక ఏడవకు! ఈ రాక్షసి నిన్నెత్తుకుపోదులే... నేనున్నానుగా...!!?' - అంటోంది కాబోలు తన భాషలో.

అల్లంత దూరంలో ఒడ్డు వుందనగానే తల్లీ కూతుళ్ళనిద్దరిని రుమాల్లో మూట కట్టింది అరుణ. ఒడ్డు వచ్చేక-ఒక చేత్తో మూట పట్టుకుని జాగ్రత్తగా పడవ దిగింది. ఒక చేత్తోనే నేర్పుగా పడవ తాడుని గట్టునివున్న రాటకి కట్టేసింది. తాపీగా 'శ్రీనిలయం' భవనం వేపు నడక ప్రారంభించింది.

నడుస్తూన్నంత సేపు అరుణని ఎన్నో ఆలోచనలు చుట్టుముట్టేయి. దాదాపు రెండు గంటల క్రితం తాను చూసిన సంఘటనలు గుర్తుకి వచ్చేయి. పదిగజాల అంగారక గ్రహవాసి ఆర్టిమస్, ఆరు అంగుళాల అనాగరికులూ

ఆమె కళ్ళముందు చిత్రంగా మెదిలారు.. ఇన్నాళ్ళూ ఆమె జీవితం ఎంతో నిస్సారంగా వుండేది. కానీ, ఈవేళ జరిగిన సంఘటనలో కొత్త వుత్సాహం, గొప్ప బలం వచ్చినట్టయింది.

'శ్రీనిలయం' అరుణకికారాగృహంలా కనిపించింది. నిజం కూడా అంతే. తను అక్కడ ఒక ఖైదీ. రాజేశ్వరి ఆ కారాగృహానికి అధికారిణి. తనకి – అందరు ఆడపిల్లల్లా బయటికి వెళ్ళి, స్కూల్లోగానీ కాలేజిలోగానీ చదువుకొనే అవకాశంలేదు. నెలకోసారి డబ్బు యివ్వడానికి వచ్చే ప్లీడరుగారితో అరుణమీద ఎన్నో అబద్ధాలు కల్పించి చెప్తుంది రాజేశ్వరి. ఆయన కూడా రాజేశ్వరి కట్టుకథలు నమ్మి 'అరుణ పిచ్చిపిల్ల' అనే నిర్ణయానికి వచ్చేశాడు. అరుణ శ్రీనిలయం దాటి ఎక్కడికీ పోరాదని రాజేశ్వరి శాసనం. అది జవదాటితే – ఒకటి రెండు రోజులు భోజనం వుండదు.పోనీ మావయ్య అయినా ప్రేమగా చూస్తాడా అంటే–అదీ లేదు. అసలు అతను సాధారణంగా ఇంటిపట్టునే వుండడు. ఇంట్లో వున్న కొద్ది నిమిషాలూ అరుణని ఓ పురుగుని చూసినట్టుచూస్తాడు. భార్య అంటే కాస్త భయం. ఇంటిపట్టున వుండకుండా నాటకాలంటూ, రిహార్సల్స్ అంటూ దేశంమీదపడి తిరిగే భర్తని రాజేశ్వరి ఎన్నిరకాలుగానో సాధిస్తుంది. అన్నీ తలొంచుకుని మౌనంగా విని, తనకి కావల్సినడబ్బు తీసుకుంటాడు. డబ్బు చేతిలో పడ్డ మరుక్షణం సైకిలెక్కి పట్నానికి వెళ్ళిపోతాడు.

మూడేళ్ళకిందట ఒకసారి పండుగకి కొత్త బట్టలు కుట్టించమని అడిగింది అరుణ. చింకి బట్టల్తో ఎంతకని తిరగడం? అలా అడిగినందుకు శిక్షగా రెండు రోజుల పాటు అరుణని పాత సామాను కొట్లో పెట్టి తాళం వేసింది రాజేశ్వరి... అప్పట్నించీ, జాకెట్టు చిరిగినా, పరికిణీ చిరిగినా, ఓణీలు పీలికలైపోయినా కిమ్మనకుండా వుండడం నేర్చుకుంది అరుణ.

గేటు ముందు నిలబడి ఎదురుగావున్న భవనాన్నీ, అందులో వున్న అసంఖ్యాకమైన గదుల్నీ మనస్సులోనే వూహించుకుంది. అంతలో అసలైన సమస్య అరుణ ముందు పెనుభూతంలా నిలబడింది. ఈ అయిదు అంగుళాల స్త్రీనీ, అంగుళం పాపాయినీ ఎక్కడ దాచడం? వీళ్ళు రాజేశ్వరి కంటపడితే ఇంకేమయినా వుందా? బ్రహ్మాండం బద్దలు చేసినంత హడావిడి చేస్తుంది. 'ఎద్దులా పధ్నాలుగేళ్లు వచ్చేయి నీకు... బుద్ధిగా చదువుకోకుండా ఏమిటీ వెధవపనులు?' అని అడ్డమైన తిట్లూ తిడుతుంది. అక్కడితో వూరుకోక – తనకి ప్రాణప్రదమైన వీళ్ళని ఏ పెంటకుప్ప మీదికో, చిలక సరస్సులోకో గిరాటు వేస్తుంది.

అలా నడుస్తూనే వాళ్ళని ఎక్కడ దాచాలో ఆలోచించ సాగింది. పిల్లిలా చప్పుడు కాకుండా నడుస్తూ భవనంలోకి ప్రవేశించింది. మరికొన్ని క్షణాలకి వంటింట్లో నిలబడింది. పొయ్యిమీద పాలు మరుగుతున్నాయి. అవి పొంగిపోకుండా చూస్తూ నేలమీద కూర్చొనుంది పేరమ్మ. తన ఒళ్ళో తల పెట్టుకుని నిద్రపోతున్న పెంపుడు పిల్లిని ప్రేమగా నిమురుతూంది. అరుణని చూడగానే "వచ్చావా అమ్మా? నీ కోసం ఎంతసేపై చూస్తున్నానో తెలుసా? ఇంతకీ ఎక్కడికి వెళ్లేవూ?"

అంది పేరమ్మ. శబ్దానికి కళ్లు తెరిచిన నల్లపిల్లి కూడా అరుణని చూసి పలక రింపుగా? 'మ్యావ్' అంది.

"అలా షికారుగా వెళ్లేనులేగానీ, పేరమ్మా! కాసిని వేడివేడి పాలు ఇవ్వవూ... ఆకలేస్తోంది!" అంటూ ముక్కాలి పీటమీద కూర్చుంది.

గ్లాసులోకి మరుగుతూన్న పాలని తీసి పంచదార కలిపింది. పాల గ్లాసుని అరుణకి అందిస్తూ, ఆమె చేతిలో వున్న రుమాలు మూటని చూసింది పేరమ్మ. "ఏమిటమ్మా అదీ?" అని అడగనే అడిగింది.

"అదేమిటో తర్వాత చెప్తాలేగానీ, అత్తయ్య ఏం చేస్తోంది పేరమ్మా?" అన డిగింది అరుణ గాభరాగా.

"అత్తయ్యకింకా జ్వరం తగ్గలే దమ్మా. పట్నం నుంచి డాక్టర్ని తీసుకొచ్చారు మీ మామయ్య...రెండు మూడురోజులు ఆగితేగానీ జ్వరం తగ్గు ముఖం పట్టదన్నాడు డాక్టరు..."

'అమ్మయ్య!' అనుకుంది అరుణ. మరో రెండు రోజులు స్వేచ్ఛగా వుండొచ్చు అని సంబరపడింది.

"పేరమ్మా, పేరమ్మా! ఇవాళ నా గదిలోనే భోజనం చేస్తాను...ఏం?" అంది అరుణ చిన్నపిల్లలా గునుస్తూ.

పేరమ్మ మొహం ఇంత చేసుకుని నవ్వింది. "అలాగేలేమ్మా. భోజనం నీ గదిలోకే తెస్తాలే. ఇవాళ నీకు ఇష్టమని బంగాళా దుంపల వేపుడూ, కొబ్బరి పచ్చడీ చేస్తున్నాను..." అంది.

పాలు తాగేసి నిలబడింది అరుణ. తన గదివేపు వెళ్ళబోతూ ఏదో గుర్తొచ్చినట్టు ఆగిపోయింది. రుమాలుమూటలో మనిషికి భోజనం కావాలిగా!

"అన్నట్టు-పేరమ్మా! నాకివాళ ఎం చేతో బాగా ఆకలిగా వుంది. రోజూకన్నా ఓ రెండు ముద్దలు ఎక్కువే తీసుకురా" అంది.

"ఓ అలాగే" అంటూ పేరమ్మ అరుణ తలని ప్రేమగా నిమిరింది.

అరుణ వంటింటి గుమ్మందాటి హాల్లోకి వచ్చింది. కుడివేపు నున్న గది తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. ఆ గదిలోనే రాజేశ్వరి వుంటుంది. శబ్దం కాకుండా నడిచి హాలు దాటి జాగ్రత్తగా తన గది తలుపులు తీసింది. గదంతా చీకటిగా వుంది. స్విచ్ వేసి దీపం వెలుగులో గదంతటినీ పరిశీలనగా చూసింది.

ఈ అంగుళం మనుషల్ని ఎక్కడ దాచడం?

చివరికి తను పుస్తకాలు దాచుకునే మేజా సొరుగు లాగింది. పుస్తకాలన్నిటినీ ఓ మూలకి సర్దింది. రుమాలు మూటవిప్పి, తల్లినీ పిల్లనీ ఖాళీ జాగాలో పెట్టింది. ఆ ఆడమనిషి అరుణకేసి కోపంగా చూసి ఏదో అరవసాగింది. ఏమంటుందో విందా మని కాస వంగి ఆ స్త్రీ మాటలు విన్నది.

కుడిచేతిని అరుణ మొహం వేపు ఎత్తి "కన్నిబోజ్! కన్నిబోజ్! కన్నిబోజ్!!!" అంటూ కీచుగా కేకలు వేస్తూంది.

"నీకు పుణ్యం వుంటుంది గానీ అలా అరవకు. మా అత్తయ్య విన్నదంటే - నిన్నూ నన్నూ కూడా చంపేసుంది!" అంటూ అరుణ సొరుగుని లోపలికి తోసింది. గాలి వెళ్లేందుకుగాను అరంగు ళం సందు విడిచి పెట్టింది.

'కన్నిబోజ్ అంటే ఏమిటో? మాధ వయ్య మాస్టార్ని అడగాలి!' అనుకుంది.

అంతలో సౌరుగులో వున్న అంగుళం పాపాయి ఏడ్పు విన్పించింది. మళ్ళీ సౌరుగు లాగింది అరుణ... ఆ ఆడమనిషి పాపాయిని ఓదారుస్తూ తల నిమురుతూ పాలివ్వసాగింది. కుర్చీలో కూర్చొని ఆ ఆ దృశ్యాన్ని తమాషాగా చూడసాగింది అరుణ. అలా చూస్తూంటే ఆమెకి పది గజాల మనిషి ఆర్టిమస్ గుర్తుకొచ్చాడు. 'అతని భార్య ఎలా వుంటుందో? అన్నట్టు వాళ్ళకి పిల్లలున్నారో లేదో!' అనుకుంది.

పది గజాల పొడవుండే మనుషులు అంగారక గ్రహంలో వుంటారనీ, తన ద్వీపంలోనే అరంగుళాల మనుషులు వుంటారనీ అరుణ కలలో కూడా అనుకో లేదు. అలాంటిది-ఇవాళ ఆ రెండు రకాల వ్యక్తుల్నీ తన కళ్ళారా చూసింది.




ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందాఅని ఆత్రంగా ఎదురుచూసిన అరుణకి చాలా ఆల స్యంగా సూర్యోదయం అయింది. గబ గబా కాలకృత్యాలు తీర్చుకుని వంటింటికి వెళ్ళింది. హడావుడిగా పాలూ ఫలహారం తీసుకొని "అత్తయ్యకి ఇప్పుడు ఎలా వుంది పేరమ్మా?" అనడిగింది.

"నిన్నటికన్నా జ్వరం ఎక్కువైంది తల్లీ. పాపం, చాలా నీరసించి పోయింది" అంది పేరమ్మ.

అరుణ మొహంలోకి కాంతి వచ్చింది. 'మంచి పనైంది. తగినశాస్తి జరిగింది' అనుకుంది మనస్సులో.

అరుణ మనోభావం గ్రహించినట్టు- "నువ్వెక్కడికేనా వెళ్ళాలా తల్లీ?" అంది పేరమ్మ ఆప్యాయంగా.

"అవును పేరమ్మా, మాస్టారుగారి దగ్గరికి వెళ్ళాలి..."

"సరే! వెళ్ళు. మీ అత్తయ్య అడిగితే నీ గదిలో కూర్చుని పాఠాలు చదువు కుంటున్నావనే చెప్తాతే" అంది పేరమ్మ అనునయంగా.

"థేంక్యూ పేరమ్మా, నువ్వెంత మంచిదానివీ!" అంటూ ఒంగి ముడతలు పడ్తూన్న పేరమ్మ బుగ్గని ముద్దాడింది అరుణ.

"ఎంత అల్లరిపిల్లవమ్మా" అంటూ పేరమ్మ మెటికలు విరిచింది.

మళ్ళీ తన గదిలోకి వెళ్ళి తల్లినీ, పిల్లనీ రుమాల్లో మూటకట్టింది. గది తలుపులు దగ్గరసావేసి - లేడిలా గెంతు లేస్తూ, మాధవయ్య మాస్టారు వుండే పల్లెవేపు పరుగెత్తింది.

అరుణ వెళ్ళేసరికి మాధవయ్య తన పూరిపాకలో మూడేకాళ్ళున్న స్టూలుమీద కూర్చుని వున్నాడు. అతని చేతిలో లావుపాటి పుస్తకం ఏదో వుంది. ఎడమ చేత్తో కళ్ళద్దాలు సర్దుకుంటూ దీక్షగా చదువుకుంటున్నాడు. అరుణ వచ్చి గుమ్మంలో నిలబడి చప్పుడు చేసినా ఆయన తలెత్తలేదు. అది చూసి అరుణకి కొంచెం కోపం వచ్చింది. ఆయన దృష్టిని ఆకర్షించడానికి చిన్నగా దగ్గింది. అయినా ఆయనలో చలనం లేదు.

ఇక లాభం లేదని గ్రహించి అరుణ చరచరా ఆయన చేతిలోని పుస్తకం

తీసేసి ఓ మూల పడేసింది. అప్పటికి తలెత్తి చూశాడు మాధవయ్య. గంభీరంగా వున్న ఆయన మొహంలోకి నవ్వు వచ్చింది. బోసి నోటితో నిండుగా నవ్వేడు.

"ఓహో! రాజకుమారి అరుణకుమారీ దేవిగారా? రా.రా. కూర్చో" అంటూ మేజా పక్కనున్న కుర్చీ చూపించేడు. మారు మాట్లాడకుండా దానిమీద కూర్చుంది అరుణ.

"మీతో చాలా విశేషాలు చెప్పాలి మాస్టారూ" అంది కూర్చున్నాక.

"చెప్పు !"

తను హంసద్వీపం వెళ్ళడం, అక్కడ రోదసీనౌకని చూడ్డం, పది గజాల ఎత్తున్న అంగారకగ్రహవాసి ఆర్టిమస్‌తో మాట్లాడం వరకూ చెప్పి ఆగింది అరుణ.

"భేష్. బావుంది. ఇంకేం విశేషాలున్నాయి ?"

"ద్వీపం మధ్య మా తాతగారు కట్టించిన మేడ అరుగుమీద మరో వింతని చూశాను..." అంటూ రుమాలుమూట విప్పింది అరుణ. అయిదు అంగుళాల ఎత్తున్న ఆ స్త్రీనీ, అంగుళం పాపాయినీ మేజామీద వుంచింది. ఆ స్త్రీ పాపాయిని గుండెలకి అదుముకుంటూ, భయం భయంగా, ముసలి మాధవయ్యనీ, అరుణనీ మార్చిమార్చి చూడసాగింది.

తనకి ఆ పాపాయి కనిపించడం, ఆ తల్లి గుండుసూదిలాంటి ఆయుధంతో తన పాదాలమీద పొడవడం, దాని భర్త కాబోలు తనవెంట పడగా ఎవరో ఆపడం వాళ్ళు ఆరే అంగుళాలు ఎత్తు వుండటం — అంతా వివరంగా చెప్పింది అరుణ. ఆమె చెప్పిందంతా సావధానంగా విన్నాడు మాధవయ్య.

"మాస్టారూ! నాకంతా అయోమయంగా వుందండీ. ఈ ఆడది నిన్నట్నించీ నేనేం పెట్టినా తినడం లేదు. ఆఖరికి నీళ్ళు కూడా తాగడంలేదు... దీనికి తోడు మా అత్తయ్య గనక వీళ్ళని చూసిందంటే ఏం చేస్తుందోనని భయంగా వుంది. అత్తయ్యకి తెలీకుండా వీళ్ళని ఎక్కడ దాచాలో ఎంత ఆలోచించినా నాకేం పాలుపోకుండా వుంది. ఒకవేళ రహస్యంగా దాచానే అనుకోండి... తిండీ తిప్పలూ లేకుండా ఇదెన్నాళ్ళు బ్రతుకుతుంది ?" అంది అరుణ దీనంగా.

ఓ అయిదు నిమిషాల వరకూ మాధవయ్య ఏమీ మాట్లాడలేదు. మాస్టారు ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారని గ్రహించింది అరుణ. కాస్సేపటికి మౌనం భరించలేక 'మాస్టారూ...!' అంటూ ఏదో చెప్పబోయింది. 'ష...' అని అరుణ నోటిని మూసేశాడాయన. మరో రెండు నిమిషాల ఆలోచన తర్వాత ఏదో అర్థం అయినట్టు నవ్వుతూ తల పంకించాడు. తెల్లని గడ్డాన్ని చేతో నిమురుతూ, గాజు గోళాల్లాంటి కళ్లతో చిన్నగా నవ్వుతూ అరుణని చూశాడు. తర్వాత పరీక్షగా ఆ పాపాయిని, ఎత్తుకున్న స్త్రీని చూశాడు... "ఊఁ" అన్నాడు అంతా అర్థమైపోయినట్లు. కళ్లజోడు తీసి పై పంచెతో కళ్లు తుడుచుకున్నాడు. మళ్లీ కళ్లద్దాలు పెట్టుకుని పై కప్పువేపు చూశాడు.

"పదిహేడో శతాబ్దంలోనో, పద్దెనిమిదో శతాబ్దంలోనో... సరిగ్గా గుర్తులేదు, కానీ ఆ కాలంలో ఇంగ్లాండులో స్విఫ్ట్ అనే పెద్ద మనిషి ఒకడు వుండేవాడు..."

"మాస్టారూ! ఇది ఇరవయ్యో శతాబ్దం" అంది అరుణ.

"...ఈ స్విఫ్ట్ అనే ఆయన డాక్టరు కూడానూ! అప్పుడప్పుడు పూసుపోక ఏవేవో కథలూ, కాకరకాయలూ రాసే వాడు. ఇతనికి కూడా నాలాగే మతి మరపు ఎక్కువని ఎక్కడో చదివిన జ్ఞాపకం... ఎక్కడ చెప్మా?!" అంటూ ఆగిపోయాడు మాధవయ్య. చేత్తో తల గోక్కున్నాడు.

అసంతృప్తిగా అటూ ఇటూ కదిలింది అరుణ.

"సరేలే. ఇప్పుడదంతా ఎందుకుగానీ- చెప్పవచ్చేది ఏమిటంటే ఆయనకి గలివర్ అనే స్నేహితుడు వుండేవాడు. ఈ గలివర్ నావికుడు. తక్కువవాడేం కాదు సుమా! ఓ సారి ఏం చేశాడో తెలుసా? ఇదిగో ఇలా ఆరేడు అంగుళాల ఎత్తుండే మనుషులున్న ద్వీపానికి వెళ్ళాడు... అక్కడ కొంత కాలం గడిపి, స్వదేశానికి వస్తూ, తనతోబాటు ఆరు ఆవుల్నీ, రెండు ఎద్దుల్నీ, ఎన్నో గొర్రెల్నీ, మేకల్నీ తెచ్చాడని విన్నాను... కాని మనుషుల్ని తెచ్చినట్టు ఎక్కడా లేదే-?" అంటూ మళ్లీ ఆలోచనలో పడ్డాడు.

ఆశగా ఆయనవేపు చూడసాగింది అరుణ.

"ఆఁ. ఇప్పుడు గుర్తొచ్చింది... గలివర్ ద్వారా ఈ విశేషాలు విన్న మరో నావికుడు ఆ ద్వీపానికి వెళ్లి ఈ మనుషుల్ని కొంతమందిని బంధించి తీసుకొచ్చాడు... ఇంతకీ ఈ ఆరేడు అంగుళాల మనుషులకి ఏదో పేరుండాలే!"

అంటూ మళ్లీ తల గోక్కున్నాడు మాధవయ్య.

"లిల్లిపుట్స్" అని అందించింది అరుణ.

"కరెక్ట్. తెలివైనదానివే"అని మెచ్చుకోలుగా అరుణని చూసి, "ఆ లిల్లిపుట్స్‌ని ఇంగ్లాండు తీసుకొచ్చి బోలెడు ధరకి ధనవంతులకి అమ్మేడు. ఈ సంగతి తెలుసుకున్న మన దేశపు రాజొకడు ఇంగ్లాండు వెళ్లి ఏభై మంది ఆడా మగా జనాభానీ, కొన్ని పశువుల్నీ కొని మన దేశానికి వాళ్లని తీసుకొచ్చాడు..."

"ఆ రాజు పేరేమిటి మాస్టారూ?"

"అతని పేరేమిటో సరిగ్గా ఎవరికి తెలియదమ్మా... అతన్ని అందరూ 'పర్లాకిమిడిరాజు' అని పిలుస్తారు" అంటూ మేజా మీదున్న అయిదు అంగుళాల స్త్రీని మరోసారి చూశాడు మాధవయ్య. "ఈ ఆడది ఆ సంతతికి చెందినదే అని నా నమ్మకం"

"నిజంగా! ?"

"ఈజాతి మనుషులు మన దేశంలో మూడువందల ఏళ్ళనుంచీ వున్నారన్న మాట...మనకి తెలీకుండా మన హంస ద్వీపంలోనే ఎలా వున్నారబ్బా! అయితే ఇన్నేళ్ళలోనూ వీళ్ల జనాభా బాగా పెరిగి వుండాలే!"

మాధవయ్య మాస్టారి మాటలు వింటూ అరుణ ఏదో ఆలోచన ప్రారంభించింది.

"ఇంగ్లాండులో ఇలాంటి లిల్లిపుట్ మనుషుల్ని ఒక్కొక్కర్నీ దాదాపు లక్ష రూపాయిలకి అమ్మేరట..." అన్నాడు మాధవయ్య హఠాత్తుగా.

"నిజంగా ! ?" అంటూ ఆశ్చర్యంగా మాస్టారి వేపు చూసింది అరుణ.

ఆ అయిదు అంగుళాల స్త్రీ కి కాళ్లు నొప్పి పుట్టేయి కాబోలు, నిలబడలేక మేజామీద చతికిలబడి కూర్చుంది. ఆమె ఒళ్ళో అంగుళం పాపాయి నోచ తెరుచుకుని నిద్రపోతూంది. తల్లి మాత్రం మిడుతూమిడుతూ మాధవయ్యనీ, అరుణనీ చూస్తోంది.

"ఇంతకీ అరుణా! నువ్వేం చేద్దామనుకుంటున్నావు?"

"మళ్ళీ హంస ద్వీపం వెళ్తాను..."

"వెళ్ళి...?"

"మరికొంతమందిని తీసుకొస్తాను"

"తీసుకొచ్చి ?"

ఏం సమాధానం చెప్పాలో తోచక మౌనంగా వుండిపోయింది అరుణ.

'ఏమంటావ్?' అన్నట్టు నవ్వుతూ చూస్తున్నాడు మాధవయ్య.

"ఈ ఆడది లిల్లిపుట్ జాతిదో మరే జాతిదో గానీ......అదోలా వుంటోంది మాస్టారు..." అంది అరుణ.

"ఎలా వుంటోంది ?"

"ఎంత మంచి ఆహారం పెట్టినా తినడం లేదు"

"ఉహూ. నిరహారదీక్ష చేస్తోందన్న మాట !"

"మంచినీళ్లు కూడా తాగడం లేదు"

"ఆహా"



"ఏమీ చెయ్యదు. సరదాగా వుండదు. దిష్టిబొమ్మలా నా వేపు కొరకొరా చూస్తూ నిల్చుంటుంది. అంతే" అంది అరుణ నిరుత్సాహంగా.

మాధవయ్య మాస్టారు అరుణ వేపు సూటిగా చూశాడు.

"బాగుంది. ఇంతకీ ఆ లిల్లిపుట్ మనిషి ఏం చేస్తే బావుంటుంది నీకు?" అన్నాడు.

"నవ్వితే చూడాలని వుంది. కాలక్షేపం కోసం హాయిగా దానితో ఆడుకోవాలని వుంది..."

"ఆ ఆడది ఏం చేస్తే నీకేం? నీకూ దానికీ ఏమిటి సంబంధం? నువ్వు దాని యజమానురాలివా? అది నీకు బానిసా? ఇది ముందు చెప్పు"

అరుణ ఏదో అందామని అనుకునేంతలో మాధవయ్యే మళ్ళీ అందుకున్నాడు.

"చూడమ్మా అరుణా! ఒక విషయం చెప్తాను విను. నీకన్నా పదిరెట్లు పొడవున్న మనిషెవడో వచ్చి, నిన్ను తన రుమాలులో మూటకట్టి, తీసుకుపోయేడనుకో...నిన్ను వాళ్ళ దేశానికి లాక్కెళ్ళి భరత నాట్యం చెయ్యమనీ జయమాలినిలా డేన్స్ ఆడమనీ సర్కస్ ఫీట్లు చెయ్యమనీ వేధిస్తే ఏం చేస్తావు?"

అరుణ మాట్లాడలేదు. పది గజాల మనిషి ఆర్టిమస్ గుర్తుకొచ్చేడు. భయంగా కళ్ళు మూసుకుంది.

"అంచేత, నేను చెప్పేదేమంటే–ప్రపంచంలో ఎందరో మనుషులువున్నారు. ఎన్నో జాతులవాళ్ళు వున్నారు. ఎవరి మానాన వాళ్ళ బతకాలి. తమ స్వార్థం కోసం ఇంకో మనిషిని ఎప్పుడూ బలి చెయ్యకూడదు.......ఈ లిల్లిపుట్లే వున్నారు...వీళ్ళేదో అయిదారు అంగుళాల మనుషులనీ, గమ్మత్తుగా వున్నారనీ, వాళ్ళతో సర్దాగా కాలక్షేపం చెయ్యొచ్చనీ నువ్వు ఆశ పడుతున్నావు. కానీ, వాళ్ళకి ఎలా వుంటుందో ఆలోచించేవా? నువ్వెంత వుదారంగా వుండాలని అనుకున్నా, అందులో కూడా నీ 'గొప్పదనం' బైటపడుతుంది. నీకు తెలీకుండానే నీ ఆనందం కోసం వాళ్ళని హింసించడం మొదలుపెడ్తావు ... ఇదంతా ఎందుకు చెప్పూ? ఏమంటావు?" అన్నాడు మాధవయ్య మళ్ళీ.

"నేనేం వాళ్ళని బాధ పెట్టను మాస్టారూ"

"పోనీ నువ్వన్నట్టే అనుకుందాం. సరే, వాళ్ళని మచ్చిక చేసుకున్నావే అనుకో. అయినా వాళ్ళు ఆరు అంగుళాల మనుషులే కదా? నీతో స్నేహం చేసినంత మాత్రాన వాళ్ళేం నీ అంత మనుషులు అయిపోరుగద. నువ్వు వాళ్ళతో ఎంత స్నేహంగా మెలిగినా, చిన్న జీవాల వాళ్ళు కాబట్టి, వాళ్ళకి నువ్వంటే మనస్సులో ఓ మూల భయంగానే వుంటుంది. ఆ భయాలు పెట్టుకుని నీతో ఎంతకాలం స్నేహం కొనసాగిస్తారు?" అని ఆగాడు మాధవయ్య.

"వాళ్ళు అడవి మనుషుల్లా అనాగరికంగా వున్నారు మాస్టారూ! సరైనబట్టలు లేవు. తిండి వుందో లేదో తెలీదు. వాళ్ళకి కట్టూ బొట్టూ నాగరికతా నేర్పి, నా చేతనైన సహాయం చెయ్యాలనుంది మాస్టారూ..."

"వాళ్ళకి నువ్వు సహాయం చేస్తేనే ఇన్ని వందల ఏళ్ళుగా బతికేరా?"

"అయితే, నన్నేం చెయ్యమన్నారు మాస్టారూ?" అంది నిస్పృహగా.

"నన్నడుగుతావేం, నీ ఇష్టం వచ్చి నట్టు చెయ్యి" అన్నాడు మాధవయ్య సహాయ నిరాకరణ చేసే ధోరణిలో.

కాస్సేపు మళ్ళీ ఆలోచించింది అరుణ. ప్రాధేయ పూర్వకంగా మాస్టారి మొహం లోకి చూసింది "పోనీ, మీరైతే ఏం చేసే వారో చెప్పండి" అంది.

"నేనే గనక నీ స్థానంలో వున్నట్ట యితే - ఆ తల్లినీ, పిల్లనీ ఎక్కడి నుంచ యితే తెచ్చానో అక్కడే తక్షణం భద్రంగా విడిచిపెడ్తాను" అన్నాడు మాధ వయ్య నిర్వికారంగా.

అరుణ ఆనందం అంతా ఒక్కసారి చప్పగా చల్లారిపోయింది.

"అంతేనంటారా, మాస్టారూ?" అంటూ దిగులుగా ఆయన వంక చూసింది. తన జీవిత సర్వస్వం పోగొట్టుకున్నదానిలా ఆమె ముఖం నల్లబడింది. శరీరంలోని శక్తి అంతా మాయమైనట్టు అనిపించిందామెకి.

"అంతే!"

"అయితే, వీళ్ళని అక్కడ దిగబెట్టి వచ్చెయ్యమంటారా?" అని అడిగింది నీర సంగా.

"అవును"

"నాకు వాళ్ళతో స్నేహం చేసుకోవా లనీ, వాళ్ళకి ఎంతో సాయం చెయ్యాలనీ వుంది మాస్టారూ... వాళ్ళకోసం నా ప్రాణాలేనా ఇచ్చెయ్యగలను" అంది అరుణ తనలో తను అనుకున్నట్టు మెల్లిగా.

"నీ ఇష్టం. ప్రయత్నం చెయ్యి. కాని, ఒకటి మాత్రం గుర్తుంచుకో. ఉప్పూ చింతపండూ మూట కట్టినట్టు స్నేహి తుల్ని రుమాల్లో మూట కడితే - ఆ స్నేహాలు పెరగవు!" అని 'ఏమంటావు?' అన్నట్టు తల ఎగరేశాడు మాధవయ్య.

సిగ్గుతో తల వంచుకుంది అరుణ.

* * *

పడవ దిగి హంస ద్వీపం మీద కాలు పెట్టింది అరుణ. ప్రియాతిప్రియమైన వస్తువు ఏదో పోగొట్టుకుంటున్నట్టు అదోలా అయిపోయింది ఆమె మనస్సు. నెమ్మదిగా మేడ వేపు నడిచింది. మెట్లు ఎక్కి అరుగు మీద నిలబడింది. ఎక్కడా సందడి లేదు. స్తంభం కిందనున్న కన్నం లోంచి ఎవరూ బయటికి రాలేదు. కొంత సేపు చూసి చేతిలోవున్న అంగుళం పాపాయినీ, తల్లినీ అరుగుమీద జాగ్రత్తగా దించింది.

అయిదు అంగుళాల స్త్రీ నవ్వు మొహంతో కృతజ్ఞతగా అరుణ వంక చూసి, గౌరవ సూచకంగా తల వొంచి అభివాదం చేసింది. వెంటనే తుర్రుమని కన్నంవేపు పరుగెత్తి అందులో అదృశ్య మైపోయింది. ఆ అరుగు మీదే చాలా సేపు కూర్చొని చివరికి విసుగొచ్చి లేచింది. సరస్సు వేపు వెళ్తూ వుండబట్ట లేక ఓసారి వెనక్కి తిరిగిచూసింది.

అల్లంత దూరాన రోదసీ నౌక కని పించగానే 'ఆర్టిమస్' ఆహ్వానం అరుణకి జ్ఞాపకం వచ్చింది ... దగ్గరికి వెళ్ళి రోదసీనౌక స్తంభం మీద చెయ్యి వేసింది ... ఎక్కడో గణగణమంటూ గంటలు మోగిన చప్పుడు అయింది. మరుక్షణంలో మీద నున్న గోళం తలుపు తెరుచుకొంది. గుమ్మంలో పది గజాల ఆర్టిమస్ నిలబడి, కిందనున్న అరుణని చూశాడు. పలకరింపుగా నవ్వేడు.

చరచరా నిచ్చెన మీంచి దిగి "హలో అరుణా!" అన్నాడు.

"గుడ్ మార్నింగ్ సర్" అంది అరుణ మెడని బాగా ఎత్తి.

"గుడ్ మార్నింగ్ !" అంటూ తల పంకించాడు. నేల మీద కూర్చొని అరుణని నవ్వుతూ చూశాడు.

"రా అరుణా ! నా కోటు జేబులో కూర్చో. నిన్న మా 'రోదసీ నౌక' లోపలికి తీసుకు వెళ్తాను" అన్నాడు.

సందేహిస్తూనే ... అతని కోటు జేబులో కూర్చుంది. ఆర్టిమన్ నిలబడుతూ వుంటే-రంగుల రాట్నంలో కూర్చుని మీదికి పోతున్నట్టు అనిపించింది. నిచ్చెన ఎక్కి గోళంలోకి ప్రవేశించారు. అతను మళ్ళీ కూర్చోగానే జేబులోంచి కుందేలు గెంతినట్టు బైటపడింది అరుణ. బట్టలు సర్దుకుని చుట్టూ కలియజూసింది.

"నాతో రా. ఆ గదిలోకి వెళ్దాం నా శ్రీమతి అక్కడే వుంది. నిన్ను పరిచయం చేస్తాను" అంటూ అరుణని మరో గదిలోకి తీసుకువెళ్ళాడు ఆర్టిమన్.

"ఈ అమ్మాయే అరుణ...ఈమె నా భార్య యూపీ ..." అని ఒకరినొకరికి పరిచయం చేశాడు.

"రా పాపా, కూర్చో. నీ గురించి అంతా విన్నానులే" అంటూ యూపీ అరుణని ఆదరపూర్వకంగా నవ్వుతూ ఆహ్వానించింది.

యూపీ ఒంటి రంగు పసిమి వన్నెలో వుంది. బంగారం జుత్తు. భుజాల వరకూ వచ్చేట్టు కత్తిరించుకుంది. మోకాళ్ళ వరకూ వచ్చిన చేతుల్లేని గౌను వేసుకుంది. పెదిమలు ఎర్రగా వున్నాయి. మెడలో ముత్యాల హారం వుంది. దాదాపు తొమ్మిది గజాల ఎత్తు వుంది. ఆమెని కాసేపు వింతగా చూసింది అరుణ.

"మీ నాన్నగారు ఏం చేస్తుంటారు?" అని ప్రశ్నించింది యూపీ.

"నా చిన్నప్పుడే మా అమ్మా నాన్నా చనిపోయారండీ !"

"అయ్యో పాపం ! ఇంత చిన్న వయస్సులోనే నువ్వు ఒంటరిదానివయి పోయావన్నమాట!" అని యూపీ జాలిగా అరుణ వీపుమీద చెయ్యి వేసింది.

ఉబికివస్తున్న కన్నీటిని ఆపుకొంది అరుణ. తన గురించి వాళ్ళకి వివరంగా చెప్పింది. వంటలక్క పేరమ్మా, మాధవయ్య మాస్టారూ తప్ప తనని అభిమానించేవాళ్ళెవరూ లేరంది. ఆరు అంగుళాల మనుషుల గురించి చెప్పనా మాననా అని కాసేపు తటపటాయించింది. చివరికి వాళ్ళగురించి కూడా చెప్పేసింది.




మా తాతగారు చాలా పెద్ద జమీందారు గారట. ఈ హంసద్వీపం ఆయనదే. మా తాతయ్యకి మా నాన్నగారొక్కరే సంతానం. చిలక సరస్సు అవతల ఓ రెండు ఫర్లాంగుల దూరంలో శ్రీనిలయం అని మాకు పెద్ద భవనం వుంది. అచ్చం రాజమహల్ లాగ వుంటుంది. అందులో పెద్ద గదులు పాతిక వున్నాయి. చిన్న చిన్నవి చాలా గదులున్నాయి. పూర్వం

అందులో మా బంధువులూ, దివానూ, గుమాస్తాలూ, వాళ్ళ కుటుంబాలతో సహా వుండేవారట. మా నాన్నగారికి వేట అంటే ఎంతో సరదాట. మా అమ్మకి సరదాయే నట. నాకప్పుడు అయిదేళ్ళ వయస్సుం టుంది. అప్పుడేనన్నమాట...మా అమ్మా నాన్నా వేటకి వెళ్ళారు. దురదృష్టవశాత్తూ అడవిలో పెద్దపులి వాతబడి చనిపోయారు. రాజేశ్వరి అత్తయ్యా కామేశ్వరరావు మావయ్యా నాకు గార్డియన్‌లట. నా తర పున నా ఆస్తి వ్యవహారాలూ అవీ చూస్తూ వుంటారు. మొదట్లో మా కు వందలకొద్దీ ఎకరాల భూమి వుండేవట. ఇప్పుడు పదెకరాలు మిగిలే యి. శ్రీనిలయంకి కాస్త దగ్గర్లో చిన్న పల్లె వుంది. దాన్ని కొత్తపల్లి అంటారు. అక్కడే మాధవయ్య మాస్టారు వుంటారు... అక్కడికి మరో మూడు మైళ్ళ దూరంలో 'విశాలపట్నం' అని ఒక పెద్ద పట్నం వుంది. అక్కడ స్కూళ్లూ, కాలేజీలు, సినిమా హాళ్లూ, పెద్ద పెద్ద బజార్లూ, హోటళ్లూ, నైట్ క్లబ్బులూ, వున్నాయిట! నేనింతవరకూ అక్కడికి వెళ్లనేలేదు. మా అత్తయ్య నన్నసలు శ్రీనిలయం గేటు దాటి వెళ్లనివ్వదు!" అని ఆగింది అరుణ.

"ఇంత పెద్ద ఆస్తికి వారసురాలివై కూడా నీకిన్ని కష్టాలా? భూగోళంమీది మనుషులు చాలా దుర్మార్గుల్లా వున్నారు... కదూ డార్లింగ్?" అంది యూపీ భర్తని చూస్తూ.

ఆర్టిమస్ సాలోచనగా తల వూపాడు.

"స్కూల్లో చదువుకుంటానని ఎంతో ఏడ్చి మొత్తుకున్నాను. అల్లరి పెట్టేను. అయినా సరే, మా అత్తయ్య ఒప్పుకో లేదు. గుమ్మం దాటితే కాళ్ళు విరిచేసా నంది. నా బాధ చెప్పుకుందామన్నా, వినే వారెవరూ లేరు. వున్నా వాళ్ళు నాకేం సహాయం చెయ్యగలరు?" అంది అరుణ విచారంగా.

అరుణ కథ వింటూ ఆర్టిమస్ ఏదో ఆలోచిస్తున్నాడు. యూపీ అరుణ ధరిం చిన దుస్తుల్ని పరిశీలనగా చూస్తోంది. అరుణ తొడుక్కున్న జాకెట్టు బాగా వెలిసి పోయి, రంగు మాసింది. పైగా భుజం మీద చిన్న చిరుగు వుంది. పరికిణీ కూడా అక్కడక్కడా చిరిగింది. చిరిగిన చోట అతుకులు వేసి వున్నాయి. వోణీ మాసి పోయి, అంచులు అసహ్యంగా పీలికల్లా వేలాడుతున్నాయి. అయినప్పటికీ మసి పాతలో చుట్టిన మాణిక్యంలావుంది అరుణ. ఆ అమ్మాయిని చూస్తూ వుంటే యూపీ హృదయం ద్రవీభూతమైంది. ఆర్టిమస్ కూడా చాలా విచారించాడు. తను అంగారక గ్రహానికి వెళ్ళిపోయే లోగా, అరుణ పరిస్థితులన్నీ చక్కబర్చా లని మనసులోనే నిర్ణయించుకున్నాడు.

"నా యీడు ఆడపిల్లలు ఎంచక్కా బెల్‌బాటమ్ పేంట్లూ, ఫేషన్‌గావుండే బట్టలూ వేసుకుంటారట... మా మాధ వయ్య మాస్టారు చెప్పారు. ఉగాది పండుక్కి కొత్త బట్టలు తియ్యమని మా అత్తయ్యని ఓ రోజుని అడిగేను. అంతే, ఖస్సుమంది. భోజనం మాట దేవుడెరుగు పచ్చి మంచినీళ్ళు కూడా ఇవ్వకుండా, పాత సామాన్ల కొట్లో నన్ను పెట్టి బైట తాళం వేసింది. అదన్నమాట శిక్ష. అది జరిగిన తర్వాత- ఇప్పటివరకూ మళ్ళీ ఆ వూసు ఎత్తలేదు నేను" అంది అరుణ తన బట్టలని చూసుకుంటూ.

"నువ్వేమీ విచారించకు అరుణా! కొద్దిరోజులు ఓపిక పట్టు. మా గ్రహానికి వెళ్ళేలోగా నీ కష్టాలన్నిట్నీ మటుమాయం చేస్తాను. సరేనా? అంతవరకూ ధైర్యంగా వుండు. ఏం?" అన్నాడు ఆర్టిమస్ లాలనగా.

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ 'అలాగే' అన్నట్టు తలవూపింది.

"అదిగో- అదే పనికిరాదు!" అంటూ వొంగి తన పెద్దపెద్ద వేళ్ళతో అరుణ కన్నీటికి తుడిచింది యూపీ. "అందమైన నీ మొహంలో నవ్వుంటే ఎంతో బాగుంటుంది. ఏదీ...ఒక్కసారి నవ్వు... ఊఁ. నవ్వాలి మరి... ఆఁ అదీ—అలా నవ్వాలి!" అంది.

యూపీ పెట్టిన చక్కిలిగింతల్తో, దానిమ్మగింజల్లాంటి పలువరస మెరుస్తూంటే రమ్యంగా నవ్వింది అరుణ. ఆమె నవ్వుముఖాన్ని సంతృప్తిగా చూసింది యూపీ. తను కూడా చిన్నగా నవ్వి- "అన్నట్టు, అరుణా! నీకేమైనా కథలు వచ్చా?" అనడిగింది.

"ఓ వచ్చు. బోలెడు కథల పుస్తకాలు చదివానుగా"

"కథలంటే నాకెంతో ఇష్టం. నాకో బుల్లికథ చెప్పవా?" అంది యూపీ.

"నాక్కూడా కథలంటే ఎంతో ఇష్టం... చెప్పు అరుణా" అన్నాడు ఆర్టిమస్ కూడా ఆసక్తిగా.

ఏ కథ చెప్దామా అని ఆలోచించింది అరుణ. ఓసారి యూపీనీ, ఆర్టిమస్‌నీ చూసింది. ఆమె చెప్పబోయే కథ కోసం వాళ్ళు వుత్సాహంగా ఎదురు చూస్తున్నారు. కథ చెప్పడం ప్రారంభించింది అరుణ.

* * *

"మా భూగోళం మీద జర్మనీ, ఫ్రాన్స్ అని రెండు దేశాలున్నాయి. మీకు తెలుసా?" అనడిగింది.

"ఓ. తెలుసు" అన్నారిద్దరూ ముక్తకంఠంతో.

"సరే. అవి రెండో ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులన్నమాట. జర్మనీ వాళ్లు ఫ్రాన్స్‌మీద బాంబులువేసి చాలా ప్రదేశాల్ని ధ్వంసం చేసేశారు... ఓ రోజున జర్మనీ సైనికుడొకడు చేతో తుపాకీ పట్టుకుని, మంచినీటికోసం కాస్తంత దూరంలో వున్న చెరువుదగ్గరికి వెళ్లేడు. దాహంతీరా నీళ్లు తాగేక మూతి తుడుచుకున్నాడు. అంతలో అతనికి మరికొంచెం దూరంలో ఒక వ్యక్తి కన్పించాడు. ఆ వ్యక్తి బిగ్గరగా పిచ్చిపట్టిన వాడిలా ఏవేవో కేకలు వేస్తున్నాడు. జర్మనీ సైనికుడికి అదేదో తమాషాలా కన్పించింది. ఆ వ్యక్తివేపు తుపాకీని గురిచేసి అటు నడిచాడు. అలా కేకలు వేస్తున్న వ్యక్తి ఫ్రాన్స్‌దేశానికి చెందిన రైతు. మనిషి చూడ్డానికి బికారివాడిలా వున్నాడు. 'ఇరవై ఆరు... ఇరవై ఆరు... ఇరవై ఆరు...' అంటూ దెయ్యం పట్టిన వాడిలాగ వూగిపోతూ అరుస్తున్నాడు. తనవేపు తుపాకి గురిచేసి వస్తూన్న జర్మన్ సైనికుడిని చూసి బెదిరిపోతూ రెండు చేతుల్నీ పైకెత్తాడు. అప్పుడు కూడా 'ఇరవై ఆరు' అంటూ గుక్కతిప్పుకోకుండా అరవడం మానలేదు. జర్మన్ సైనికుడికి మతిపోయినట్టుంది. అతన్ని చూసి 'ఎందుకలా ఇరవయ్యారంటూ అరుస్తున్నావు?' అనడిగాడు కోపంగా. ఇంకా 'ఇరవయ్యారు ఇరవయ్యారు' అని అరుస్తూనే భయం



భయంగా అయిదుగజాల దూరంలో వున్న పెద్ద బావివేపు చూశాడు ఫ్రాన్స్ దేశపురైతు. ఇదేమిటో విచిత్రంగా వుందే అనుకుంటూ, తుపాకీ దించి అటువేపు వెళ్లేడు సైనికుడు. గట్టు మీద చేతిని ఆనించి లోపల ఏముందో చూద్దామని ఒంగేడు. అంతే! వెంటనే అతని వెనగ్గా ఫ్రెంచి రైతు వెళ్లి, ఆ జర్మనీ సైనికుడ్ని రెండుకాళ్లూ ఎత్తి బావిలోకి తోసేశాడు..." అంటూ ఆగింది అరుణ.

దీర్ఘంగా వూపిరి పీల్చి యూపీ, అర్టిమస్‌లని చూసింది.

ఇద్దరూ పకపక మంటూ నవ్వడం ప్రారంభించేరు.

"కథ యింకా పూర్తి కాలేదు. అప్పుడే నవ్వేస్తే ఎలా?" అంది అరుణ.

"కానీ మరీ–" అంది యూపీ.

"మరో పావుగంటకి ఇంకో జర్మన్ సైనికుడు అటు వచ్చాడు. అతన్ని చూస్తూనే ఫ్రెంచి రైతు వెర్రివాడిలా బావివేపు చూస్తూ, ఈ సారి 'ఇరవ

య్యేడు... ఇరవయ్యేడు' అని గట్టిగా కేకలు వెయ్యడం మొదలు పెట్టాడు. ఎందుకలా అరుస్తున్నాడో తెలుసుకుందామని వచ్చిన ఈ సైనికుడికి కూడా 'ఇరవై ఆరు'కి పట్టినగతే దిక్కయింది. ఆ రోజు సాయంకాలానికి 'నూరు' సంఖ్య పూర్తి చేసిగాని యింటికి వెళ్లలేదుట ఆ రైతు!" అని కథను ముగించింది అరుణ.

యూపీ, ఆర్టిమస్‌లు మరోసారి పకపకా నవ్వుకున్నారు. అలా కాసేపు సరదాగా గడిచింది.

"సార్. ఆర్టిమస్‌గారూ! మీరు నాకో చిన్న సహాయం చెయ్యాలి" అంది అరుణ ప్రాథేయ పూర్వకంగా.

"ఏం కావాలో అడుగు."

"మరేంలేదు సార్. ఆరంగుళాల మనుషుల గురించి మీకు చెప్పేను కదా! నాకేమో వాళ్లతో స్నేహం చేసుకోవాలనీ, వాళ్లకి నాగరికత నేర్పి సాయం చెయ్యాలనీ వుంది. కాని ఈ కోరిక ఎలా తీరుతుందోనని నాకు ఆందోళనగా వుంది. వాళ్ల భాషగానీ, పద్ధతిగానీ నాకు తెలీదు. వాళ్లకి మంచి బట్టలు కుట్టించి ఇద్దామంటే నా దగ్గర డబ్బులేదు. అసలు నాకే సరయిన బట్టలు లేవు...వాళ్ళ భాష నేర్చుకుని,వాళ్ల గురించి బాగా తెలుసుకుని వాళ్ల స్నేహం, వాళ్ల అభిమానం పొందే వరకూ నాకు నిద్ర కూడా పట్టదు...ఏం చెయ్యమన్నారో చెప్పండి!"అంటూ ఆశగా ఆర్టిమస్ ముఖంలోకి చూసింది అరుణ.

కొంత సేపు ఏదో ఆలోచనలో మునిగాడు ఆర్టిమస్. తర్వాత ఆదర పూర్వకంగా నవ్వుతూ అరుణని చూశాడు.

"వాళ్ళని 'లిల్లిపుట్స్' అంటారు. వాళ్ళది 'బ్లెఫస్కూ' అనే ద్వీపం. మీ మానవుల్లాగే వాళ్లు కూడా ఎంతో నాగరికత సాధించారు. వాళ్ళకి కూడా ఒక భాషా, సంస్కృతీ, చక్కని ఇళ్ళూ, గొప్పనగరాలూ, పడవలూ, సైన్యం వుండేవి. వాళ్ళకి ఓ చక్రవర్తి కూడా వుండేవాడు. పద్దెనిమిదవ శతాబ్దపు మొదటి రోజుల్లో అనుకుంటాను... గలివర్ అనే నావికుడొకడు ఆ ద్వీపం మీదికి అనుకోకుండా వెళ్లేడు. అదంతా ఒక పెద్ద కథలే! గలివర్ వెళ్ళి వచ్చిన తర్వాత బిడెల్ అనే మరో నావికుడు ఆ ద్వీపానికి వెళ్ళి, వందలాది లిల్లిపుట్లని బంధించి తనతో తెచ్చేడు. ఇంగ్లాండులో వున్న కొంతమంది కోటీశ్వరులకి వాళ్ళని చాలా ఎక్కువ ధరకి అమ్మేడు. తాను కూడా పెద్ద కోటీశ్వరుడయ్యాడు. మీ మానవులు కుక్కల్నీ, పిల్లుల్నీ పెంచుకుంటారుగా – ఆరంగుళాల మనుషుల్ని వదులారా? ఈ సంగతి మీ దేశపురాజాకడికి తెలిసింది. ఎన్నో అమూల్యమైన రత్నాలూ, మణులూ ఇచ్చి కొంతమంది లిల్లిపుట్స్‌ని కొన్నాడు... వాళ్ళని పర్లాకిమిడి తీసుకొచ్చి ఎంతో జాగ్రత్తగా బంధించి వుంచాడు... కాని, ఓ రోజు రాత్రి వాళ్లు చాలా తెలివిగా తప్పించుకు పారిపోయారు.. వీళ్లు కొన్నాళ్లు మహేంద్రగిరి, గుణుపురం, పాతపట్నం, పాలకొండ, గుమ్మలక్ష్మీపురం, పార్వతీపురం అనే వూళ్ళని ఆనుకొనివున్న కొండల్లో–లోయల్లో కాలం గడిపారు. ఏ కారణం చేతనో ఆ వూళ్లు నచ్చలేదు వాళ్ళకి. చివరికి ఈ హంసద్వీపం చేరారు... అదీ వాళ్ళ కథ!" అన్నాడు ఆర్టిమస్.

అరుణ కళ్లు ఆనందంతో మెరిశాయి.

"ఇంతకి వాళ్ళ భాష ఏమిటి సార్?

మీకు తెలుసా?" అని అడిగింది ఆత్రుతగా.

వాళ్ళ భాష తెలుసుకుంటే వాళ్ళతో స్నేహం చేసుకోవడం సులువుగదా అని అరుణ ఆశపడింది.

"మొదట మీ దేశం వచ్చిన వాళ్లు వాళ్ళ లిల్లిపుట్ భాషనే మాటాడేవారు. రాజుగారి ఖైదు నుండి తప్పించుకుపోయేక - వాళ్ళకి పిల్లలూ, మనవలూ పుట్టడం జరిగింది కదా... వాళ్ళ జీవితాల్లో కూడా ఎన్నో మార్పులు వచ్చాయిగా... అంచేత ఈ తరంవాళ్ళకి ఆ లిల్లిపుట్ భాషరాదు. ఇప్పుడు వాళ్లు మాట్లాడే భాషని 'శబరభాష' అంటారు. ఆ భాష వాళ్ళకి మాతృభాష అయింది గాబట్టి-వాళ్ళని 'శబరులు' అనంటారు"

"సార్...సార్... నాకూ ఆ భాష నేర్పరూ?"అంది అరుణ తన ప్రాణాలన్నీ దానిమీదనే ఆధారపడివున్నట్టు.

ఆమె అమాయకత్వానికి నవ్వి - "అదంత తేలిక కాదు అరుణా. ఒక్క రోజులో ఆ భాష నేర్చుకోవడం అసాధ్యం!" అన్నాడు ఆర్టిమస్.

"పోనీ ఓమూడు వాక్యాలు నేర్పండి!" అంది.

"సరే-చెప్తాను. రాసుకో!"

చప్పున కాగితం, కలం తీసుకొని రాసుకోడానికి సిద్ధపడింది.

"బోతెన్ ఆమన్ - అంటే, ఎవరు నువ్వు?... అయిందా!"

"ఆఁ..."

"అంబెన్ ఇస్తా ఇపో-మీరు వస్తారా?"

"ఆగండాగండి...ఆఁ... చెప్పండి."

"ఖాన్ తిడ్ తమ్ - నిన్ను నేను కొడ్తాను... అన్నమాట! ఈ ఆఖరి వాక్యం మాత్రం తప్పనిసరి పరిస్థితుల్లో వాడు. లేకపోతే - అనవసరంగా ఇబ్బందిలో పడ్తావు...ఏం?"అన్నాడు ఆర్టిమస్.

అయిదు అంగుళాల స్త్రీ తనని 'కన్నిబోజ్' అని పదేపదే అనడం గుర్తు వచ్చింది అరుణకి. "సార్, కన్నిబోజ్ అంటే ఏమిటి?" అని అడిగింది. "కన్నిబోజ్ అంటే స్త్రీ భూతం అని అర్థం. ఏమలా అడిగావు? వాళ్ళు నిన్ను కన్నిబోజ్ అని అన్నారా ?" అన్నాడు ఆర్టిమస్.

అరుణ [illegible]పకున పడింది. నిజం చెప్పడానికి సిగ్గు వేసింది. "అబ్బే లేదండీ. ఊరకే తెలుసుకుందామని అడిగాను. చాలా థాంక్సండీ, ఆర్టిమస్‌గారూ!"అంది.

జవాబుగా అతను అందంగా నవ్వాడు. తను కూడా నవ్వి లేచింది. "ఇంక వెళ్తానండీ. లేకపోతే మా అత్తయ్య కోప్పడుతుంది" అన్నది.

"మళ్ళీ రావాలిసుమా?"అంది యూపీ. 'ఓ' అంటున్న అరుణ చేతిలో అర్ధరూపాయి అంత వున్న బంగారపు బిళ్ళ పెట్టి-"ఇది బజార్లో అమ్మి నీ కొత్త ఫ్రెండ్స్‌కి మంచి బహుమతులు కొను" అంది.

అరుణ హృదయం ఆనందంతో బరువెక్కిపోయింది. కృతజ్ఞతలు చెప్పడానికి కూడా నోటంట మాట రాలేదు. వినయంగా యూపీని చూసింది.

మొదట్లోలాగే ఆర్టిమస్ కోటు జేబులో కూర్చుంది. నిచ్చెన దిగుతూంటే- "ఓ అరుణా, మళ్ళీ ఈసారి వచ్చినప్పుడు మరో మంచి కథ చెప్పాలి సుమా!" అని యూపీ కేకేసింది.

"ఓ అలాగే" అని జవాబిచ్చింది అరుణ.

ఆర్టిమస్ జేబులోంచి దిగి, అతనికి మరోసారి థేంక్స్ చెప్పి, చిలక సరస్సు వేపు రాజహంసలా నడిచింది అరుణ. బుల్లి పడవ ఎక్కి శ్రీనిలయం వేపు వెళ్తూన్న అరుణని కనుమరుగయ్యేవరకూ చూస్తూ నిలబడ్డాడు ఆర్టిమస్.




రాజేశ్వరి జ్వరం ఇంకా తగ్గనే లేదు.

నాటకాల పోటీలు వున్నాయంటూ కామేశ్వరరావు ఏదో వూరు వెళ్ళాడు. అరుణ ఆనందానికింక పట్టపగ్గాలు లేవు. పది గజాల మనిషి ఆర్టిమస్ మాటలు మననం చేసుకోసాగింది. మాధవయ్య మాస్టారి దగ్గర్నించి తెచ్చిన 'గలివర్ యాత్రలు' పుస్తకం మరోసారి చదవడం అప్పుడే ముగించింది. ఒక చెట్టుకింద గలివర్ ఒళ్ళుమరచి నిద్రపోవడం, లేచి చూసేసరికి, వందలాది మంది ఆరంగుళాల లిల్లిపుట్ మనుషులు అతని శరీరం మీదికి నిచ్చెనల సాయంతో ఎక్కి తాళ్ళతో బంధించడం...అరుణ మనో నేత్రం ముందు మెదుల్తున్నాయి. ఎంత త్వరగా ఆ లిల్లిపుట్లు...అదే...ఆ శబలతో స్నేహం చేసుకుని–వాళ్ళతో ఆడుకుందామా అని తహతహలాడుతోంది ఆమె.

ఈలోగా పేరమ్మ వచ్చి "చిట్టితల్లీ అరుణా!" అని పిలిచింది.

ఆ పిలుపుతో అరుణ కంటూన్న తియ్యని కలలన్నీ చెదిరేయి. విసుగ్గా పేరమ్మని చూసింది, తన చేతిలోని పాల గ్లాసు అరుణకి అందించి "పాలు తాగేక నిన్నోసారి తన గదిలోకి రమ్మందమ్మా మీ అత్తయ్య!" అంటూ దీర్ఘం తీసింది పేరమ్మ.

ఆ మాట వినగానే అరుణ నోట్లో పాలు గుటక పడలేదు. దగ్గుతూ వుక్కిరి బిక్కిరి అయింది.

"మీ అత్తయ్య ఎందుకో చాలా కోపంగా వుందమ్మా. ఆవిడ మాటలకి నువ్వేం ఎదురు చెప్పక. అన్నిటికీ 'వూఁ' అను...పిచ్చిపిల్లా!" అంది పేరమ్మ ప్రేమగా అరుణ తల నిమురుతూ.

"అలాగేలే, పేరమ్మా" అంటూ ఖాళీ పాల గ్లాసుని ఆమె చేతిలో పెట్టింది.

"చిట్టితల్లీ......రాణీలా వుండాల్సిన దానివి. నీకిన్ని కష్టాలు ఎందుకు పెడుతున్నాడో మాయదారిదేవుడు......" అని గొణుక్కుంటూ పేరమ్మ వెళ్ళిపోయింది.

తన పరిస్థితిని చూసి జాలిపడుతున్న పేరమ్మని గమనించి ధైర్యం తెచ్చుకుంది అరుణ. ఏమైతే అదయిందని లేచి నిలబడింది. మనసులో జంకుగానే వున్నా–నిబ్బరంగా అత్తయ్య గదివేపు నడిచింది.

రాజేశ్వరి మంచం మీద మూలుగుతూ పడుకుని వుంది. రెండ్రోజుల జ్వరానికే బాగా చిక్కిపోయింది. ఆమెని చూస్తుంటే బోనులో వున్న, ఇంకా మచ్చిక కాని ఆడ పులి గుర్తొచ్చింది అరుణకి. బితుకుబితుకుమంటూ గుమ్మంలోనే నిలబడింది. అంత వరకూ బాధగా మూలుగుతున్న రాజేశ్వరి ముఖం అరుణని చూడగానే కోపంగా మారింది. దగ్గరికి రమ్మన్నట్టు చేతిని

వూపింది. బెరుగ్గా అత్తయ్య మంచం సమీపించింది అరుణ.

"మాయదారి జ్వరం వచ్చి మంచం ఎక్కేను. అమ్మాయిగారికి.ఆటవిడుపులా వుంది. ఏం?" అంది రాజేశ్వరి కొరకొరా చూస్తూ.

ఏం మాట్లాడాలో తోచక వూరుకుంది అరుణ.

"మొన్న చెప్పిన లెక్కలు చేశావా?"

"చేశానత్తయ్యా"

"ఇంగ్లీషు పాఠం ?"

"అదీ చదివేనత్తయ్యా"

"హిస్టరీ పాఠం?"

"అది కూడా చదివానత్తయ్యా!"

"నేను కంఠస్థం చెయ్యమన్న తెలుగు పద్యమో?"

అరుణ ఏదో జవాబు చెప్పబోయేంతలో- "అది కూడా చేసేశావా?" అంది రాజేశ్వరి కరుకుగా, వెక్కిరిస్తున్నట్టు.

"అవునత్తయ్యా!" అంది మెల్లిగా.

"ఏదీ అప్పచెప్పు!"

పచ్చి వెలక్కాయ నోట్లో పడినట్టయింది అరుణకి. ఆ పద్యం సగమే వచ్చు తనకి. మిగతాది కంఠస్థం చేద్దామనుకునే లోగానే ఆ 'ఆరంగుళాల శబరుల' గొడవ వచ్చిపడింది.

"దిష్టిబొమ్మలా అలా చూస్తావేం, అప్పచెప్పు!" అంటూ అంత నీరసంలోనే సింహంలా గర్జించింది రాజేశ్వరి.

గుండె రాయి చేసుకుని మొదలు పెట్టింది అరుణ.

అంతలో రాజేశ్వరి- "ఆఁ. చాల్లే" అని చెయ్యి ఎత్తగానే ఆపేసింది అరుణ. "నాకిప్పుడు వినే ఓపిక లేదు. తర్వాత అప్పచెప్పించుకుంటాను. ఒక్క తప్పు వచ్చినా వూరుకొనేది లేదు. జాగ్రత్త!!" అంది.

'అమ్మయ్య గండం గడిచింది!' అనుకుంది అరుణ.

"నేను చదవమన్న గ్రీకు పురాణ కథలు చదివేవా?" అని మళ్ళీ ప్రశ్నించింది రాజేశ్వరి.

చదివేనన్నట్టు తలూపింది.

"మూగదానివా ఏమిటి, నోరులేదూ?" అని గద్దించింది.

"చదివానత్తయ్యా!"

పరీక్షగా మేనగోడలి మొహంలోకిఒక నిమిషం పాటు తదేకంగా చూసింది రాజేశ్వరి.

"గోటేల్లోని క్రోటన్స్‌కి నీళ్ళు పోశావా?"

"ఇంకా లేదత్తయ్యా"

"ఎంచేత?"

"ఇంకా ఎండగా వుంది. కొంచెం చల్లబడ్డాక నీళ్ళు పోద్దామనీ..." అంటూ సంజాయిషీ చెప్పబోయింది అరుణ.

"నా శ్రాద్ధం. మరేం కొంప మునిగిపోలేదు. వెంటనే వెళ్ళి ఆ మొక్కలికి నీళ్ళు తగలెయ్యి !" అంది.

"అలాగే అత్తయ్యా" అంది అరుణ.

'రెండు రోజులై ఒంట్లో బాగులేదు కదా-నీకిప్పుడు ఎలా వుందత్తయ్యా?' అని పరామర్శిద్దామనుకుంది. కాని అలా అడిగితే, అందులో ఏం తప్పు పడ్తుందో... ఎన్ని తిట్లు తిడ్తుందో !

"ఎద్దులా కదలవేం ? వెళ్ళి నీళ్ళు పొయ్యి!" అంటూ గయ్యిమని అరిచింది రాజేశ్వరి.

అత్తయ్య కళ్ళలోకి ఓసారి వినయంగా చూసి మౌనంగా ఆ గదిలోంచి నిష్క్రమించింది అరుణ. 'పుణ్యం కోసం

పోతే పాపం ఎదురైందని ఇందుకే అంటారు కాబోలు...!' అనుకుందితనలో.

తోటమాలి రాజన్న తాత పదిరోజులు సెలవు పెట్టి, తన వూరికి వెళ్ళాడు. అప్పట్నించీ తోటపనంతా అరుణ నెత్తినే పడింది.

మేడ ముందున్న ముప్ఫయ్ గోలెల్లోనూ నీళ్ళు పోసింది.

అరుణ ఆ పని పూర్తి చేసేసరికి సూర్యాస్తమయం అయింది. తనగదిలోకి తన అజమాయిషీలోకి వసుంది. అలా వచ్చిన వెంటనే, అత్తయ్యనీ మావయ్యనీ గట్టిగా రెండు కిక్కులిచ్చి, మెడపట్టి



వెళ్ళి అరిచేతుల్ని చూసుకుంది. ఎర్రగా కందిపోయి వున్నాయి. ఒకటే మంట. ఇరవై ముప్ఫయి బాల్చీల నీళ్ళు నూతిలోంచి తోడడం అంటే మాటలా మరి?!

ఒక్కసారి వెక్కి వెక్కి ఏడవాలని పించింది. కాని ఆ దుఃఖాన్ని బలవంతాన అదిమి పట్టింది. ఇంకెన్నాళ్ళు ? తనకి 18 ఏళ్ళ వయస్సు రాగానే, ఆస్తంతా

మరీ శ్రీనిలయంలోంచి రోడ్డు మీదికి గెంటెయ్యాలి! అంతకంతా అనుభవించేట్టు చెయ్యాలి—అనుకుంది కసిగా.

యధాప్రకారం మామూలు సమయానికి వంటింట్లోకి వెళ్ళి భోజనానికి కూర్చుంది. మనస్సు బాగులేక ఆకలి కాలేదు. ఏమీ తినబుద్ధి పుట్టలేదు. అయినా, పేరమ్మ కొసరి కొసరి వడ్డించింది. తియ్యటి మాటలు చెపూ, బాధమరిపిస్తూ, అరుణ కడుపు నిండేలా తినిపించింది. 'మా అమ్మ ఇప్పుడు బతికి వున్నట్టయితే—నాకు ఇలాగే అన్నం పెట్టేది గాబోలు' అనుకుంధి. అలా అనుకోగానే అరుణకళ్లు చెమ్మగిల్లేయి.

భోజనం అయ్యేక కాసేపు ఏదైనా చదువుకుందామని ఎంతో ప్రయత్నించింది అరుణ. కాని, 'అరంగుళాలఎత్తుండే శబరులు' ఆమె కళ్ళముందు మెదిలేవారు. చేతిలో పుస్తకం వున్నా, దృష్టి అక్షరాల మీదే వున్నా, అరుణ ఆలోచనలన్నీ వాళ్ళ చుట్టూనే గిర్రున తిరగ సాగేయి. విసుగ్గా పుస్తకాన్ని మూసేసి, ఓ మూలకి గిరాటు వేసింది. మంచం ఎక్కి, తల మీంచి దుప్పటి కప్పుకొని పడుకొంది. కళ్ళు మూసుకుని నిద్రపోదామని ప్రయత్నించింది... ఏం లాభం? నిద్ర వస్తేగా!

'శబరుల్ని' తల్చుకునేకొద్దీ, అరుణలో అరంగుళాల మనుషుల్ని మొట్టమొదటి సారిగా తనే చూసినందుకు ఒక రకమైన గర్వం చోటు చేసుకుంది. యుద్ధం చేసి కొత్త రాజ్యాన్ని గెలుచుకున్న చక్రవర్తిలా, ఆమెమనస్సు సంతృప్తితో నిండిపోయింది. ఆ రాత్రల్లా రకరకాల ఆలోచనల్తో ఆమె సరిగా నిద్రపోనేలేదు.



తెల్లారేక, ఒక్కక్షణం వృధా కానివ్వకుండా మాధవయ్య మాస్టారి కుటీరానికి పరుగులు తీసింది.

అరుగుమీద అడుగుల చప్పుడు విన్న మాధవయ్య తల ఎత్తి అరుణని చూశాడు.

"స్వాగతం! సుస్వాగతం!! శబరదేశపు మహారాణి అరుణ కుమారీదేవికి సుస్వాగతం!!!" అన్నాడు నవ్వుతూ.

ఆయన మాటలు వినిపించుకోకుండా "మాస్టారూ! నేను చెప్పినవి ఏవీ?" అంది గాభరాగా.

"అదిగో" అంటూ మేజామీద వున్న పెద్ద అట్టపెట్టెను చేత్తో చూపించాడు మాధవయ్య.

ఎంత బరువుగా వుందోనని దాన్నోసారి చేత్తో పట్టుకుని ఎత్తి చూసింది. ఫర్వాలేదు. మరీ అంత బరువుగా లేదు.

"నేను చెప్పిన అన్ని వస్తువులూ తెచ్చారా మాస్టారూ?" అంది అరుణ.

"శబరదేశపు మహారాణి అరుణ కుమారీదేవిగారు ఆజ్ఞాపించడమూ- మహామంత్రి మాధవయ్య మరిచిపోవడమూనా? అసంభవం! నువ్వు చెప్పినవన్నీ తు.చ. తప్పకుండా తెచ్చాను. విప్పి చూసుకో!" అన్నాడు.

"సరే—నేను వెళ్ళివస్తాను మాస్టారూ" అంటూ అరుణ అట్టపెట్టెని చేతిలోకి తీసుకుంది. అరుణకి ఆ పెట్టె కొంచెం బరువుగానే తోచింది.

"ఒక్క నిమిషం ఆగు అరుణా! నువ్విచ్చిన బంగారు కాసు అమ్మితే మూడు వందల రూపాయిలు వచ్చాయి. కావాల్సిన సామాన్లన్నీ కొనగా ఇంకా ఎనభై రూపాయిల చిల్లర మిగిలింది... ఇదిగో యిందు..."

"అమ్మో! నా దగ్గర వద్దు, అత్తయ్య

చూస్తే నీకు డబ్బు ఎక్కడిదని చంపే స్తుంది. మీ దగ్గరే వుంచండి. ఆ లెక్కలన్నీ తరవాత చూసుకుందాం....వస్తాను మాస్టారూ!" అని మరోమాట వినిపించుకోకుండా, అట్టపెట్టె పట్టుకుని, చిలక సరస్సు వేపు చెంగు చెంగున దారి తీసింది అరుణ.

* * *

పడవ దిగి తాడుని ఒడ్డుని వున్న చెట్టుకి కట్టింది అరుణ. అక్కడే నిలబడి తనకి ఎదురుగా వున్న హంస ద్వీపాన్నీ, రోదసీ నౌకనీ, మేడనీ ఓసారి చూసింది. మొదట రోదసీనౌకదగ్గరికి వెళ్ళి యూవీ, ఆర్టిమస్‌లని కలుసుకుందామా అనుకుంది. కానీ, అరంగుళాల శబరుల్ని వెంటనే చూడాలన్న కోరిక ఎక్కువ కావడంతో మేడవేపే వెళ్ళామని నిశ్చయించుకుంది. తను తెచ్చిన అట్టపెట్టెను చెట్టు మొదట్లోనేవుంచి గబగబ మేడవేపు నడిచింది. మెట్లు ఎక్కి అరుగుమీద కూర్చుంది. స్తంభానికి వున్న కన్నం వేపు చూసింది. పిట్టపురుగు లేదక్కడ!

'ఈ ప్రదేశాన్ని ఇరవైనాలుగ్గంటలూ ఎవరేనా కాపలా కాస్తూ వున్నారేమో... శత్రువు రాగానే- పసికట్టి కన్నంలోకి దూరిపోయి దాక్కుంటున్నారేమో... ?' అనుకుంది అరుణ.

చేతో కాగితం పట్టుకుని ఆర్టిమస్ చెప్పిన వాక్యాలు మరోసారి చదివింది. కొంచెం ముందుకి వంగి కన్నం దగ్గర చేతులు పెట్టి చప్పట్లు కొట్టింది. ఎవరేనా వస్తారేమోనని కాసేపు ఎదురుచూసింది. కాని ఎవరూ రాలేదు. 'మీరు వస్తారా ?' అనడానికి వాళ్ళ భాషేమిటో చూసింది. "అంబెన్ ఇత్రా ఇపో ?" అని గట్టిగా అరిచింది. అయినా లాభం లేకపోయింది. అలాగే మరో మూడుసార్లు కేక వేసింది. అప్పటికీ రాకపోయేసరికి ఒళ్లు మండింది అరుణకి.

"ఏయ్, ఎవరక్కడ ? వస్తారా ! రారా ?" అనరిచింది తెలుగులో. మరి కొంచెంసేపు చూసింది. చివరికి చిరాకేసి- "మర్యాదగా బయటికి రాకపోతే- షెన్ తిద్ తమ్ ?" అంది, తెలుగు - శబర భాషలు కలిపేసి.

అంతలో ఆర్టిమస్ హెచ్చరిక అరుణకి గుర్తుకొచ్చింది. 'షెన్ తిద్ తమ్'- అంటే 'నేను నిన్ను కొడతాను' అన్నమాట ! ఈ మాట అత్యవసరం అయితేనే వాడమన్నాడతను. కోపంలో తనిప్పుడు అనేసింది. లోపల వున్న అరంగుళాలవాళ్ళు వస్తారో, రారో ! 'తంతా' అంటే ఎవరైనా వస్తారా ?

ఆ సరికి కన్నం దగ్గర ఏదో చప్పుడయింది. ఒక అంగుళం సందు వుండేట్టు తలుపు తెరుచుకుంది. తలుపు సందులోంచి ఒక మగ తలకాయ అరుణవేపు తొంగిచూసింది. అరుణ తన కోపాన్నంతటినీ దిగమింగి నవ్వుతూ అతన్ని చూసింది. దగ్గరికి రమ్మన్నట్టు చేతిని వూపింది. మళ్ళీ "అంబెన్ ఇత్రా ఇపో ?" అంది ప్రాథేయపూర్వకంగా.

ఆ మనిషి ఏమనుకున్నాడో ఏమో ? భయం భయంగా చిన్న చిన్న అడుగులు వేస్తూ కన్నంలోంచి బైటికి వచ్చాడు. అరుణకి గజం దూరాన నిలబడ్డాడు. అతని ముఖంలో విపరీతమైన భయం వుంది. సన్యాసులలా పాదాలవరకూవచ్చే కాషాయరంగు చొక్కా వేసుకుని వున్నాడు. సన్నగా వెనక్కి దువ్వి



కొన్ని జుత్తు భుజాలమీద పడుతూంది. తలా, గడ్డం, మీసాలూ తెల్లగా పండి పోయి వున్నాయి. మిగతా వాళ్ళలా కాకుండా ఇతను ఎనిమిది అంగుళాల పొడవున్నాడు. తనకి ఎదురుగా చిన్న సైజు పర్వతంలా వున్న అరుణని ఎగాదిగా చూస్తూ, కీచు గొంతుకతో– "బోతస్ ఆమస్ ?" అనన్నాడతను.

'ఎవరు నువ్వు ?' అనడుగుతున్నాడు తనని. అరుణకి ఏంసమాధానం చెప్పాలో తెలీలేదు. ఆ భాష పూర్తిగా తెలిసేగా..! చేసేదిలేక అదే ప్రశ్న తనూ వేసింది. వెంటనే ఆ ఎనిమిది అంగుళాల మనిషి సన్నగా "బుయ్యా"అని అరిచేడు.

'బుయ్యా' అంటే ఏమిటో ? అరుణ తెల్లబోతూ అతన్ని చూడసాగింది. అతను కూడా ఏం చెయ్యడానికీ పాలుపోక చేతులు నలుపుకొంటూ అరుణని చూస్తున్నాడు. అంతలో గలభాగా స్తంభానికి వున్న కన్నం దగ్గర ఏదో గోల వినిపించింది.

'బుయ్యా' వెనక్కి తిరిగి చూసి వాళ్ళు చెప్పిందేదో విన్నాడు. తలుపు సందుల్లోంచి ఇంకా ఏవేవో కేకలు విన్పిస్తున్నాయి. ఆ కేకలన్నీ విన్నాక, అరుణ వేపు తిరిగాడు బుయ్యా. మెడ ఎత్తి ఆమెని చూస్తూ కీచుగా శబరభాషలో ఏదో అరి

చేదు.

"నీకు తెలుగు భాష రాదా ?" అంది అరుణ శాంతంగానే.

"ఇక్కడనుంచి వెళ్ళిపోండి" అన్నాడు ఆ బుయ్యా స్పష్టంగా తెలుగు భాష లోనే.

"నేనెందుకు వెళ్ళాలి? ఇది నా ద్వీపం. ఈ మేడ కూడా నాదే ! నా అనుమతి లేకుండా, నా భూమిమీద వుంటూ, పైగా నన్నే పొమ్మంటున్నావా?" అంది అరుణ అక్కసు కొద్దీ.

"మహా ఘనత వహించిన అమ్మ గారూ! వేలాది చంద్రకాలాల నుంచీ మేం ఇక్కడే వుంటున్నామండీ......" అన్నాడు బుయ్యా వినమ్రంగా. అతని ముఖం తెల్లగా పాలిపోయింది.

"మీరెన్నాళ్ళనుంచీ వుంటే నాకేం ? ఈ ద్వీపం నాది. ఈ మేడ నాది. నన్ను పొమ్మనడానికి నీకెన్ని గుండెలున్నాయి" అని దబాయించింది అరుణ.

బుయ్యా ఏమీ మాట్లాడలేదు. ఏం తోచనట్టు కాసేపు బుర్ర గోక్కున్నాడు. మళ్ళీ మెడ ఎత్తి అరుణని చూశాడు.

"ఆ విషయాలన్నీ మాకు తెలీవు అమ్మగారూ ! కానీ, మేము చాలాకాలం నుంచీ ఇక్కడ ప్రశాంతంగా జీవితం గడుపుతున్నాము. మా సన్న జీవాలమీద దయవుంచండి...మహా ఘనత వహించిన అమ్మగారూ !" అన్నాడు. దుఃఖంతో పాపం, గొంతు బొంగురు పోయినట్టుంది.

"అరే ! నువ్వు తెలుగు బ్రహ్మాండంగా మాటాడుతున్నావే..." అంది అరుణ ఆశ్చర్యంగా.

"మా తాత ముత్తాతలు ఈ దేశం వచ్చిన దగ్గరినుంచీ, మేము శబరభాషే కాకుండా, తెలుగు ఒరియా భాషలు మాట్లాడ్డం నేర్చుకున్నాం అమ్మగారూ! ఒకానొకప్పుడు 'బ్లెఫస్కూ' ద్వీపంలో వుండే మా పూర్వీకులు 'లిల్లిపుట్' భాష మాట్లాడేవారట...ఇప్పుడు మాకా భాష తెలీదు" అన్నాడు బుయ్యా చాలా వినయంగా.

ఆ ఎనిమిది అంగుళాల ముసలి బుయ్యాని చూస్తున్నకొద్దీ అరుణకి ముచ్చటగా వుంది. అతన్ని చూస్తూంటే ఏమీ మాట్లాడబుద్ధి కావటం లేదు.

"మహా ఘనత వహించిన అమ్మా! మా దేశప్రజల కోరిక ఒకటి విన్న విస్తాను...దాన్ని మన్నిస్తారా ?"

"తప్పకుండా!"

"మా మేలుకోరే వారైతే-దయచేసి తక్షణం ఈ ప్రదేశాన్ని విడిచి వెళ్ళి పోండి. మళ్ళీ ఎన్నడూ ఇక్కడికి రాకండి!" అన్నాడు.

'మళ్ళీ పాతపాటే పాడుతున్నాడు' అనుకుంది అరుణ విసుగా. శాంతం భూషణం అన్నారుగా...అంచేత శాంతిం చక తప్పలేదు.

"ఇదిగో ఇలా చూడు బుయ్యా...! ఇంతకీ 'బుయ్యా' అంటే నీ పేరా ?" అంది.

"కాదమ్మగారూ...నా పేరు కల్లా. నేను ఈ శబరజాతికి మతాధికారిని, విద్యా బుద్ధులు నేర్పే ఆచార్యుడిని. నేనీ ప్రజలకి పెద్దను గనుక నన్ను 'బుయ్యా' అని పిలుస్తారు"

"ఓహో ... అలాగా! సరే - నేనో మాట చెప్తాను. వింటావా బుయ్యా? మీరు ఆరేడు అంగుళాల చిన్న చిన్న మనుషులు ... అవునా! మీరీ ద్వీపంలో ఈ మేడకి కన్నం చేసి, ఎవరి కంటా

పడకుండా, ఎందుకు దాగుంటున్నారు?"

బుయ్యా తన చిన్న నోరు తెరిచి ఏదో చెప్పబోయేడు. కాని అరుణ మళ్ళీ మాట్లాడంతో అతను ఆగిపోయాడు.

"నువ్వేం చెప్పనక్కర్లేదు. నాకు తెలుసు. నాలాంటి మానవులు అంటే మీకు భయం. మేము మిమ్మల్నెక్కడ ఎత్తుకుపోతామో, మీ స్వేచ్ఛని మేమెక్కడ అపహరిస్తామో ..... అని కదా మీ భయం? అందుకే రహస్యంగా దాగుంటున్నారు. అంతే కదా! ... కాని నా అదృష్టవశాత్తు మీ అంగుళం పాపాయి నా కంటపడింది. ఆ క్షణం నుంచీ మీరు అంటే నాకెంతో అభిమానం ఏర్పడింది. మీకు నా చేతనయిన సహాయం చెయ్యాలని అనిపించింది. అందుకే మీ అందరితో స్నేహం కోరుతున్నాను ..."

"కానీ, ఘనత వహించిన అమ్మా..."

"నన్ను పూర్తిగా చెప్పనీ బుయ్యా! మీరు మంచిగా నాతో స్నేహం చేస్తే సరేసరి! లేదా మీ రహస్యం అందరికీ చెప్పేస్తాను. నాకు కోపం రానే రాదు. వస్తే మాత్రం అంతే మరి!"

"మహా ఘనత వహించిన అమ్మా.." పిరికిపిరిగ్గా మళ్ళీ ఏదో అనబోయాడు.

"ఒకటి మాత్రం నిజం! నాతో గనక మీరు స్నేహం చేస్తే-నేను నా శక్తికొద్దీ మీకు సహాయం చేస్తాను. రహస్యం ఎవరికీ చెప్పను. మిమ్మల్ని ఎంతో ప్రేమగా చూసుకుంటాను... నువ్వు లోపలికి వెళ్ళి ఈ విషయాలు మీ వాళ్ళకి చెప్పి, వాళ్ళేమంటారో కనుక్కో. మీ అందరి నిర్ణయం కోసం ఎదురుచూస్తూ నేనిక్కడే కూర్చుంటాను!" అంది అరుణ అదే తన నిశ్చయంగా.

బుయ్యా కాసేపు తటపటాయించాడు. చివరకి ఏమనుకున్నాడో గాని వెనక్కి తిరిగి కన్నం వేపు వెళ్ళాడు. అతను వెళ్ళగానే తలుపు చప్పున మూసుకుంది.

వెంటనే అరుణలేచి సరస్సు ఒడ్డుకి పరుగెత్తింది. చెట్టు మొదట్లో పెట్టిన అట్టపెట్టెని రెండు చేతుల్లోకీ తీసుకుంది. మళ్ళీ ద్వీపం మధ్యనున్న మేడ వేపు పెద్దపెద్ద అడుగులు వేస్తూ నడిచింది. సంభానికి గజం దూరంలో అరుగుమీద మఠం వేసుక్కూర్చుంది. కన్నంలోవుండే శబరులకి కనిపించకుండా, అట్టపెట్టెని తన వీపు వెనక దాచింది. పదే పదే తలుపు వేపు చూడసాగింది. ఒక్కొక్షణం గడుస్తూన్న కొద్దీ అరుణలో అసహనం ఎక్కువ కాసాగింది.

* * *

ఎలా అయితేనేం చివరికి తలుపు తెరుచుకుంది. సన్యాసి వేషంలో వున్న ఎనిమిది అంగుళాల బుయ్యా కన్నం దగ్గరే నిలబడి అరుణని నవ్వుతూ చూశాడు. బదులుగా అరుణ కూడా నవ్వింది. అతనిలో ఇదివరకూ వున్న భయం, బెరుకూ పోయినట్టున్నాయి. ధీమాగా అడుగులు వేస్తూ అరుణని సమీపించాడు. ఆమెకి అరడుగు దూరంలో నిలబడి గర్వంగా మెడ ఎత్తి చూశాడు.

"మహా ఘనత వహించిన అమ్మగారూ! మా శబర ప్రజలు మీతో సంధి చేసుకోడానికి ఒప్పుకున్నారు. మీతో స్నేహం చెయ్యడానికి కూడా ఏకగ్రీవంగా అంగీకరించారు. ఎప్పుడెప్పుడు మిమ్మల్ని చూస్తామా అని వాళ్ళంతా తహతహ లాడుతున్నారు..." అని ప్రకటించాడు బుయ్యా.

కన్నానికి వున్న తలుపు వేపు చూసింది అరుణ. తలుపు ఇంకా దగ్గర గానే వేసివుంది. అర అంగుళం మేరకి మాత్రం తెరుచుకుని వుంది. ఆ చిన్న సందులోంచి నాలుగైదు జతల చిన్న చిన్న కళ్ళు తొంగితొంగి చూస్తున్నాయి. కన్నం లోపల ఈ అంగుళాల మనుషులు యింకా ఎందరున్నారో! అంతలో అరుణ మోకాలిని తన బుల్లిచేత్తో తట్టేడు బుయ్యా ... "అమ్మగారూ! మీ శెలవైతే–మా పశువులనూ, మా శబరజాతినీ బయటికి రమ్మంటాను" అన్నాడు.

"భలేవాడివే! ఇంకా నా అనుమతి ఏమిటి? అందుకోసమే గదా నేనింతసేపూ ఇక్కడ ఓపిగ్గా కూర్చున్నానూ..." అంది అరుణ. తను చూడబోయే వింతలు వూహించుకుంటూ వుంటే ఆమె శరీరం గగుర్పొడుస్తోంది. అదో రకమైన ఉత్సాహంతో నవనాడుల్లోనీ రక్తప్రసారం ఎక్కువ కాసాగింది.

"ఊఊ" అని అదోలా గమ్మత్తుగా అరిచేడు బుయ్యా. ఊపిరి బిగపట్టి కళ్ళార్పకుండా కన్నంవేపు చూసింది అరుణ. ఏదో మంత్రం వేసినట్టు తలుపు తెరుచుకుంది.

ముందు కన్నంలోంచి ఆవులు వచ్చాయి. అరుణని చూసి అవి జడుస్తాయేమోనని కాబోలు వాటికి ముకుతాళ్ళు కట్టి ఆరేసి అంగుళాల శబరులు పట్టుకొని వున్నారు. దగ్గర దగ్గర ఏభై ఆవులు వున్నాయి. చిన్న గొంతుకల్తో కొన్ని 'అంబా' అని అరవసాగేయి. అరుణని చూసి అదేదో మహావృక్షం అనుకుని వుంటాయి. అంచేతే అవేమీ బెదరలేదు.

"అమ్మగారూ! మాకు వున్న ఆవులన్నీ అవే."

ఈసారి ఎద్దులు వచ్చాయి. అవి పాతిక ముప్ఫయ్ కన్నా ఎక్కువ లేవు. ఆవుల్లాగే యివి అయిదు అంగుళాల ఎత్తున్నాయి. అడ్డుకొలత–నాలుగు అంగుళాల చిల్లర వుంటుందనిపించింది. అంత చిన్న చిన్న జంతువులు గునగునా నడుస్తూంటే గమ్మత్తుగా అనిపించింది అరుణకి.

"అమ్మగారూ! మాకు ఈ కొద్దిపాటి ఎద్దులే వున్నాయి. వీటితోనే మేము వ్యవసాయపు పనులన్నీ చేసుకుంటాం. ఎంత జాగ్రత్తగా మేం చూసుకొన్నా ఏభయ్యేసి చంద్రకాలాలకో ఎద్దు మాయమైపోతూ వుంటుంది...." అన్నాడు బుయ్యా విచారంగా.

"మాయమైపోతాయా......ఎట్లా?" ఆసక్తిగా అడిగింది అరుణ.

"మీకు తెలీందేముంది అమ్మా! ఇదంతా అడవి గదా. ఇక్కడ పెనుపాములూ, అడవి పిల్లులూ, గెద్దలూ లెక్కలేనన్ని వున్నాయి. వాటి బారినుంచి మా పశుసంపదని కాపాడుకోవడం ఎంత కష్టమో నేను మీకు చెప్పలేను..." అన్నాడు మరీ దీనంగా.

"ప్చ్...పాపం!" అంది జాలిగా.

ఆ జాలిమాట వినేసరికి బుయ్యా ముఖం మళ్ళీ కాంతివంతం అయింది. "అదుగో అటు చూడండి, అమ్మగారూ! అవి మా మేకలు" అన్నాడు హుషారుగా.

'మేఁఏ' అన్న అరుపుల్తో చిన్న మేకల మంద వచ్చింది. రెండు అంగుళాల ఎత్తున్నాయవి. అరంగుళం ఎత్తున్న మేకపిల్లలు తల్లిమేకల వెనక కీచుగా అరుస్తూ పరుగెత్తున్నాయి. వాటినలా

చూస్తూంటే అరుణకి ఎంతో ముచ్చటే సింది...మెట్లు ఒకవేపున బాగా పాడ య్యేయి. సిమెంటు వూడిపోయి, మట్టి బయటపడి, ఆ ప్రదేశం అంతా ఏట వాలుగా తయారయింది. కొండ దిగుతు న్నట్టు పశువులన్నీ కిందికి దిగి, మేడ ముందున్న ఆవరణలో గడ్డిమేస్తున్నాయి.

ఈసారి కన్నంలోంచి తొమ్మిది అంగు ళాలు పొడవున్న మనిషి ఒకడువచ్చాడు. అతను ఏ ఎలక చర్మంతోనో చేసిన జోళ్ళు తొడుక్కుని వున్నాడు. పాదాల వరకూ వచ్చేట్టు ఏదో బట్టని లుంగీలా చుట్టుకుని వున్నాడు. భుజం మీద చిన్న గుడ్డని పై పంచెగా వేసుకున్నాడు. మనిషి చిన్న సైజువాడయినా కండలు తిరిగిన శరీరంతో దృఢంగా వున్నాడు. చెవులకి పోగులు వున్నాయి. నుదుటిమీద గుండ్రని ఎర్రటి బొట్టుంది. ఆ బొట్టు చుట్టూచిన్న చిన్న తెల్లని చుక్కలున్నాయి. ఎర్రని తలపాగా చుట్టుకున్నాడు. ఆ తలపాగాలో రంగురంగుల పక్షుల ఈకల్ని పెట్టుకు న్నాడు. యువకుడిలా లేడుగాని మరీ ముసలివాడు కాదు. నలభై యేళ్ళవాడిలా వున్నాడు. అతని కుడిచేతిలో ఆ రంగు ళాలు పొడవున్న బల్లెంలాంటి ఆయుధం వుంది.

అతను నెమ్మదిగా అడుగులు వేసి అరుణని సమీపించాడు. మెడని బాగా ఎత్తి ఆమెను ఓసారి చూసేక-పక్కనున్న బుయ్యా దగ్గరికి వెళ్ళి నిలబడ్డాడు. ఇద్దరు శబరులూ ఒకరినొకరు ఆప్యాయంగా, గౌరవంగా చూసుకున్నారు.

"మహాఘనత వహించిన అమ్మగారూ! వీరే మా శబరులకి పెద్ద. వీరిని మేము 'గొమాంగ్' అంటాం. మా శబరజాతి అంతా వీరి పరిపాలనలో, వీరి ఆజ్ఞాను సారం నడుస్తుంది" అని పరిచయం చేశాడు బుయ్యా.

గొమాంగ్‌ని చూసి పలకరింపుగా నవ్వింది అరుణ. అతను తల వంచి, రెండు చేతులూ ఎత్తి నమస్కరించేడు. అరుణకి ఏం చెయ్యాలో తోచలేదు.

"నా పూర్తి పేరు అరుణకుమారీదేవి. నన్నందరూ 'అరుణా' అని పిలుస్తారు. మీరూ అలాగే పిలవండి!"

"అమ్మగారూ" అంటూ ప్రారం భించాడు బుయ్యా.

"నా పేరు 'కల్లా' అయినప్పటికీ మా శబరజాతికి నేను మతాధికారినీ, ఆచార్యు డినీ గాబట్టి నన్ను 'బుయ్యా' అని పిలు స్తారు. ఈ 'గొమాంగ్' 'బుయ్యా' అనేవి మా హోదాల్ని తెలియ జేస్తాయి. మా జాతికి మొదటి పెద్ద ఈ 'గొమాంగ్'... రెండవ పెద్దని నేనే! మా మాటకి శబర జాతి అంతా కట్టుబడి వుంటుంది!" అని ముగించాడు గర్వంగా.

ఎంతసేపూ బుయ్యా తప్ప, గొమాంగ్ నోరు తెరవడం లేదు. భయమో, భాష రాదో అనుకుంది అరుణ. ఆ విషయం బుయ్యాని అడిగితే "అదేం కాదమ్మా... మాలో అందరికీ మీ భాష వచ్చు. కొత్తగదా అంచేత మౌనంగా వున్నారు మాగొమాంగ్" అని సమాధానం చెప్పాడు.

మెల్లిగా దగ్గి గొంతు సవరించు కున్నాడు గొమాంగ్. అరుణని చూస్తూ "అమ్మగారూ, మీ అనుమతి అయితే మా శబరజాతిని మీ ముందు సమావేశ పరుస్తాను" అన్నాడు.

"ఇంకా చూస్తారేం, పిలవండి త్వరగా" అంది ఉత్సాహంగా.

"ఉ...ఉ...ఉ...ఊ..." అని ఎలుగెత్తి అరిచేడు గొమాంగ్. తన దృష్టిని కన్నంవేపు మళ్ళించింది అరుణ.

ముందు బిలబిల లాడ్తూ వరసాగ్గా మగాళ్ళు వచ్చారు. అందరూ ఆరంగుళాల ఎత్తే వుండడం గమనించింది అరుణ. నిడుపాటి జుత్తుని సాధువుల్లా నెత్తిమీదికి దువ్వి ముడి వేసుకున్నారు. గోచీ తప్ప వాళ్ళ ఒంటిమీద మరో వస్త్రం లేదు. వాళ్ళ శరీరాలు ఆ సైజుకి దృఢంగానే వున్నాయి. అందరి చేతుల్లోనూ విల్లమ్ములు వున్నాయి. ఛాతీమీదా, చేతుల మీదా ఏవేవో పచ్చబొట్లు వున్నాయి... వాళ్ళ వెనకే పెళ్ళి నడకలు నడుచుకుంటూ ఆడవాళ్ళు వచ్చారు. అందరూ అయిదు అంగుళాల ఎత్తే వున్నారు. మోకాలిపైన బట్టకట్టి, దాన్నే భుజం మీదికి లాగి పైటలా వేసుకున్నారు. జుత్తుని నున్నగా దువ్వి ఎడమవేపుకి కొప్పులు పెట్టుకున్నారు. కొందరాడ వాళ్ళ చంకల్లో చిన్నిచిన్ని పాపాయిలు వున్నారు. కొందరు పాలు తాగుతున్నారు. మరికొందరు అరిచి గోల చేస్తున్నారు. మూడేసి అంగుళాల పిల్లలు తల్లుల వెనకా తండ్రుల వెనకా భయంగా నక్కి, బితుకు బితుకుమంటూ అరుణని చూస్తున్నారు... ఆడా మగా పిల్లామేకా అందరూ స్త్రీ పర్వతంలా కన్పిస్తోన్న అరుణని చూసి 'ఓఓఓ' అంటూ నోళ్లు వెళ్ళబెట్టేరు. వరసగా గుంపులుగా నిలబడ్డ వాళ్ళందర్నీ లెక్కపెడ్దామని ప్రయత్నించింది అరుణ.

"మొత్తం మీ జనాభా ఎంత?" అని అడిగింది బుయ్యాని.

"అమ్మగారూ..." అంటూ ఏదో ఆలోచనలో పడ్డాడు బుయ్యా. కాసేపు శబరభాషలో వాళ్ళ గొమాంగ్‌తో ఏదో చర్చించాడు. చివరికి మెడని ఎత్తి అరుణని చూశాడు.

"చిన్నా పెద్దా కలిసి మేమందరం వెయ్యికి పైగా వున్నామమ్మా. ఇంకో ఏభై చంద్రకాలాల్లో మా సంఖ్య మరో వందకి పెరగవచ్చని మా అంచనా" అన్నాడు బుయ్యా మాసిముసిగా నవ్వుతూ.

"చంద్రకాలం అంటే ఏమిటి బుయ్యా?"

"చంద్రోదయానికీ మళ్ళీ చంద్రోదయానికీ మధ్యనున్న కాలాన్ని మేం చంద్రకాలం అంటాం...మీరు ఒకరోజని అంటారు" అని బోధపరిచాడు.

"మీకోసం నేను కొన్ని వస్తువులు తెచ్చాను..." అంటూ తన వెనకదాచిన అట్టపెట్టెని వాళ్ళముందు వుంచింది అరుణ. అడుగు వెడల్పూ, రెండడుగుల పొడవూ, అడుగున్నర ఎత్తూ వున్న ఆ పెట్టెని శబరజాతి అంతా ఆశ్చర్యంగా చూసింది.




గొమాంగ్ వేపు చూసి "ఆడవాళ్ళనీ మగవాళ్ళనీ వేరువేరుగా నిలబడమని చెప్పండి" అంది అరుణ.

తన భాషలో ఏదో అరిచేడు గొమాంగ్. మరుక్షణంలో బాగా తర్ఫీదు పొందిన సైనికుల్లా శబరజాతి

అంతా రెండుగుంపులుగా చీలి— అరుణకి రెండడుగుల దూరంలో నిలబడింది. పెట్టెకి కట్టిన తాడుని విప్పింది అరుణ. ముందుగా మేకులు వున్న పొట్లం తీసింది. దాన్ని మగాళ్ళ ముందు వుంచింది. వాళ్ళంతా దాని చుట్టూ చేరారు. మూడేసి అంగుళాల పొడవున్న ఆ మేకుల్ని గునపాల్లా ఎత్తి వాటి బలాన్నీ, చివ ర్నున్న వాడినీ పరీక్షించి సంతృప్తిగా తలలాడించేరు. తర్వాత గుండు సూదులు వున్న పొట్లం వాళ్ళ ముందు వుంచింది. అవి చేతుల్లోకి తీసుకొని ఆనందంగా ఒకరినొకరు చూసుకున్నారు.

"మీ దగ్గర ఆత్మరక్షణకి, వేటకి ఆయుధాలు లేవేమోనని అనుకున్నాను. అందుకే అవి తెచ్చాను" అంది అరుణ.

బుయ్యా, గొమాంగ్‌లు వినయంగా తలలు ఆడించారు. వాళ్ళ మొహాల్లో అవధుల్లేని సంతృప్తి కనిపించింది. పెట్టె లోంచి మరో పొట్లం తీసి వాళ్ళ ముందు వుంచింది అరుణ. దాంలో మూడు అంగు ళాల పొడవున్న చాకులు ఇరవై వున్నాయి. వాటిని చూస్తూ కబురులు మూర్ఛపోయినంత పనిచేశారు. బుయ్యా, గొమాంగులతో సహా అందరూ బొమ్మల్లా నిలబడిపోయారు. అరుణకి ఏదో అను మానం వచ్చింది.

"అలా అయిపోయారేం? అవి మీకు నచ్చలేదా?" అంది.

"అదికాదమ్మా. ఎన్నో వేల చంద్ర కాలాలనుంచి మా జాతి ఈ దేశంలో వుంది. ఆత్మరక్షణకిగానీ, వేటకి గానీ ఆయుధాలు లేక ప్రాణాలు పిడికిట్లో పెట్టుకుని బతికేవారు మా తాతముత్తా తలు. ఇన్నేళ్ళు గడిచినా మా పరిస్థితి అంతే. వెయ్యిమందిమి వున్నాం. కానీ, మా దగ్గర వంద ఆయుధాలయినా లేవు. ఆ కారణంగా మా లో చాలామంది గుడ్లగూబలకి, గద్దలకీ, పందికొక్కులకీ బలై పోయేరు. మీరు తెచ్చిన ఈ ఆయుధ సంపద మాకు పెన్నిధిలాంటిది..." అంటూ ఇంకా ఏదో అనబోయాడు బుయ్యా.

"మీరెంతమంది వున్నారో నాకు తెలీదుగా. అందుకే అన్నీ కొంచెం కొంచెమే తెచ్చాను. ప్రస్తుతానికి వాటితో సర్దుకోండి. ఈసారి నేను వచ్చినప్పుడు యింకా తెస్తాను" అంది అరుణ.

పట్టలేని ఆనందంతో నోట మాటరాక నీళ్ళు నిండిన కళ్ళతో ఆమెవంక చూశాడు గొమాంగ్. బుయ్యా కూడా ముక్కు ఎగపీలుస్తూ చేత్తోనే కళ్ళు తుడుచు కున్నాడు.

అరుణ పెట్టెలోవున్న చాక్లెట్ల పేకెట్ తీసింది. "ఇది మిఠాయి. వీటిని చాక్లెట్లు అంటారు. ఇవి కూడా కొంచెమే తెచ్చాను సర్దుకుని అందరూ తినండి" అంది.

గొంతెత్తి అరిచేడు గొమాంగ్. వెంటనే చాక్లెట్ల చుట్టూరా అరవై మంది మగవాళ్లు చేరారు. పదిమంది చాక్లెట్లమీద చుట్టిన కాగితాలు తీసి యిస్తూంటే-ఇరవై మంది చాకుల్తో వాటిని చిన్నచిన్న ముక్కలు చేశారు.మిగతా ముప్పైమందీ ఆ ముక్కల్ని అందరికీ పంచడం ప్రారంభించారు. అంతా పద్ధతి ప్రకారంగా, యంత్రాల్లా పనిచేశారు. బుల్లిబుల్లి చాక్లెట్ ముక్కల్ని వాళ్ళు తినడం చూస్తూవుంటే తను ఏపిల్ పండు కొరుక్కు తినడం గుర్తొచ్చింది అరుణకి. అయిదు నిమిషాల్లో 'చాక్లెట్ల ఆరగింపు' పూర్తి అయింది.



పిల్లా పెద్దా అందరి ముఖాలూ దివ్య మయిన ఆనందంతో వెలిగిపోతున్నాయి. వాళ్ళని చూస్తూవుంటే ఒక ముఖ్యమైన విషయం తట్టింది అరుణకి.

ఆడవాళ్ళందరూ అయిదూ అంతకు లోపు అంగుళాల ఎత్తూ, మగాళ్లు ఆరంగుళాలు పైబడని ఎత్తూ వున్నారు. బుయ్యా ఒక్కడే ఎనిమిది అంగుళాల ఎత్తూ, గౌమాంగ్ ఒక్కడే తొమ్మిది అంగుళాల ఎత్తూ వున్నారు. 'అందుకే గాబోలు - వాళ్లు శబరజాతి పెద్దలు అయ్యేరు' అనుకుంది.

పెట్టెలోంచి మరో పేకెట్టు తీసింది. అరుణ. "గౌమాంగ్ గారి భార్యా, బుయ్యాగారి భార్యా ముందుకి రావాలి!" అంటూ ఆడవాళ్ల వేపు చూసింది. వాళ్లు ఒకరినొకరు వింతగా చూసుకుంటున్నారు. కానీ, ఎవరూ ముందుకి రాలేదు. ప్రశ్నార్థకంగా గౌమాంగ్, బుయ్యాల్ని చూసింది. వాళ్లు ఆడగుంపుని చూసి మందలింపుగా ఏదో అన్నారు. మరు క్షణాన ఇద్దరు ఆడవాళ్లు సందేహంగా తక్కుతూ తారుతూ అరుణని సమీపించారు.

"మగవాళ్ళందరూ కళ్లు మూసుకొని అటువేపు తిరగండి. మళ్లీ నేను చెప్పే వరకూ ఇటు తిరక్కండి" అంది

అరుణ చెప్పినట్టు చేశారు మగాళ్లందరూ. తను ప్రత్యేకంగా శ్రద్ధతో కుట్టిన పరికిణీ జాకెట్లని తీసింది. బొమ్మలని అలంకరించినట్టు, వాటిని ఆ యిద్దరు స్త్రీలకి తొడిగింది. అదిచూసి ఆడ జనాభా అంతా హర్షాతిరేకంతో చప్పట్లు

కొట్టింది. "ఇంక కళ్లు తెరిచి తిరగండి!" అనగానే మగాళ్లు మామూలుగా తిరిగారు. ఆ యిద్దర్నీ ఇంతింత కళ్లు చేసుకుని వింతగా చూశారు.

రుమాలంత సైజులో క త్తిరించి తెచ్చిన రంగురంగుల సిల్కుగుడ్డల్ని దొంతరగా వాళ్ల ముందు వుంచింది. ఆడవాళ్లందరూ తొడతొక్కిడిగా ఆ బట్టలగుట్ట ముందు గుంపుగా పోగయ్యారు. శ్రద్ధగా మృదువుగా తమ చిన్న చేతుల్తో వాటి నాణ్యాన్ని పరీక్షించారు. కలగా పులగంగా వాళ్ళల్లో వాళ్లు ఏవేవో మాట్లాడుకున్నారు. సద్దుమణిగిన తర్వాత తను తెచ్చిన దారపు వుండల్ని, చిన్న సూదుల్ని కత్తెరల్నీ వాళ్ళకి యిచ్చింది అరుణ. పరికిణీ, జాకెట్లకి బట్టని ఎలా కత్తిరించాలో, ఎలా కుట్టుకోవాలో వాళ్ళకి నేర్పింది. ఈ బట్టలు చాలకపోతే మళ్ళీ తెచ్చిస్తానని హామీ ఇచ్చింది. ఆడవాళ్ళంతా భక్తిగా ఆమెకి నమస్కారం చేశారు.. పెట్టెలోంచి మరో బట్టల పేకెట్టు తీసింది. అవి కూడా చేతుమాలంత సైజులో వున్నాయి. పది మీటర్ల తెల్లని బట్టని అలా ముక్కలుగా చేయించింది. అవి మగాళ్ళ కోసం. చొక్కాలు ఎలా కత్తిరించాలో, ఎలా కుట్టాలో వివరంగా బోధపరిచింది. అవి ఎలాగూ అందరికీ చాలవు గనుక, ఇంకా తేవడానికి ప్రయత్నిస్తానని మాట యిచ్చింది.. ఆడామగా అంతా కేకలూ, ఈలలూ వేశారు. హోరుమంటూ చప్పట్లు కొట్టేరు.

"నిశ్శబ్దం! నిశ్శబ్దం!!" అనరిచింది అరుణ. వెంటనే చీమ చిటుక్కుమనేంత నిశ్శబ్దం ఏర్పడింది. పరీక్షగా ఆడవాళ్ళ గుంపు వేపు చూసింది. యవ్వనంతో మిసమిసలాడ్తూ అందంగా వున్న ఒక పడుచుని చూసి, దగ్గరికి రమ్మని పిలిచింది. 'అంగుళం హంస'లా ఆ పిల్ల వయ్యారంగా నడుస్తూ అరుణ ముందు నిలబడింది.

"నీ పేరేమిటి?" అనడిగింది అరుణ.

"కుర్‌కుర్"

"నీకు పెళ్ళయిందా?"

సిగ్గుగా కాలేదన్నట్టు తలని ఆడించింది ఆ పిల్ల.

"నీకు పాటలు వచ్చా?"

"ఓ. వచ్చు."

"ఏదీ— ఒక పాట పాడవూ? నాకు వినాలని వుంది..." అంది అరుణ ప్రాధేయపడుతూ.

ఓ పక్క సిగ్గుగా వున్నా, కాదనలేక పాడసాగింది ఆ పిల్ల.

"నీకు నాట్యం చేయడం వచ్చునా?"

"వచ్చునమ్మా"

"మళ్ళీసారి వచ్చినప్పుడు నా కోసం నాట్యం చేసావా?"

"అలాగే. తప్పకుండా చేస్తాను"

"సరే-వెళ్ళు"

కుర్‌కుర్ తన యథా స్థానానికి వెళ్ళిపోయింది. అరుణ మరోసారి శబర జాతిని కలియ జూసింది. అందరూ ఆమెని ఆరాధనగా, ఏం చెప్తుందా అని చూసున్నారు.

"మీలో పాటలన్నా, సంగీతమన్నా ఎవరికి ఇష్టం?"

అందరూ ఒకేసారి మాట్లాడ్డం వల్ల, వాళ్లేం అంటున్నదీ అరుణకి బోధ పడలేదు. "మాట్లాడవద్దు. ఇష్టమైనవాళ్ళు చేతుల్ని ఎత్తండి చాలు!" అంది. చంటిపిల్లల్తో సహా ఆడా మగా అందరూ చేతులు ఎత్తేరు. కొందరు తమ రెండు

చేతుల్ని ఎత్తారు. అది చూసి నవ్వుకుంటూ "ఇక దించండి" అంది. పెట్టెలో మిగిలిన ఆఖరి వస్తువు - పాకెట్ సైజు ట్రాన్సిస్టర్ రేడియోని తీసింది. దాన్ని వాళ్ళ ముందుంచగానే అందరూ అర్థ చంద్రాకారంగా దాని చుట్టూ గుమి కూడారు. రేడియో ఆన్ చేసి ట్యూన్ చేసింది అరుణ ... "అందమె ఆనందం-ఆనందమె జీవిత మకరందం ..." అంటూ రేడియోలోంచి పాట రాసాగింది.

పాట ప్రారంభం కాగానే జనం త్రుళ్ళి పడి రెండు అంగుళాలు వెనక్కి నడిచారు. భూతాన్ని చూసినట్టు రేడియోని చూశారు గానీ, వాళ్ళ ముఖాల్లో వింత అయిన ఆనందం వుంది. బుయ్యాసీ, గొమాంగ్‌నీ తన దగ్గరికి రమ్మని - రేడియో అంటే ఏమిటో, ఎలా ఆన్ చెయ్యాలో, ఎలా ట్యూన్ చెయ్యాలో, శబ్దం ఎలా ఎక్కువ అవుతుందో, ఏ స్టేషన్ ఎక్కడ వస్తుందో అంతా వివరంగా చెప్పింది అరుణ.

"మీరిద్దరే దీన్ని వాడండి. అందరూ వాడితే రేడియో పాడయిపోతుంది. మరి పాటలు పాడదు" అంది హెచ్చరికగా.

'అలాగే' అన్నట్టు తలలూపారు వాళ్ళు.

"నేను ఇక్కడికి వీలు దొరికినప్పుడల్లా వస్తూ వుంటాను. నాకింకా చాలా సేపు ఇక్కడే వుండాలనీ, మీతో కాలక్షేపం చెయ్యాలనీ వుంది. కానీ, నాకో అత్తయ్య వుంది. బ్రహ్మరాక్షసి. నేను తప్పు చేసినా, చెయ్యకపోయినా నన్ను నానా బాధలూ పెడుతుంది..."

"ఘనత వహించిన అమ్మా..."

"అంచేత, నేను మరింక వెళ్ళి వస్తాను" అంది అరుణ.

"మహా ఘనత వహించిన అమ్మా, అరుణగారూ! మీరు మా మీద చూపిన దయకీ, అనురాగానికీ, మేమెంతో కృతజ్ఞులం" అన్నాడు బుయ్యా. గౌరవ సూచకంగా తలని వంచేడు గొమాంగ్.

అరుణ లేచి నిలబడింది.

అలా నిలబడిన అరుణ వాళ్ళకి ఓ మహా పర్వతంలా కనిపించింది కాబోలు, శబరులంతా మరోసారి నోళ్ళు వెళ్ళబెట్టి 'ఓఓఓ' అన్నారు ఆశ్చర్యానందాల్తో.

అందర్నీ చూస్తూ చేతులు వూపింది అరుణ.

"టాటా!" అనేసి గబ గబ మెట్లు దిగింది. చిలక సరస్సుని సమీపించి, పడవని నీళ్ళల్లోకి లాగింది.




ఎప్పటిలాగే ఆరోజు కూడా మధ్యాహ్నం భోజనం కాగానే శ్రీనిలయంలోంచి బైటపడింది అరుణ. మరో పావుగంటకి హంస ద్వీపం చేరుకుంది. మేడ మెట్లు ఎక్కుతూనే అరుగుమీద కనిపించిన దృశ్యాన్ని చూసి నిశ్చేష్టురాలయి నిలబడిపోయింది.

ఆరేడు అంగుళాల శబరులందరూ అర్థచంద్రాకారంలో అరుగుమీద నిలబడి వున్నారు. వాళ్ళకి మధ్యగా ఇరవై మంది శబర యువకులు రకరకాల వాద్యాల్ని

చేత్తో పట్టుకొని వున్నారు. ఆ వాద్యాలన్నీ వాళ్ళ సైజుకి తగ్గట్టుగానే చిన్నవిగా వున్నాయి. డోలు, మద్దెల, ఫిడేలు, పిల్లనగ్రోవి, హార్మోనియం, తప్పెట్లు, తంబురా – ఇవీ ఆ వాద్య విశేషాలు. అరుణ తను ఎదురుగా మెట్లమీద నిలబడగానే ఆ యిరవై మంది తమ వాద్యాలకి పని కల్పించారు. ఆ సంగీతం వింటూ అరుణ ఆశ్చర్యపోయింది. పైకి అడవి మనుషుల్లా వున్నా వీళ్ళకి సంగీతం ఎలా అబ్బిందా అని వింతగా చూస్తూ నిలబడింది. అంతలో గౌమాంగ్ చెయ్యెత్తి ఏదో అరిచాడు. చప్పున సంగీతం ఆగిపోయింది. గౌమాంగ్, బుయ్యాలు ముందుకు వచ్చి అరుణముందు నిలబడ్డారు. తలల్ని వంచి ఆమెకి అభివాదం చేశారు. వాళ్ళతోబాటు మిగతా శబర జాతి అంతా అలాగే తలలు వంచి నమస్కరించింది. తనూ అలా చెయ్యకపోతే బాగుండదనుకొని అరుణ కూడా తలవంచి వాళ్ళకి ప్రతి నమస్కారం చేసింది. అలా తమను గౌరవించినందుకు శబరజాతి అంతా హర్షధ్వానాలు చేసింది. అంత పెద్ద పర్వతం తమకి ప్రతి నమస్కారం చెయ్యడంతో వాళ్ళ సంతోషానికి పట్టపగ్గాల్లేవు. వాద్యగాళ్ళు మళ్ళీ తమతమ వాద్యాలకి పని పెట్టేరు.

కొన్ని క్షణాల తర్వాత సంగీతం ఆగిపోయింది.

బుయ్యా ఎలుగెత్తి అరుస్తూ "మహా ఘనత వహించిన అరుణ కుమారీదేవి గారికి స్వాగతం!" అన్నాడు.

మిగతా జనాభా కూడా ముక్త కంఠంతో "స్వాగతం! సుస్వాగతం!!" అంటూ అరిచింది. కృతజ్ఞతగా, నవ్వుతూ వాళ్ళవేపు చూసింది. అరుగుఎక్కి వాళ్ళకి గజం దూరంలో మఠం వేసుకుని కూర్చుంది. గౌమాంగ్ ఏదో సౌంజ్ఞ చెయ్యగా ఆడామగా శబరులంతా ఎక్కడ నిలబడ్డ వాళ్ళు అక్కడే కూర్చున్నారు. సందడి యింకా సద్దుమణగ కుండానే కన్నంలోంచి నలుగురు శబరులు ఒక పెట్టెని మోసుకు వచ్చేరు. సిగరెట్ పేకెట్ కన్నా కొంచెం పెద్దదిగా వుంది. ఆ పెట్టె. దాన్ని అరుణకి అడుగుదూరంలో వుంచి వాళ్ళు వినయంగా తలలు వంచారు. అలాగే నాలుగడుగులు వెనక్కివేసి మళ్ళీ ఠీవిగా తలలెత్తి నిలబడ్డారు.

ఏదో పవిత్రమైన కార్యం చేస్తున్నంత భక్తిగా ఆ పెట్టె మూతని గౌమాంగ్ తెరిచాడు. ఇందాకటి నలుగురూ మళ్ళీ ముందుకి వచ్చి ఆ పెట్టెలోంచి అయిదు అంగుళాల కత్తినితీసి, చేతుల్లో పట్టుకుని అరుణ ఎదురుగా వచ్చి నిలబడ్డారు.

"మహాఘనత వహించిన అమ్మా! ఈ నవరత్నఖచిత ఖడ్గాన్ని మా శబరజాతి మీకు భక్తిశ్రద్ధలతో సమర్పిస్తోంది..." అన్నాడు బుయ్యా.

ఆశ్చర్యానందాల్తో అరుణ ఆ కత్తిని అందుకుంది. దాన్ని తన మొహానికి దగ్గరగా పెట్టుకొని చూసింది. అర అంగుళం వెడల్పులో అయిదు అంగుళాల పొడవు వుంది. పిడిమీద నవరత్నాలు తాపడం చేసి వున్నాయి. మామూలు కత్తి కాదు. బంగారుఖడ్గం! నిన్ననో, మొన్ననో తయారు చేయబడినట్టు తళతళా మెరుస్తోంది. పదును ఎలా వుందోనని పరీక్షించబోయి, ఎందుకైనా మంచిదని మానేసింది అరుణ.

"అరుణకుమారీదేవిగారూ! మా శబర

జాతి మీకు ఈ చిన్న కానుక తప్ప మరిం కేమీ యివ్వలేనందుకు గాఢంగా చింతి స్తోంది"

"అయ్యో! అలా అంటారేమిటి? ఇది చిన్న కానుకా ? నాకు ఇంతవరకూ ప్రేమగా ఎవరూ ఏమీ యివ్వలేదు. ఇన్నాళ్ళకు మీరు ఎంతో అభిమానంతో ఈ సువర్ణ ఖడ్గాన్ని ఇచ్చారు. ఇది నాకు పెన్నిధి. నా సంతోషాన్ని మీకు ఎలా చెప్పాలో అర్థం కావటం లేదు" అంది అరుణ.

గౌమాంగ్ నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్ళి బుయ్యాతో ఏదో చెప్పాడు. అది విన్నాక, చేతులు కట్టుకుని అ రు ణ ని చూశాడు బుయ్యా.

"అమ్మా! ఇప్పుడు మీ చేతిలో వున్న ఖడ్గం మామూలు ఖడ్గం కాదు. అది కొన్ని వేల సంవత్సరాల క్రిందటిది. ఆనాటి మా చక్రవర్తి తప్ప ఇంకెవరూ దాన్ని యింతవరకూ వుపయోగించలేదు..." అన్నాడు.

"నేను కూడా వుపయోగించను లెండి మీ జ్ఞాపకార్థం భద్రంగా నా జీవితాంతం దాచుకుంటాను"

"మీరు అభ్యంతరం చెప్పరనే వుద్దేశ్యంతో, మీ గౌరవార్థం ఒక చిన్న విందు ఏర్పాటు చేశాం. మీ సెలవైతే......" అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు గౌమాంగ్ !

"బ్రహ్మాండం! నాకేం అభ్యంతరం లేదు" అంది అరుణ అలా అన్నదేగాని రకరకాల అనుమానాలు ఆమెకి తోచి గుండెలు పీచుపీచుమన్నాయి. విందులో తను తినేందుకు ఏం పెడతారో?! ఏకంగా ఏ అయిదారు మేకల్నో ఆ పాళంగా వుడికించేసి తనముందు పెట్టరు కదా! ఏ చీమలకూరో వండి వడ్డించరు గదా! అను కుంది. ఏం జరుగుతుందో అని విస్మయంగా ఎదురు చూడసాగింది.

విందు వడ్డనలో పదిమంది శబర యువతులు పాల్గొన్నారు. అరుణముందు, నీళ్ళతో బాగా శుభ్రం చేసిన అరటి ఆకుని పరిచారు. రెండు వుడికించిన కందమూలం దుంపలూ, ఒక చక్కెరకేళీ అరటిపండూ, అరముగ్గి చిలకకొట్టిన జామపండు ఒకటి, పది ద్రాక్షపళ్ళూ... ఒకదాని తర్వాత ఒకటిగా అరిటాకులో వడ్డించారు. వాటిని చూసి అరుణకి మతి పోయినట్టయింది. ఈ విందు సేకరణకి ఆ ఆరంగుళాల శబరులు ఎంత శ్రమ పడ్డారో... కనీసం ఒక వందమంది ఓ రాత్రల్లా కష్టపడి అడవిలో ఈ పదార్థాలని సేకరించి వుంటారు. తనపట్ల వాళ్ళు కన పర్చిన ఆదరణకి మరోసారి వాళ్ళవంక కృతజ్ఞతా పూర్వకంగా చూసింది అరుణ.

ఏదో కనీవినీ ఎరుగని వింత చూడ బోయే వాళ్ళలా శబరులు అందరూ రాతి విగ్రహాల్లా నిలబడి వున్నారు. శ్రీ పర్వతం తన పెద్దపెద్ద దవడలు ఆడిస్తూ తిండి తినడం వాళ్ళకి వింతే కదా మరి!

హంసద్వీపానికి వచ్చేముందే అరుణ సుష్టుగా భోంచేసింది. కడుపు నిండుగా వుండి ఏమీ ఆకలి కావడం లేదు. తినక పోతే - వీళ్ళు ఏమనుకుంటారో ? తమని అవమానించినట్టు భావిస్తారేమో ...! అంచేత ఆకలి కాకపోయినా అరుణకి అవన్నీ తినక తప్పలేదు. తింటూన్నంత సేపూ శబరులంతా తనని నోళ్ళు వెళ్ళబెట్టి చూడడం గమనించింది అరుణ. విస్తరి ఖాళీ చేసి 'బ్రేవ్' మని తేన్చింది.

ఆ శబ్దం విని శబరజాతి అంతా కిలకిలా నవ్వింది.

"అమ్మా, మాంచి కల్లు వుంది తాగు తారా?" అన్నాడు బుయ్యా.

"కల్లా... ? ఛీ - నాకు అసహ్యం!" అంది అరుణ.

"పోనీ, తియ్యటి అడవితేనె వుంది... తెప్పించమంటారా?"

"ఓ. అలాగే" అని అరుణ అనగానే గొమాంగ్ ఏదో ఆజ్ఞ జారీ చేశాడు. క్షణాల్లో నలుగురు స్త్రీలు వచ్చి చిన్న ఆకు దొప్పని అరుణ చేతికి అందించేరు. తేనెగురించి విన్నదేగాని తను ఇంత వరకూ రుచి చూడనేలేదు. తేనె అంతట్నీ ఒక్కగుక్కలో తాగేసింది. మరోసారి 'బ్రేవ్' మని తేన్చింది. దాంతో శబరు లందరూ హర్షాతిరేకంతో మరోసారి కిల కిలా నవ్వేరు. తను కూడా నవ్వింది.

"మహా ఘనత వహించిన అమ్మ గారూ!..."అంటూ ఏదో ప్రారంభించ బోయాడు బుయ్యా.

బుయ్యాని చూసి అరుణకి జాలేసింది. తను హాయిగా మఠంవేసుకుని కూర్చుంటే- అతను కాళ్ళు నొప్పి పుట్టేలా నిలబడి,



గొంతు పగిలేలా అరుస్తున్నాడు. మాట్లా డేంతసేపూ అతను మెడని బాగా ఎత్తాల్సి రావడం, తను తలని కిందకి దించడం, కొంచెం ఇబ్బందిగానే తోచింది. దీనికి ఏదేనా వుపాయం ఆలోచించాలను కుంది... అంతకుముందు తను తెచ్చిన అట్టపెట్టెని తనకి దగ్గరలో బోర్లించింది. దానిమీద గొమాంగ్‌నీ, బుయ్యానీ కూర్చో బెట్టింది. ఇప్పుడు వాళ్ళు ఆమె తలకి సమానమైన ఎత్తులో వున్నారు. ఈ ఏర్పాటు శబరులందరికీ నచ్చింది. తన చుట్టూ వున్న వాతావరణం చూస్తూవుంటే ఏదో రాజకీయ సభలా అన్పించింది అరుణకి. ఎత్తయిన వేదికమీద శబర పెద్దలిద్దరూ వుండడం, కిందని వేలాది శబరులు కూర్చొని శ్రద్ధగా ఆలకించడం, తనో పెద్ద పర్వతంలా వుండి వాళ్ళని గమనించడం... అంతా గమ్మత్తుగా వుంది.

"అమ్మగారూ! మీకు అభ్యంతరం లేకపోతే-వినే ఓపిక వున్నట్టయితే-మా జాతి చరిత్ర మీకు క్లుప్తంగా చెప్పాలని అనుకుంటున్నాను..." అన్నాడు బుయ్యా.

"మీ గురించి అన్నీ తెలుసుకోవాలనే నేనిక్కడికి వచ్చాను. కానివ్వండి..." అంది అరుణ వుత్సాహంగా.

ఒక్క క్షణంపాటు కళ్ళు మూసి మళ్ళీ తెరిచాడు బుయ్యా.

"ఎన్నో వేలాది సంవత్సరాల క్రితం మా పూర్వీకులు 'బ్లెఫస్కూ' అనే ద్వీపంలో ఉండేవారు. ఆ ద్వీపాన్ని మేమెవ్వరం చూడలేదు. మా పురాతన గ్రంథాలద్వారా, మా తాత ముత్తాతల ద్వారానే మాకు తెలుసు. ఆ ద్వీపంలో మాకు మహానగరాలు వుండేవి. చక్కని కట్టడాలు వుండేవి. మాలో ఎందరో వాస్తుశాస్త్ర నిపుణులూ, విజ్ఞాన వేత్తలూ, వైద్యులూ, శాస్త్రవేత్తలూ వుండేవారు. ఆచార్యులు వుండేవారు. విశ్వ విద్యాలయాలు వుండేవి. మావి అని చెప్పుకోడానికి భాషా, సంస్కృతీ వుండేవి. నదులూ, వంతెనలూ, మర పడవలూ, వాణిజ్యం...ఇవన్నీ వుండేవి. మా అందరికీ ఒక చక్రవర్తి వుండేవాడు. ఒక్క ముక్కలో మీ మానవ నాగరికతకు ఏ మాత్రమూ తీసిపోని నాగరికత వుండేది మాకు. ఇలా అన్నందుకు మీరు ఇంకోలా భావించవద్దని కోరుతున్నాను"

'అదేం లేదన్నట్టు' తలాడించింది అరుణ.

"ఆ అందాల దీవిలో ఎంతో ప్రశాంతంగా జీవించేది మా జాతి. ద్వీపవాసులం అందరమూ అన్నదమ్ముల్లా, ఒకే కుటుంబ సభ్యుల్లా అన్యోన్యంగా కాలం గడిపే వాళ్ళం...ఒక దుర్ముహూర్తంలో మా జాతి ప్రశాంతినంతా ఒక మానవపర్వతం అపహరించింది. ఆ మగపర్వతం రాకతో మా జాతి చరిత్రేపూర్తిగా మారిపోయింది. మాలో మాకు కలహాలు వచ్చాయి. కార్పణ్యాలు పెరిగాయి. కసి రగిలింది. యుద్ధాలు చేశాం. ఒకర్ని ఒకరం చంపుకొన్నాం...లక్షల్లో వుండే మా జాతి జనాభా యావత్తూ-ఈ మారణహోమంతో వేలకి దిగజారింది......అంతలో మరో మానవ పర్వతం మా ద్వీపానికి వచ్చింది. యుద్ధంతో, ఆకలితో, గాయాల్తో సగం చచ్చిన మా జాతిని అంతట్నీ, ఆ మగ పర్వతం పంజరాల్లో బంధించింది"

సానుభూతిగా చూసింది అరుణ.

"మా పూర్వీకుల్ని పంజరాల్లో

బంధించి తన దేశమైన ఇంగ్లాండు తీసుకొచ్చాడు...మమ్మల్ని సంతలో పశువుల్లా, బానిసల్లా లక్షాధికార్లకీ, రాజోద్యోగులకీ అమ్మాడు. మా గురించి విన్న మీ దేశపు రాజొకడు ఇంగ్లాండు వచ్చాడు. అమూల్యమైన రత్నాలూ, మణులూ యిచ్చి మాలో కొందర్ని కొన్నాడు. మాతో పాటు కొన్ని పశువుల్ని కూడా కొన్నాడాయన. యధాప్రకారం మమ్మల్ని పంజరాల్లో బంధించి ఈ దేశం తీసుకు వచ్చాడు......" అంటూ దీనంగా అరుణ వంక చూశాడు.

"ఆ తర్వాతేం జరిగింది?" అనడిగింది అరుణ ఉత్సుకతగా.

* * *

ఈసారి బుయ్యా మొహం మరీ గంభీరంగా మారిపోయింది. ముక్కు ఎగపీల్చి చేత్తోనే కళ్ళు తుడుచుకున్నాడు. వేళ్ళతో గడ్డాన్ని దువ్వుకుంటూ మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు–

"అమ్మ గారూ, స్వేచ్ఛా జీవితం అంతమై, బందీలుగా తయారయి ఎన్నో చేతులు మారి భారత దేశం వచ్చేసరికి–మా పూర్వీకుల పరిస్థితి ఎంత దిగజారిపోయివుందో నేను మీకు మాటల్లో వివరించి చెప్పలేను...అవిగో—ఆ సంగీత వాద్యాలు చూశారా? వాటిని ప్రత్యేకంగా వాళ్ళ కోసం మీ దేశపు మహారాజు తయారు చేయించాడు. ఒరియా, తెలుగు, సంస్కృత భాషలు నేర్చుకునే వరకూ వారిని ఆకలితో మాడ్చి చంపేవాడట. మగవాళ్ళ చేత ప్రమాదభరిత మైన సాహసకృత్యాలు చేయించేవాడు. ఏ ఆధారం లేకుండా సన్నటి తీగ మీద నడిపించేవాడు. నడుస్తే అంత ఎత్తు నుంచి కిందపడి మరణం తప్పదేమోనని భయం. నడవకపోతే కొరడా దెబ్బల్తో, ఆకల్తో చావు తప్పదేమోనని భయం. ఎలా అయినా చావు తప్పదు. మా స్త్రీలకి రకరకాల అసభ్యకరమైన దుస్తులు కుట్టించాడు. అవి వాళ్ళ శరీరంలో చాలా తక్కువ భాగాల్ని కప్పేవి. అవి ధరించి అశ్లీలమైన పాటలు పాడుతూ, అర్ధ నగ్న నృత్యాలు చేస్తూ వుంటే – ఆ మహారాజు తన స్నేహితుల్తోబాటుచూస్తూ ఆనందించేవాడు. ప్రాణాలు నిలుపుకొనేందుకు ఆ రాజు చెప్పినట్టల్లా చెయ్యక తప్పలేదు వాళ్ళకి" అంటూ ఆయాసంగా ఆగేడు బుయ్యా. తన చేతిలోని చిన్న పుస్తకాన్ని ఒకసారి తిరగేసి చూశాడు. అరుణవేపు తన దృష్టిని మళ్ళీ తిప్పాడు.

"అమ్మగారూ! మేము ఆరేడు అంగుళాల వాళ్ళమే అయినప్పటికీ మీలాగే మానవులం. మీకూ, మాకూ వున్న తేడా అల్లా మేం పొట్టివాళ్ళం. బలహీనులం. అంతే! కాని తెలివితేటల్లో విజ్ఞానంలో మా జాతి మీకు ఏమాత్రమూ తీసిపోనిది. ఈ విషయం మా పురాతన గ్రంథాల వల్ల స్పష్టంగా తెలుస్తోంది. మా జాతిని బలవంతంగా బంధించి, ఆకలితో మాడ్చి చంపి, తన ఆనందానికి మమ్మల్ని వుపయోగించుకునే హక్కు ఆ రాజుకి ఎవరిచ్చారు? మేము కూడా తనలాంటి మనుషులమే గదా! ఆ విషయమే మా వాళ్ళు ఆ రాజుతో ఒకనాడు విజ్ఞప్తి చేశారు. తమకి స్వేచ్ఛను ప్రసాదించమని వేడుకున్నారు. కాని ఆ మహారాజు వినలేదు. భయంకరమైన వికటాట్టహాసం చేశాడు. 'వెలలేని రత్నాలూ, మణులూ యిచ్చి మిమ్మల్ని కొన్నాను.

మీరు నా బానిసలు. కాబట్టి మీరు నా అదుపాజ్ఞల్లో వుండాల్సిందే!' అని అన్నాడు క్రూరంగా! అంతేకాకుండా ఎందుకయినా మంచిదని, మేమున్న పంజ రాలకి ఆ రాత్రి నుంచీ నాలుగు గండు పిల్లులను కాపలాగా వుంచాడు...దానితో, మా పూర్వీకుల గుండెల్లోని రంపపు కోత మరీ అధికమైంది. దేశం కాని దేశం. భాష కాని భాష. మాకన్నా దాదాపు పది రెట్లు ఎత్తూ, రాక్షస బలమూ వున్న మీ జాతి మనుషులు. ఖాళీ కడుపుల్లో మండే ఆకలి. ఇలాంటి పరిస్థితుల్లో-వయస్సులో వుండి నృత్య సంగీతాలూ, సాహస కృత్యాలూ తెలిసిన యువతీ యువకులకే సరయిన భోజనం వుండేది. ఏ పనీ చెయ్యలేని ముసలివారికి పసులే...ఓ రోజు మాలో ఒక వృద్ధ స్త్రీ రోగంతో మందుల్లేకచచ్చి పోయింది. ఆ స్త్రీకి యథావిధిగా అంత్య క్రియలు చేయిస్తారేమో అనుకున్నాము. కాని ఆ మహారాజుగారి సేవకులు, పంజ రంలోని ఆ వృద్ధ స్త్రీ కళేబరాన్ని తీసి మాకు కాపలాగా వుండే గండు పిల్లుల మధ్య పడవేశారు. ఆ నాలుగు గండు పిల్లులూ ఆ శవాన్ని చుట్టుముట్టి మా కళ్ళముందే భయంకరంగా పీక్కుని తిన్నాయి. ఆ దృశ్యం చూసి మా పూర్వీ కులు ఆవేశంతో వూగిపోయారు. ఉద్రే కంతో వారి రక్తం సలసలా మరిగింది... తమని హింసిస్తూన్న ఆ మహారాజు మీద ఎలాగైనా పగ సాధించి, అతని బంధాల నుంచి తప్పించుకుందామని ఆ క్షణంలోనే నిర్ణయించుకున్నారు. ఆ రాజుగారికి విప రీతంగా ద్రాక్ష సారాయి తాగే అలవా టుంది. మా స్త్రీలు చేసే అర్ధనగ్న నాట్యాలు చూస్తూ, ఉద్రేకభరితమయిన వాద్యాలు వింటూ, పాటలు వింటూ సారాయి తాగేవాడు...ఒకోసారి అలాగే నిద్రపోయేవాడు... గండుపిల్లులు కూడా ఏదో మూలకి ఒదిగి నిద్రపోయేవి.మేము తప్పించుకోవడానికి అదే అదను. పంజ రాలకి వున్న తీగల్ని వంచి, రాజుగారి కంఠంలో కత్తిని గుచ్చి, అతన్ని ప్రాణాలు తీసి మరీ తప్పించుకోవాలని మా పూర్వీ కులు ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నారు. తమలో తాము రహస్యంగా చర్చలు జరి పారు. తమతమ పెద్దల్ని సంప్రదించారు. పిన్నలని హెచ్చరించారు...ఆ బంగారు ఘడియ కోసం ఎదురు చూడసాగారు..."




అరుణ ఆసక్తిగా వింటూంది. అతను చెప్తున్నదంతా వింటూ వుంటే ఆ సంఘ టనలన్నీ తన కళ్ళముందేజరుగుతున్నట్లు అన్పించింది. తన చేతి పుస్తకంలోని పేజీలను మరోసారి గబగబా తిప్పి చది వాడు బుయ్యా. తర్వాత తన జాతివారి నందర్నీ చూశాడు. గొమాంగ్ వేపు నవ్వుతూ చూశాడు. ఆనక తల తిప్పి అరుణని చూశాడు. ఈసారి అతని చూపులో ఏదో ధీమా, గర్వం అరుణకి కనిపించాయి.

"ఏమైందప్పుడు?" అంది అరుణ అసహనంగా.

"మా పూర్వీకులు ఎదురు చూసిన ఆరోజు రానే వచ్చింది. ఆనాటి రాత్రి జరిగిన సంఘటన మా జాతి చరిత్రలో సువర్ణాక్షరాల్లో లిఖించదగ్గది. ఎవరో హంసద్వీపం జమీందారు రావు బహద్దూర్ రంగరాయలుగారు మమ్మల్ని చూడడానికి వస్తున్నారని మా వాళ్ళకి తెలిసింది..."

"రంగరాయలుగారా? ఆయనెవరో కాదు, మా ముత్తాతగారే!" అందిఅరుణ ఆనందం పట్టలేక.

గౌమాంగ్, బుయ్యాలతోపాటు శబర జాతి అంతా అరుణని ఆశ్చర్యంగా చూసింది. ఎంచేతో అరుణకి అర్థంకాలేదు. ఈ విషయంలో తను అనవసరంగా తొందరపడ్డానేమో అనుకుంది.

"ఎంత విచిత్రం! వారు మీకు బంధువులా ?" అన్నాడు గౌమాంగ్ ఇంకా ఆశ్చర్యంగానే. కాసేపటికి బుయ్యా తేరుకుని మళ్ళీ ప్రారంభించాడు.

"రాత్రి ఎనిమిదికి రంగరాయలుగారి గౌరవార్థం రాజుగారు పెద్ద విందు ఏర్పాటు చేశారట. ఆ విందు ముగిసేప్పటికి ఓ గంటైనా అవుతుందనీ, ఆ సరికి సిద్ధంగా వుండాలనీ మా పూర్వీకులను రాజుగారి సేవకులు హెచ్చరించారట... గండుపిల్లులు విశాలమైన ఆ గదిలో ఒక మూల నక్కి కూర్చున్నాయి వాటి మెడలకు గొలుసులు లేవు. నలుగురు సేవకులు మమ్మల్ని సిద్ధం చెయ్యసాగారు. ఒక సేవకుడు పిల్లులకి మేత వేస్తున్నాడు. బాగా ఎత్తుగా విశాలంగా వున్న బల్లమీద అయిదుగురు స్త్రీలను అర్ధనగ్నంగా అలంకరించి నిలబెట్టారు. పొట్టి రవికలతో, తొడలు కనిపించేట్టున్న పరికిణీల్తో వాళ్ళు లజ్జతో సగం చచ్చి నిల్చున్నారు. ఆ స్త్రీల అన్నలూ, తమ్ములూ, తండ్రులూ వారినా స్థితిలో చూడలేక అవమానంతో కుమిలిపోతూ, తమ తమ వాద్యాలను శ్రుతి చేస్తూ ఓ మూల కూర్చుని వున్నారు ... ఆ బల్ల మీదే మరోపక్కని రెండు రాటలు బిగించి వాటికి పైన సన్నని తీగ కట్టేరు. పొట్టి లాగులూ, చాలీచాలని బాడీలూ తొడిగించి అక్కడో ఇద్దరు స్త్రీలని నిలబెట్టారు. ఆ సన్నని తీగమీంచి వాళ్ళు నడవాలన్న మాట! ఆసరికే రాత్రి తొమ్మిది గంటలయింది. విందుభోజనం ముగిసింది కాబోలు... రాజుగారూ, హంసద్వీపం జమీందారుగారూ ఆ గదిలోకి వచ్చారు. మేం వున్న బల్లకి ఎదురుగా సింహాసనాల్లో సుఖంగా కూర్చున్నారు. వారి ముందు బల్లలపైన ఏవేవో తినుబండారాలూ, ద్రాక్షసారాయి వగైరా మత్తు పానీయాలూ వుంచారు సేవకులు. రంగరాయలుగారు బల్ల మీదవున్న మమ్మల్ని చాలా ఆసక్తిగా చూశారు... తర్వాత 'మ్యావ్' మంటున్న పిల్లుల్ని చూశారు. తనకు పిల్లులంటే అసహ్యమనీ వాటిని అక్కడినుంచి పంపించెయ్యమనీ అన్నారు. తక్షణం సేవకులు ఆ పిల్లుల్ని గదిలోంచి బైటికి తరిమేశారు. మాలో మేము సంతృప్తిగా వూపిరి తీసుకున్నాము. మనసులోనే రంగరాయలుగారికి చెయ్యెత్తి నమస్కరించాము. అక్కడున్న అయిదుగురు సేవకులలోనూ ముగ్గుర్ని ఏదో పని చెప్పి బయటికి పంపించారు. రాజుగారు ... అంటే ఆ గదిలో ఇంకా నాలుగు మానవ పర్వతాలు వున్నాయన్న మాట! మాట్లాడుకోకపోయినా మా వాళ్ళు

ఇదంతా గమనిస్తూనే వున్నారు. రాజుగారి అనుమతి అయింది. సేవకుడు గంట మోగించాడు. సంగీత ధ్వనులు మొదలయ్యేయి. నాట్యం, గానం ప్రారంభం అయ్యేయి. రంగరాయలు గారు తమ చేత్తో ఏదో పెద్ద భూతద్దం పట్టుకుని మా వాళ్ళ నాట్యం చూశారట...రా జు గా రు ద్రాక్షసారాయి సేవిస్తూ మా గురించి వివరంగా రాయలుగారికి చె ప్పా రు. మమ్మల్ని ఎలా కొన్నదీ, ఎలా ఈ దేశం తెచ్చిందీ, ఎలా నాట్య సంగీతాదులు నేర్పించిందీ—అంతా చెప్పారు...మరోసారి గంట మోగగానే నాట్యం ఆగింది. ఈసారి సన్నని తీగెమీద నడవడం. అదయ్యేక ఇద్దరు యోధుల్ని కత్తియుద్ధం చెయ్యమనేవారు...అది కాసేపు చూశాక, విసుగొచ్చి మళ్ళీ నాట్యం చెయ్యమనేవారు.

"అలా గంటలు గడిచాయి. గడుస్తున్నాయి. మా పూర్వీకులు శారీరకంగా అలసిపోయి వున్నారు. అయినా, దీక్షగా రాజుగారి ఆనందంకోసం ఆయన ఆడమన్నట్టు ఆడుతున్నారు. పాడమన్నట్టు పాడుతున్నారు. రంగరాయలుగారు ఏమీ మాట్లాడటం లేదుగానీ, రాజుగారు మాత్రం తమ ప్రతాపం చాటడానికి, మమ్మల్ని మరీ ప్రమాదకరమైన సాహస కృత్యాలు చెయ్యమనసాగారు.

"కొంతసేపటికి రంగరాయులుగారూ, రాజుగారూ ద్రాక్ష సారాయి మత్తులో పూర్తిగా మునిగారని 'వాళ్ళు' గ్రహించారు. ఓరకంట సేవకుల్ని చూశారు. వాళ్ళు కూడా అలసటగా వున్నట్టూ, వాళ్ళ కళ్ళు నిద్ర బరువుతో మూతలు పడుతున్నట్టూ గ్రహించారు.

"అంతలో రాజుగారు ఓ నాట్యకత్తెను తన చేత్తో పట్టుకుని హఠాత్తుగా తన సారాయి గ్లాసులో పీకలమొయ్యేముంచి, మళ్ళీ బల్లమీద పెట్టేరు. ఆ స్త్రీ ఈ ఆకస్మికసంఘటనకి కొయ్యబారి పోయింది. ఆ కాసిని బట్టలూ తడిసి ఒంటికి అతుక్కొనిపోయి అసహ్యంగా వున్నాయి.

"ఈ—నాట్యం చెయ్యి!" అని రాజుగారు గట్టిగా గర్జించారు. చలికి వణికిపోతూ సిగ్గుతో అవమానంతో చచ్చిపోతూ నాట్యం చెయ్యక తప్పలేదు ఆమెకి! అది చూస్తూ రాజుగారూ, రంగరాయలుగారూ, తాగుడు మైకంలో సింహాసనాల్లోనే తలలు వాల్చి నిద్రపోయారు. ఇదే సమయం అనుకున్న ఇద్దరు సేవకులూ మమ్మల్ని పంజరాల్లో బంధించడం మరచిపోయారు. బల్లలమీద మిగిలిన సారాయి తీసుకుని తాగడానికి ఎటో వెళ్ళిపోయారు...

"ఎదురు చూసిన స్వర్ణఘట్టం రానే వచ్చింది...ఒక్క క్షణం వృధా చెయ్యకుండా మా పూర్వీకులు కార్యరంగంలోకి దిగారు. చకచక తమ మెదళ్ళకి, శరీరాలకీ పని కల్పించారు."

ఊపిరి బిగపట్టి వుత్కంఠతో వింటోంది అరుణ.

"దగ్గరున్న పనిముట్లతో తీగలువంచి, మిగతా పంజరాల్లో వున్న వాళ్ళని విముక్తుల్ని చేశారు. పశువులను కూడా విడుదల చేశారు. పొడవైన తాళ్ళ సహాయంతో ఒక్కొక్కరే ఆ బల్లమీంచి కిందకి దిగారు.

"అమ్మా, అరుణకుమారీ దేవి! ఆ క్షణంనుంచీ మా పూర్వీకులు పడ్డపాట్లూ, చేసిన ప్రయాణాలూ పూర్తిగా చెప్తే ఒక మహాగ్రంథం అవుతుంది!"

"అదేమిటీ, రాజుగార్ని మీరు చంప లేదా?" అనడిగింది అరుణ.

"ఏదో వు(ద్రేకంలో అలా అను కున్నాముగానీ సాటి మానవుల ను హింసించేగుణం మా ర క్తంలో లేదమ్మా. సరే రంగరాయలుగారి రాక మూలంగా అయితేనేం, మా అదృష్టంకొద్దీ అయితే నేం ఆ బంధాలనుంచీ, బానిసత్వం నుంచీ బైటపడ్డాం. కోట్లాది మెట్లు కాలినడకన కొండలు ఎక్కాము. చివరికి మా జాతి మొత్తం, ప్రశాంతమైన అందాల దీవిని చేరుకున్నాం. మీరు చెప్పేవరకూ ఈ ద్వీపం 'హంసద్వీపం' అనీ, రంగరాయలు గారు మీ పూర్వీకులేననీ మాకు తెలీదు.

"ఈనాడు, ఇప్పుడు, ఈ క్షణంలో ఇక్కడున్న మేమంతా ఆనాడు తప్పించు కున్న మా పూర్వీకుల మనవలం ముని మనవలం, మనవల మనవలం...!" అంటూ వగరుస్తూ ఆగిన బుయ్యా భుజాన్ని గొమాంగ్ ఆప్యాయంగా తట్టేడు.



సుదీర్ఘమయిన బుయ్యా చెప్పిన కథ విని బరువుగా నిట్టూర్చింది అరుణ. వాళ్లను అనునయిస్తూ తను ఏదో ఒకటి చెప్పాలనుకుంది. ఏం చెప్తే వాళ్ళకి తృప్తీ, ధైర్యం వస్తాయి?

"గొమాంగ్ గారూ, బుయ్యా గారూ! మీరు చెప్పిన దంతా విన్నాను. మీ పూర్వీకులు పడ్డ కష్టాలు వింటే శరీరం జలదరించింది. మీ జాతికి మా మానవులు చేసిన దుర్మార్గాలన్నిటినీ నేను ఖండిస్తు న్నాను. ఎంతో విచారిస్తున్నాను కూడా. మా జాతి తరఫున మిమ్మల్ని క్షమాపణ కోరుతున్నాను. ఇక నుంచి మీరేం దిగులు పడనక్కరలేదు. మీకు మంచి రోజులు వచ్చాయనుకోండి. మీకే ఆపదా రాకుండా చేసే పూచీ నాది!" అంది అరుణ అభయ హస్తం ఇస్తున్నట్టు.

శబరులంతా సంతోషించారు. వయ స్సులో ఎన్నది గదా – అనుభవం లేని అమ్మాయి గదా, ఏం చేస్తుందోనని అనుమా నించారు కొందరు.

సూర్యాస్తమయానికి ఇంకా చాలా సమయం వుంది. ఎండ ఇంకా చుర్రు మంటూనే వుంది. మరో గంట సేపు ఇక్కడ కాలక్షేపం చేసి – శ్రీనిలయం వెళ్ళిపోదామనుకుంది అరుణ.

"బుయ్యా గారూ! హంస ద్వీపం చేరేక మీ జీవితం ఏమయినా బాగు పడిందా? అసలు ఎలా జీవించారు?" అంది.

"అమ్మ గారూ, అప్పటికి ఈ ద్వీపం మీద ఈ మేడ కట్టబడలేదు. అలా అని మా పురాతన గ్రంథాల్లో వుంది. చెట్ల తొర్రల్లో జీవించే వాళ్ళం. జనాభా ఎక్కువ అవుతున్నకొద్దీ బట్ట సమస్యా, తిండి సమస్యా, గృహ సమస్యా మాకు పెద్ద తల నొప్పిగా తయారయ్యాయి. మొదట ఈ ద్వీపం మీద ఇళ్ళు కట్టు కుందామనుకున్నారు మా పెద్దలు. కాని సరస్సు ఆవలి ఒడ్డున పెద్ద భవనమూ, పెద్ద పల్లె, మానవ పర్వతాలూ వుండడం గమనించారు. ఈ ద్వీపం మీద నగరం నిర్మిస్తే–వాళ్ళ దృష్టిని ఆకర్షించేవాళ్ళం

అవుతామనుకొని - ఆ ప్రయత్నం విరమించారు. విషపూరితమైన బాణాలు ఉపయోగించి ఎలుకల్ని చంపి వాటి తోళ్లతో మా శరీరాల్ని కప్పుకొనే వాళ్ళం. భూమి త్రవ్వి రకరకాల దుంపల్ని, వేళ్ళనీ తినే వాళ్ళం. భూమి తవ్వడానికి చాలినన్ని సాధనాలు లేనందున చీమలూ, ఈగలూ మొదలయిన పురుగుల్ని సంహరించి తినే వారం...ఇప్పటికీ మాకవే ఆహారం..."

"ఈ ద్వీపం మీద రక రకాల ఫల వృక్షాలు ఎన్నో వున్నాయి కదా...అవి సంపాదించి ఆహారంగా వుపయోగించలేక పోయారా?" అంది అరుణ.

"చీమలూ దోమలూ మా ఆహారం' అన్న వాళ్ల మాట తలుచుకుంటేనే ఆమెకి ఒళ్లంతా జుగుప్సతో జలదరించిపోయింది 'ఛీ...ఎలా తింటారబ్బా?!-'అనుకుంది.

"మీకేం అమ్మ గారూ, మీరెన్నైనా కబుర్లు చెపారు. అసలు మి మ్మ ల్ని చూస్తుంటేనే మాకో పెద్ద ప ర్వ త ం చూస్తున్న భ్రాంతి కలుగుతూంది. ఇంకా చెట్ల సంగతి చెప్పేదేముంది? మహా మహా పర్వతాల్లా వున్న ఆ చెట్లు ఎక్కడం ఎంత ప్రమాదం! వాటి మీద కోతులు వుంటాయి. తొండలూ, బల్లులూ భయం క ర మ్మ యి న పక్షులూ వుంటాయి. ప్రాణాంతకాలైన ఆ శ త్రు వు ల ను వూహించుకోడానికే మేము భయపడ్తాం. అలాంటిది ఆ మధుర ఫలాలకోసం చెట్టు ఎక్కడం అంటే మా ప్రాణాల్తో చెల గాటం ఆడుకోవడం అన్నమాట!"

"అయితే - ఆ ఫలాలను మీరెప్పుడూ తిననే లేదా?"

"జన్మానికో శివరాత్రి అని మీరన్నట్టుగా అప్పుడప్పుడు ఆ అవకాశం మాకు లభించేది. అయితే అందరికి అవి తినే అవకాశం దొరికేది కాదు. కాపుకొచ్చే సమయానికి కొందరు మానవ పర్వతాలు, మీ సేవకులు కాబోలు వచ్చి చెట్లెక్కి ఆ కాయలూ, ఫలాలూ కోసుకు పోయే వారు. అలా కోసుకుపోగా ఇంకా కొన్ని చిటారుకొమ్మల్లో మిగిలిపోయేవి. ఒకో అప్పుడు విపరీతమైన గాలి వీచేది. లేదా ఏ కోతో కొండముచ్చో సగం తిని కిందకి జారవిడిచేది. లేకపోతే, బాగా ఆరముగ్గి వాటిమట్టుకవే నేలని రాలేవి... ఆ విధంగానే తప్ప మరో విధంగా ఆ మధుర ఫలాలు సంపాదించే వుపాయం మాకు ఈ నాటికి తట్టలేదు..."

'ప్చ్... పాపం!' అనుకుంది అరుణ.

"... ఆ తర్వాత మా శాస్త్రవేత్తల పర్యవేక్షణలో వ్యవసాయం ప్రారంభించాం మా దగ్గరున్న అవుల్నీ, ఎద్దుల్నీ వుపయోగించి భూమిని దున్నేము. రక రకాల దుంపలు పండించడం మొదలు పెట్టాము. చిన్న చిన్న పడవలు చేసి ఈ సరస్సులో చేపలను పట్టడం కూడా నేర్చుకున్నాం. మా అదృష్టంకొద్దీ ఇక్కడ కొన్ని ప త్తిచెట్లు వున్నాయి. మా ఆడ వాళ్ళు ఆ ప త్తిని దారాలుగా చేసి వలలు తయారు చేశారు. ఇన్నిరకాలుగా కష్ట పడినా మాకు సరిగ్గా పొట్ట గడవడం లేదు..."

బుయ్యా పేవు సానుభూతిగా చూసింది అరుణ.

"మా శబరుల్లో ఓ పాతికమంది మహా ధైర్య సాహసాలుగల వీరులున్నారు. వాళ్ళకి 'పొట్టిడు' నాయకుడు. వాళ్ళు దేనికీ భయపడరు. మిన్ను విరిగి మీద పడినా చలించరు. వాళ్ళు మాత్రం ఒకో

సారి కప్పలనూ, చిన్న చిన్న కుందేళ్లనూ వేటాడుతారు... అదిగో వాళ్ళే!" అంటూ ఓ చిన్న గుంపుని చేత్తో చూపించాడు బుయ్యా.

తమకి ఏదో ఘనమైన సన్మానం జరిగినట్టు ఆ గుంపులోని ఇరవయ్యారు మందీ ఓసారి తలలు వంచి, మళ్ళీ గర్వంగా తలలెత్తి అరుణని ఠీవిగా చూశారు.

"అంటే-కప్పల్నీ, కుందేళ్ళనీ కూడా మీరు తింటారా?" అంది అరుణ విస్మయంగా.

"అలా ఆశ్చర్యపోతారేమమ్మా? అవి మాకు దొరికి వండుకుని తిన్నరోజు మాకు పెద్ద 'పండుగ'కింద లెక్క!" అన్నాడు బుయ్యా అదేమంత మామూలు విషయం కానట్టు.

"అలాగా? సరే... ఒకపని చేద్దాం. మీరు చెప్పడం, నేను అదేపనిగా వినడం కాకుండా, మరోలా చేద్దాం... నేను ప్రశ్నలని వేస్తూ వుంటాను. మీరు జవాబు చెప్తూవుండండి... నా సందేహాలు తీరినట్టూ వుంటుంది. మీకూ తెలిక. ఏమంటారు?" అంది అరుణ.

"భేష్ బాగుంది" అన్నాడు గొమాంగ్ బుయ్యా కూడా సంతృప్తిగా తల ఆడించాడు.

కాసేపు ఆలోచించింది రకరకాల ప్రశ్నలు అరుణ మెదడులో రొద చేశాయి. ఎక్కడనుంచి ప్రారంభించాలో అరుణ నిశ్చయించుకుంది.

"ఈ భూ ప్రపంచం మీదున్న మనుషులందరికీ సాధారణంగా రకరకాల నమ్మకాలుంటాయి. ఎన్నో రకాల దేవుళ్ళు వుంటారు. కొందరు క్రీస్తుని పూజిస్తారు. మరికొందరు అల్లాని ఆరాధిస్తారు. మేము రాముడూ, కృష్ణుడూ, వెంకటేశ్వర స్వామీ మొదలయిన దేవుళ్ళనే గాకుండా వందలాది అమ్మవార్లనీ, బాబాలనీ, స్వాముల్నీ కీర్తిస్తాం... అలాగే మీకు మతం అనేది ఏదేనా వుందా? మీరు ఏ దేవుడిని పూజిస్తారు?" అని అడిగింది అరుణ.

"మాకు ఫలానా మతం అంటూ ఏదీ లేదమ్మా. అయితే భగవంతుడంటే నమ్మకం వుంది. కాని మా జాతికి విగ్రహారాధనలో నమ్మకం లేదు.... ఎంచేతనంటే-మా కళ్ళతో చూడని దేవుడి ఆకారం ఇలా వుంటుందని- ఎలా వూహించగలం?"

"మీ దేవుడి పేరేమిటి?"

"ఇక్కడ మీకొక విషయం స్పష్టం చెయ్యాలమ్మా. మా జాతిలో కుటుంబానికి స్త్రీ అనగా తల్లే పెద్ద. అలాగే మా దేవుడు కూడా స్త్రీయేనన్నమాట. మా దేవుడిని 'గదేబోజన్' అని అంటాం. అంటే మా భాషలో 'ప్రపంచాన్ని సృష్టించినవాడు' అని అర్థం! అతన్నే 'లంకన్' అని కూడా పిలుస్తాం."

"లంకన్ - అంటే?"

"లంకన్ - అంటే శబరభాషలో 'ఎత్తు' అని అసలు అర్థం. ఎత్తుగా వుండేవాడు సూర్యుడేగనక అతన్ని లంకన్ అని పిలుస్తాం."

"లంకన్ అన్నా, గదేబోజన్ అన్నా ఒకరేనన్నమాట-అంటే మీ దేవుడు సూర్యుడన్నమాట.. అవునా?"

"అవునమ్మా, మా భగవంతుడిని ఆ రెండు పేర్లతోనూ పిలుస్తాము."

'అంగుళం పాపాయి తల్లి, తనని

'కన్నిబోజ్' అని తిట్టడం జ్ఞాపకం వచ్చింది అరుణకి.

"మీకు దెయ్యాల మీదా, భూతాల మీదా నమ్మకం వుందా?" అంటూ ప్రశ్నించింది.

"ఉందమ్మా! మాకు కనపడకుండా మా చుట్టూ ఎన్నో భూతాలూ, ప్రేతాలూ, పిశాచాలూ తిరుగుతున్నాయన్న నమ్మకం మాలో చాలా గట్టిగా వుంది. వాటిని మేం 'సోనుములు' అని పిలుస్తాం. మళ్ళి ఈ సోనుముల్లో కూడా రెండు రకాలున్నాయి. ఒక రకం సోనుములు మమ్మల్ని కష్టాలనుంచి కాపాడ్తూ వుంటాయి. రెండోరకం సోనుములు మా జాతిని రోగాలకి రొచ్చులకి గురిచేసి బాధిస్తూ వుంటాయి. ఈ భూతాలే గాక 'కిత్తుంగులు' అనేవి కూడా వున్నాయి. మా చుట్టూ డెబ్బయికి పైగా భూతప్రేత పిశాచాలు వున్నాయనీ మేము నమ్ముతాం. అన్నిటినీ ఆయా సమయాల్లో పూజిస్తాం. బలులు సమర్పిస్తాం. సరిగ్గా వానలు కురవకపోయినా, పంటలు పండకపోయినా, ఇంకేమయినా అరిష్టాలువచ్చినా



ఆయా భూతాలకి మా మీద ఆగ్రహం వచ్చిందని తెలుస్తాం. అప్పుడే నన్నమాట పూజలూ...బలులూ..."

"మీలో ఎవరైనా చనిపోతే ఏం చేస్తారు?" అంది అరుణ. వెంటనే నాలిక కొరుక్కుంది. ఇలాంటి ప్రశ్న ఎందుకు వేశానా అని విచారించింది. కాని, శబరులు ఏమీ అనుకోలేదు.

"ఎవరయినా చనిపోతే వెంటనే శవ దహనానికి ఏర్పాట్లు చేస్తాం. దహనం జరుగుతున్నప్పుడు ఆ మంటల్లో, చని పోయిన వ్యక్తికి సంబంధించిన అన్ని వస్తువులూ పడవేస్తాం. మంటల్లో శవం కాల్తున్నంతసేపూ, మేము చుట్టూ చేరి బాగా కల్లు తాగి డప్పులూ, చిడతలూ వాయిస్తూ నృత్యం చేస్తాం. ఆ తర్వాత ఆ అస్తికలను ఏరి ఒకచోట పాతిపెడ్తాం. మాకు తోచినంత కల్లునీ, మాంసాన్నీ వుపారంగా పెట్టి నమస్కరిస్తాం. ఆ ప్రేతానికి మాపై కోపం రాకుండా 'గుఆర్' అనే పండుగ చేస్తాం"

"మీలో అందరూ కల్లు తాగుతారా? తప్పు గదూ?"

"తప్పేం వుందమ్మా? మాలో ఆడా మగా చిన్నా పెద్దా అందరూ కల్లు తాగు తారు. దేవుడు మమ్మల్ని సృష్టించింది ఎందుకు? కష్టపడి తినమన్నాడు. తిని, సుఖపడమన్నాడు..."

"అవును. మీరన్నదీ నిజం!" అంది అరుణ అతన్తో ఏకీభవిస్తూ.

"మేమిక్కడ దాదాపు వెయ్యిమందిమి వున్నాము కదమ్మా! మాలో కొందరు తెలిసో తెలీకో, తాగుడు మైకంలోనో చిన్న చిన్న అపరాధాలు చేస్తూవుంటారు. వారికి సరైన శిక్షలు విధించే అధికారం ఒక్క గౌమాంగ్‌కే వుంది. ఆయన కూడా కొందరు న్యాయవేత్తల్ని సంప్రదించి మరీ శిక్షలు వేస్తారు... వేదాంతులనూ, శాస్త్ర వేత్తలనూ, కవులనూ, సంగీత కారు లనూ, వ్యవసాయ శాస్త్రవేత్తలనూ మేం ఎక్కువగా గౌరవిస్తాము. అందరం కలిసి కష్టపడతాం. కలిసి ఆ ఫలితాన్ని అనుభ విస్తాం. ఫలానావారు ఫలానా పని చెయ్యా లన్న నియమం లేదు. నిర్బంధం అంత కన్నా లేదు. కొందరు వడ్రంగం చేస్తారు. కొందరు వ్యవసాయం చేస్తారు. కొందరు పశుపరిశ్రమలో, చేపల వేటలో పాల్గొం టారు. ఎవరికి ఏ పని ఇష్టమో, ఎవరు ఏపని చెయ్యగలరో వాళ్ళా పని చేస్తారు."

"ఏ పనీ చెయ్యలేని ముసలివారు ఏం చేస్తారు?" అంటూ అడ్డు వచ్చింది అరుణ.

"ఏ పనీ చెయ్యలేరు గదా అని వాళ్ళని మేము నిర్లక్ష్యంగా చూడం అమ్మగారూ! ముసలివారినీ, రోగిష్టివారినీ ప్రత్యేక శ్రద్ధతో చూస్తాము."

"మరి, మీ పిల్లలకు మీరెలాంటి చదువు చెప్తారు?" చాలా సేపటినుంచీ ఈ ప్రశ్న అడుగుదామనుకుంది అరుణ.

"జీవితానికి – ఏ జ్ఞానం, చదువూ అవసరమో, అవి వాళ్ళకి నేర్పుతాం. శత్రువుల బారినుంచి రక్షించుకోవడం, వేటాడడం, వ్యవసాయం, చేపలు పట్టడం, వడ్రంగం, చేనేత మొదలైనవన్నీ వాళ్ళ చదువులో భాగాలు."

"అంటే మీలో పరీక్షలూ, డిగ్రీలూ, ఇవేవీ లేవన్న మాట!"

"మీరన్నవేమిటో మాకు తెలీదుగానీ, అలాంటివేమీ లేవు. జీవించడానికి ఏ జ్ఞానం అవసరమో అదే వాళ్ళ చదువు. పరిపూర్ణంగా, శ్రద్ధగా నేర్చుకుంటే సుఖ

జీవితం అనుభవిస్తారు. లేకుంటే మృత్యు వాత పడతారు" అంటూ జవాబిచ్చాడు బుయ్యా.

'నిజమే. జీవించడానికి పనికిరాని చదువూ, పరీక్షలూ, డిగ్రీలూ ఎందుకూ?' అనుకుంది అరుణ.

"అన్నట్టు బుయ్యాగారూ! ఇంకో చిన్న అనుమానం. మీకు శకునాల మీదా, ముహూర్తాలమీదా నమ్మకం వుందా?"

"లేకేమమ్మా? వున్నాయి. పెళ్ళిళ్ళు, పూజలూ వగైరా శుభకార్యాలని మంచి ముహూర్తాలు చూసి మరీ చేస్తాం. ఏ లగ్నంలో ఏ నక్షత్రం వుంటే మంచిదో నిర్ణయించడానికి మాలో ఉద్దండులైన సిద్ధాంతులున్నారు"

"నిజంగా!!" అంది అరుణ.

"అవునమ్మా. సూర్యుడు తల్లి. చంద్రుడు తండ్రి. అని మేము నమ్ముతాము. నక్షత్రాల్లాంటి బిడ్డల్ని ఎందర్నో కన్నారట తల్లి సూర్యుడు. అంతలో ఆకలివేసి, తన బిడ్డల్ని తనే తినెయ్యడం మొదలు పెట్టాడట. ఈ సంగతి తెలుసుకున్న తండ్రి చంద్రుడు వెంటనే వెళ్ళి మిగతా బిడ్డల్ని ఆదుకొన్నాడట. అందుకే తల్లికి భయపడి పగలు నక్షత్రాలు కనబడవు. చీకటి పడగానే 'రాత్రి తండ్రి' అయిన 'సంద్రాబోజన్' చుట్టూ చేరి ఆడుకుంటాయి. ఇది మా నమ్మకం!"

"ఇంతేనా, ఇంకేమయినా నమ్మకాలు ఉన్నాయా?"

"సూర్య చంద్రు బిడ్డల్లో సుంక్రా—అంటే శుక్రుడన్నమాట. అతను కూడా దేవతతో సమానం!"

ఆకాశం, భూమీ, సూర్యుడూ, చంద్రుడూ వీళ్ళ గురించి రాజేశ్వరి అత్తయ్య తనకి చెప్పిన పాఠాలు అరుణకి గుర్తొచ్చాయి. భూమి గుండ్రంగా వుంటుందనీ, సూర్య చంద్రులూ, నక్షత్రాలు వాళ్ళు అనుకుంటున్నట్టు దేవతలు కారనీ చెప్తే 'వీళ్ళు' నమ్ముతారా? 'ఈ విషయం యూపీ, ఆర్టిమస్‌లకి చెప్తే ఎంతగా పగలబడి నవ్వుతారో!'—అనుకుంది అరుణ.

"గాలి కూడా దేవతేనా?"

"అవునమ్మా. వాన కూడా దేవతే."

"నీరు కూడా దేవతేనా?"

"ఇంకా అనుమానమా, అమ్మగారూ! నీరు కూడా దేవతే. ఆ దేవతంటే మాకు విపరీతమైన భక్తి"

"భూమి కూడానా?"

"ఆఁ. మా ఆకలి తీర్చే కన్నతల్లి లాంటిది గదమ్మా, భూదేవి. సకల శకులకీ, దేవతలకీ, దెయ్యాలకీ నిలయం గదా భూదేవి. ఏమంటారమ్మా?"

ఏమంటుంది? 'అవును' అన్నట్టు తలూపింది అరుణ.

"మా మానవ జాతిలాగే మీలో కూడా తప్పుడు పన్లు చేసేవారున్నారా?" అని అడిగింది అరుణ.

"ఎందుకు లేరమ్మా? తను కన్న బిడ్డల్ని తనే తిన్న తప్పు దేవుడే చెయ్యగా-అల్పులం ... మేమెంత? మేం చెయ్యడంలో వింత ఏముంది? అయితే ఒక విషయం మాత్రం నిజం అమ్మగారూ ... మాలో సాధారణంగా దొంగతనం, అబద్ధాలాడ్డం, మోసం చెయ్యడం, వరుసకాని వారితో వ్యభిచారం..ఇలాంటివి జరగవు. తప్పి జారి జరిగినా వాళ్ళని పాపులుగా, సంఘ ద్రోహులుగా వెలివెయ్యం"

"ఒకవేళ ఎవరయినా నేరం చేస్తే

ఏం చేస్తారు?"

"సాధారణంగా నేరస్తుడిని నలుగురి మధ్య నుంచోబెట్టి పంచాయితీ చేస్తాం. ఆ నేరం వల్ల ఎవరికి అపకారం జరిగిందో వారికి, నేరస్తుడి ద్వారా నష్ట పరిహారం ఇప్పిస్తాం. అపకారం జరిగిన వారినీ, నలుగురు న్యాయవేత్తల్నీ సమావేశపర్చి గొమాంగ్ ఈ విషయం వారితో చర్చి స్తాడు. వారి నిర్ణయానుసారం నష్ట పరిహారం ఏమిటో, ఎంతో నిశ్చయించబడు తుంది" అని జవాబిచ్చాడు బుయ్యా.

"మీలో అన్నిటికన్నా పెద్ద నేరం ఏమిటి?"

అరుణ ప్రశ్న విని కాస్సేపు తల గోక్కున్నాడు బుయ్యా.

చివరికి "హత్య" అని అన్నాడు.

"మీ జాతిలో హత్యలు తరచుగా జరుగుతుంటాయా?"

"పూర్వం ఎప్పుడో జరిగేవట గానీ... ఇప్పుడు... ఈ ద్వీపం చేరుకున్న దగ్గ ర్నుంచీ అలాంటిదేమీ లేదు అమ్మ గారూ !"

"ఒకవేళ ఎవరేనా హత్య చేస్తే ఏం చేస్తారు?" అంది అరుణ తెలుసుకోవాలనే పట్టుదలకొద్దీ.

"మా శబరజాతి వారు హత్యని పెద్ద తప్పుగా, మహా నేరంగా ఎంచుతారు. హంతకుడు కూడా సాధారణంగా అబద్ధం ఆడడు. నేరం ఒప్పుకుంటాడు...జాతి పెద్ద గొమాంగ్ న్యాయవేత్తలో సంప్రప దించి హతుని కుటుంబానికి ఇంత జుల్మానా ఇచ్చుకోవాలని ఆదేశిస్తాడు..."

"అంతేనా?" అంది అరుణ నిరాశగా.

"అంతేనమ్మా" అన్నాడు గొమాంగ్ కల్పించుకుని.

"మాలో ఏం చేస్తారో తెలుసా?ఫలానా వాడు హంతకుడు అని జడ్జీగారు ధ్రువ పరుస్తే, ఆ హంతకుడికి ఉరి శిక్ష-అంటే మరణ శిక్ష విధిస్తారు...అంటే-ప్రాణం తీసినందుకు అతని ప్రాణం తీసేస్తారు. లేకపోతే జీవితాంతం ఖైదులో వుంచి చచ్చేట్టు చాకిరీ చేయిస్తారు."

బుయ్యా తేలిగ్గా నవ్వాడు. "మా దేవతలు మమ్మల్ని చల్లగా చూసినంత కాలం మాలో హత్యలూ అవీ జరగ వమ్మా! అందరం అన్నదమ్ముల్లా ఒకే కుటుంబ సభ్యుల్లా వుంటున్నాం. మాలో మాకు ఈర్ష్యలూ, అసూయలూ, కక్షలూ వుంటే గదా, హత్యలు జరిగేది?"

"మీలో లంచాలూ గట్రా పుచ్చు కోవడం, ఇచ్చుకోవడం వగైరాలు వున్నాయా?" అంది అరుణ నవ్వుతూ.

"లంచాలు అంటే ఏమిటమ్మా?" అన్నాడు బుయ్యా ఏమీ అర్థం కానట్టు తెల్ల మొహం వేసి చూస్తూ.

"అయ్యో! లంచం అంటే ఏమిటో తెలియదా?" అంది రెట్టిస్తూ.

బుయ్యా అయోమయంగా చూడ సాగేడు.

"మాలో అది చాలా మామూలు. చిన్న పాపాయికి కూడా లంచం అంటే ఏమిటో తెలుసు. మీకు తెలిసే తెలీదా? పోనీలెండి. తెలియక పోవడమే మేలు..." అంటూ తల తిప్పి చూసింది అరుణ.

సూర్యాస్తమయం కాబోతూంది. తనింక త్వరగా బయల్దేరడం మంచిదను కుంది.

"బుయ్యాగారూ, గొమాంగ్ గారూ ! నేనింక వెళ్ళి వస్తానండీ. పూర్వంలా నేను తిరగడానికి వీల్లేదు. మా అత్తయ్యకి

యిప్పుడు ఒంట్లో నయమైపోయింది. త్వరగా వెళ్ళకపోతే కోప్పడుతుంది..." అంటూ ఆ ఇద్దర్నీ పెట్టెమీంచి కిందికి దింపింది.

"మహోఘనత వహించిన అమ్మగారూ! వచ్చే పూర్ణచంద్ర కాలానికి మీరు తప్పకుండా రావాలి. ఆ రోజు రెండు విశేషాలు జరుగుతాయి." అన్నాడు గొమాంగ్.

"పూర్ణచంద్ర కాలం అంటే వచ్చే పౌర్ణమీ శుక్రవారం, అమ్మగారూ" అన్నాడు బుయ్యా.

"ఓ. తప్పకుండా వస్తాను. ఇంతకీ ఆ విశేషాలేమిటి ?" అని అడిగింది అరుణ.

"మా 'పొ ట్టి డి' నాయకత్వంలో 'కుందేలువేట' చేస్తామమ్మా. అదొక విశేషం...!" అన్నాడు బుయ్యా, అదేదో గొప్ప 'ఏనుగులవేట' అన్నంత ఘన కార్యంలా.

"ఆ రోజు రాత్రే 'పొట్టిడు'కీ, నాపెద్ద కూతురు 'కుర్‌కుర్'కీ పెళ్ళి చేస్తాం!" అన్నాడు గొమాంగ్.

"నిజంగానా ? ! " అంటూ అరుణ ఆనందంగా అరిచింది.

"అవునమ్మా, అప్పటికి మీరిచ్చిన బట్టల్ని మా ఆడవాళ్ళు కుట్టడం కూడా పూ ర్తి చేస్తారు. కొ త్త బట్టలు తొడుక్కుని వేటకి వెళ్తాం. వేట ముగియగానే 'గడేబోజన్' ఆకాశంలోకి రాకముందే పెళ్ళి చేసేస్తాం. పెళ్ళి తర్వాత విందు... ఆ తర్వాత పాటలూ, నాట్యాలూ... జరుగుతాయి. ఆ రాత్రల్లా మీరు మాతోనే వుండాలి. ఇది మా శబరజాతి కోరిక." అన్నాడు బుయ్యా చిన్న చిన్న కళ్ళని అదోలా మెరిపిస్తూ.

అబ్బురంగా చూసింది అరుణ.

"ఓ.తప్పకుండా వస్తాను. ఆకాశంలోకి 'సంద్రాబోజన్' రాకముందే, నేనిక్కడికి రెక్కలు కట్టుకొచ్చి మరీ వాలుతాను! సరేనా ?" అంది హామీ ఇస్తున్నట్టు.

వాళ్ళంతా ఆనందంగా చూశారు...

"అమ్మగారూ, ఇంకోలా మీరు అనుకోకపోతే ఒక మనవి. అన్నీ చెప్పి ఈ ఒక్క విషయం చెప్పడం మరిచిపోయాను." అన్నాడు బుయ్యా.

"ఏమిటదీ?"

"మరేం లేదమ్మా. తరతరాలుగా మా సంప్రదాయం ఏమిటో చెప్తున్నాను. పగటిపూట శత్రుసంచారం ఎక్కువగా వుంటుంది గనక, మేం మా గుహలోంచి బైటికి రాకుండా విశ్రాంతి తీసుకుంటాం. అంటే నిద్రపోతామన్నమాట. సాయం కాలం... తన పిల్లలయిన నక్షత్రాల్తో 'సంద్రాబోజన్', ఆకాశంలోకి రాగానే, నిద్రలేచి రాత్రల్లా వేటా, వ్యవసాయం వగైరా పనులు చేస్తాం. ఒక్కమాటలో- మీ పగలు మాకు రాత్రి-మీ రాత్రి మాకు పగలు!" అన్నాడు బుయ్యా ఎంతో వినయంగా.

అరుణ తెలివైంది గనక అసలు విషయం వెంటనే గ్రహించేసింది. తను పగటిపూట రావడం వాళ్ళకి ఇబ్బందిగా వుంది. అవును మరి ! తను అర్ధరాత్రి గాఢంగా ఆదమరిచి నిద్రపోతున్నపుడు ఎవరైనా లేపితే ఎలా వుంటుంది... ఒళ్లు మండదూ ?

"బుయ్యాగారూ ! మీరు చెప్పింది బోధపడింది. ఇకనుంచీ హంస ద్వీపానికి రాత్రిపూటే వస్తాను. మా అత్తయ్య జ్వరం బాగయింది గనక రాత్రిపూట రావడమే నాకు సులభం ! సరే - ఇంక వెళ్తాను..." అంది.

శబరజాతి తనకి బహూకరించిన 'అయిదు అంగుళాల' నవరత్నఖచిత సువర్ణ ఖడ్గాన్ని రుమాల్లో చుట్టి తన మొలకి దోపింది. నిలబడి ఓసారి అందర్నీ కలయజూసింది.

"షౌన్ ఎరై - టాటా!" అని చెయ్యి వూపి గబగబా మెట్లు దిగింది.




పడవను చిలక సరస్సు నీళ్ళలోకి లాగబోతున్న అరుణకి ఎవరో పిలిచినట్టు అయింది. ఆ పిలుపు తియ్యని సంగీతంలా ఆమె వీనులకి సోకింది. చప్పున వెనక్కి తిరిగి చూసేసరికి కూతవేటు దూరంలో పది గజాల ఎత్తున్న శుక్రగ్రహవాసి ఆర్టిమస్ నవ్వుతూ కనిపించాడు. తను చేస్తున్న ప్రయత్నం మాని రోదసీ నౌకవేపు పరుగు తీసింది అరుణ.

"మా మీద కోపం వచ్చిందా? ఇంత దూరం వచ్చి కూడా మమ్మల్ని చూడకుండా వెళ్ళిపోతున్నావా దొంగా?" అన్నాడు ఆర్టిమస్ దగ్గరికి వచ్చిన అరుణను చూసి.

"అబ్బే. అది కాదండీ. రేపెప్పుడయినా వద్దామనుకున్నాను. రాత్రి కావస్తోందిగా. అత్తయ్య కోప్పడుతుందేమోనని తొందరపడుతున్నాను"

"మరేం కొంప మునిగిపోదు గానీ, మా నౌకలోకి ఓసారి రా. కాసేపు కూర్చొని పోదువుగాని ..." అంటూ ఆర్టిమస్ నేలమీద కూర్చున్నాడు.

యూపీ తనకి బంగారుకాసు ఇవ్వడం వల్లనేగదా, తను శబరులకి అన్ని బహుమతులు ఇచ్చి వాళ్ళ స్నేహం పొందడం జరిగింది ...! వాళ్ళ మాట వినకుండా మొరాయించి వెళ్ళిపోతే అది కృతఘ్నత అవుతుంది. చేసేదిలేక ఆర్టిమస్ కోటు జేబులోకి ఎక్కి కూర్చుంది అరుణ. నిచ్చెన ఎక్కి ఇద్దరూ రోదసీ నౌకలోకి ప్రవేశించారు. యథాప్రకారం నవ్వుమొహంతో యూపీ అరుణని ఆహ్వానించింది. ప్రేమగా తల నిమిరింది. వాళ్ళిద్దరూ చెరో కుర్చీలోనూ కూర్చొని తమ మధ్యనున్న ఎత్తయిన బల్లమీద అరుణని కూర్చోబెట్టారు.

బుయ్యానీ, గొమాంగ్‌నీ తను అట్టపెట్టెమీద కూర్చోబెట్టడం అరుణకి జ్ఞాపకంవచ్చింది...తనలో తనే చిన్నగా నవ్వుకుంది.

"నీలో నువ్వే నవ్వుకుంటున్నావు, ఏమిటి విశేషం?" అని ప్రశ్నించింది, యూపీ.

తన మనసులోని ఆలోచన చెప్పింది అరుణ.

దంపతులిద్దరూ పకపకా నవ్వేరు.

"ఎప్పుడొచ్చావిక్కడికి? ఇంతసేపూ ఏం చేశావు? నీ 'ఆరు అంగుళాల నేస్తాలు' ఎలా వున్నారు? ఏం జరిగింది?" అంటూ శరపరంపరగా ప్రశ్నల వర్షం కురిపించాడు ఆర్టిమస్.

జరిగినదంతా పూసగుచ్చినట్టు వాళ్ళకి వివరంగా చెప్పింది అరుణ. 'సూర్యుడూ, చంద్రుడూ భార్యాభర్తలూ-నక్షత్రాలు

వారి బిడ్డలు' అన్న నమ్మకాన్ని చెప్పే సరికి యూపీ, ఆర్టిమస్‌లు ఇద్దరూ పగల బడి నవ్వారు.

"ఇంకేమిటి విశేషాలు?"

"వచ్చే పౌర్ణమి శుక్రవారం నాటి రాత్రి నన్ను రమ్మన్నారు..."

"ఎందుకుటా?" అంది యూపీ.

"ఆ రాత్రి కుందేలు వేటకి వెళ్తారుట. ఏదో పెద్దపులినో, ఏనుగునో వేటాడ బోతున్నట్టు మహాగొప్పగా చెప్పారు."

"నిజమేగదా అరుణా! ఆరేడు అంగుళాల మనుషులకి కుందేలేమిటి, ఎలుక కూడా సింహంతో సమానం!" అన్నాడు ఆర్టిమస్.

"కుందేలు మాంసం గానీ, కప్ప మాంసంగానీ వండుకుని తిన్న రోజు వాళ్ళకి మహా పండుగ రోజు కింద లెక్కట!" అంది అరుణ అదోలా.

"అన్నట్టు అరుణా, నువ్వు మాంసాహారివి కావా?" అంది యూపీ.

"ఛీ నాకసయ్యం!" అంది అరుణ జుగుప్సగా.

"అదీ సంగతి అలా చెప్పు. మీ మానవుల్లో కూడా చాలామంది కప్పల్నీ కుందేళ్ళనీ తింటారు...చాలా రుచికరంగా వుంటుందిట వాటి మాంసం!" అంది యూపీ మళ్ళీ.

"ఏమో బాబూ, నాకు కప్పల్నీ చేపల్నీ చూస్తేనే చాలు డోకు వస్తుంది"

"ఎవరి అలవాట్లు వాళ్ళవి. ఎవరి అభిరుచికి అనుగుణంగా వాళ్ళు ఆహారం తీసుకుంటారు. చుట్టూ వుండే వాతావరణాన్ని బట్టి కూడా ఆహారం, అభిరుచులూ మారుతూ వుంటాయి!" అన్నాడు ఆర్టిమస్.

"మీరన్నది నిజమే. వెనక ఎప్పుడో విశ్వామిత్రుడనే ఋషి ఆకలేసి ఏమీ దొరక్క కుక్క మాంసం తిన్నాడట. అందుకేగదా వాళ్ళు చీమల్ని తిన్నామన్నా, దోమల్ని తిన్నామన్నా నేను అసహ్యించుకోవడం లేదు...వాళ్ళు చాలా అమాయకులు. ప్రస్తుతం అనాగరికులు. అసహాయంగా వున్నారు. అందుకే వాళ్ళు నన్ను ఆకర్షించారు. నా ప్రాణాలు ఇవ్వాల్సి వచ్చినా సరే—వాళ్ళకి సహాయం చేసి, దుర్మార్గుల బారినుండి కాపాడతాను" అంది అరుణ ఆవేశంగా.

"నీ స్నేహం, పరిచయం దొరకడం వాళ్ళ అదృష్టం!" అంది యూపీ.

తన అభిప్రాయం కూడా అదేనన్నట్టు ఆర్టిమస్ తలూపేడు.

"అదేంకాదు మేడమ్, నేనే అదృష్టవంతురాల్ని. ఇన్నాళ్ళూ నేను ఎందుకు బతుకున్నానో నాకే తెలిసేది కాదు. రోజులు ఎంతో బరువుగా గడిచేవి. ఇప్పుడలా కాదు. వాళ్ళ స్నేహం సంపాదించిన దగ్గర్నుంచీ నాకేదో కొత్త వుత్సాహం, గొప్ప బలం వచ్చినట్టయింది నాకు తెలీకుండానే రోజులు చకచకా దొర్లిపోతున్నాయి.... అన్నట్టు వాళ్ళు నాకో బహుమతిని ఇచ్చారు" అంటూ సువర్ణ ఖడ్గాన్ని తీసి యూపీకి అందించింది అరుణ.

ఆ అయిదంగుళాల బంగారు కత్తిని వాళ్ళు కుతూహలంగా పరీక్షించారు. మామూలు మనుషులు విరిగిపోయిన బ్లేడుని పట్టుకుని చూస్తున్నట్టుంది. అవును మరి. వాళ్ళేమో పది గజాల ఎత్తున్న మనుషులు. ఈ కత్తేమో ఐదు అంగుళాల పొడవే వుందాయె! కత్తిని అందుకొని

మళ్ళీ జేబు రుమాల్లో చుట్టింది అరుణ.

"ఈ కత్తి గమ్మత్తుగా వుంది కదండీ? ఇది ఒకప్పుడు వాళ్ళ చక్రవర్తిదట. ఆయనతప్ప ఇంకెవరూ ఈ కత్తిని ఇంత వరకూ ఉపయోగించలేదట" అంది అరుణ. ఆమె కళ్ళలో చిన్న గర్వం తొంగి చూసింది.

"సహజమేగా! ఇప్పుడు వాళ్ళకి నువ్వే మహారాణివి. అందుకే వాళ్ళు నీకు ఆ ఖడ్గాన్ని బహూకరించారు!" అన్నాడు ఆర్టిమస్ మెచ్చుకోలుగా.

"ఇంక నేను వెళ్ళొస్తానండీ" అంటూ లేచింది అరుణ.

"మహారాణులు ఎప్పుడూ ఇచ్చిన మాటని మరిచిపోరు. ఎలాంటి పరిస్థితుల్లో అయినా నిలబెట్టుకుంటారు" అంది యూవీ.

ఆమె అలా ఎందుకు అన్నదో అరుణకి తెలుసు. కానీ, భద్రకాళిలా అత్తయ్య



రాజేశ్వరి రూపం ఆమె మనస్సులో మెదుల్తోంది. ఆలస్యంగా వెళితే ఎన్ని శాపనార్థాలు పెడుతుందో!

"రేపు వచ్చినప్పుడు తప్పకుండా కథ చెప్తాను...ప్లీజ్!" అంది తప్పించుకుందామని.

"అదేం పనికిరాదు. ఇప్పుడు కథ చెప్పాల్సిందే!"

"అవును. మేం వినాల్సిందే!"అన్నారు ఇద్దరూ.

'ఎలాగూ అయిన ఆలస్యం అవనే అయింది. ఏదో ఓ కథ చెప్పేసి పోతే ఏం?' అనుకున్న అరుణ నిస్సహాయంగా కూర్చుండిపోయింది. ఏ కథ చెప్పనా- అని ఒక నిమిషం ఆలోచించింది. ఆమె చెప్పబోయే కథకోసం వాళ్ళిద్దరూ ఎదురు



చూస్తున్నారు. కొంతసేపటికి అరుణ కథ చెప్పడం ప్రారంభించింది-

"చాలా కాలం కిందట ఓ ఊళ్ళో నారయ్య అనే రజకుడు వుండేవాడు. మనిషి స్వతహాగా ఎంతో మంచివాడూ, తెలివైనవాడూ అని చెప్పుకుంటారు. అతనున్న ఇల్లు వూరికి దూరంగా వున్న ఒక చిన్న పేటలో వుండేదన్నమాట! ఆ పేటలో అందరూ నారయ్యలాగే ఎంతో మంచి మనస్సున్నవాళ్ళు. అంతలో— ఎక్కణ్ణుంచో దుర్గమ్మ అనే ఆవిడ తన ఇద్దరు కొడుకులతో ఆ పేట వచ్చి, నారయ్య యింటిపక్కనున్న గుడిసెలో చేరింది. ఆవిడ కొడుకులిద్దరూ పరమ సోమరులు. ఏ పనీ చేసేవారు కాదు. దుర్గమ్మ మహా గయ్యాళి. కయ్యాలమారి. అందరిదగ్గరా ఏవేవో వస్తువులు చేబదుళ్లు తీసుకొని, ఎగనామంవేసి, అడిగితే పైగా పెద్ద రంకెలు వేసేది. ఆమె గుణగణాలన్నీ నారయ్య రెండు రోజుల్లోనే కనిపెట్టేశాడు. కొంచెం జాగ్రత్తలో వుండాలని అప్పుడే నిశ్చయించుకున్నాడు... ఇలా వుండగా ఓ రోజు ఉదయాన్నే వీధి తలుపు చప్పుడైంది. 'ఎవరు చెప్మా!' అనుకుంటూ తలుపు తీశాడు నారయ్య. ఎదురుగా గుమ్మంలో అపరకాళిలా నిలబడి వుంది దుర్గమ్మ. శాంతంగా 'ఏం కావాలమ్మా?' అని అడిగాడు.

'చాలా జరూరుగా మా అమ్మగారి వూరికి వెళ్ళాల్సి వుందిబాబూ! నాతోబాటు కొన్ని సామాన్లు కూడా వున్నాయి. నీకు తెలుసుగదా. నా దగ్గర గాడిద లేదు. మీ గాడిదని ఓసారి అరువిస్తే, నా పని పూర్తి చేసుకొని మళ్ళీ ఇవేళ సాయంకాలానికల్లా తిరిగి యిచ్చేస్తాను.' అంది ఆమె.

వెంటనే మొహం అదోలా విచారంగా పెట్టేడు నారయ్య.

'అయ్యో, గాడిద లేదమ్మా! వుంటే యిచ్చే వాడినే...' అన్నాడు.

'ఏమైందీ... ఎక్కడికేనా వెళ్ళిందా?' అంది దుర్గమ్మ.

'చాకిరేవుకి బట్టలమూటతో గాడిదని తీసుకుపోయాడు మా తమ్ముడు...' అని జవాబిచ్చాడు నారయ్య.

'అదేమిటీ, ఇప్పుడిప్పుడే గాడిద మీ పెరట్లో వుండగా చూశానే!' అంది దుర్గమ్మ ఆశ్చర్యంగా.

సరిగ్గా అదే సమయానికి పెరట్లో వున్న నారయ్య గాడిద బిగ్గరగా ఓండ్ర పెట్టడం ప్రారంభించింది. అది విని దుర్గమ్మ మొహం కోపంతో ఎర్రబడింది.

'నారయ్యా, నువ్వేదో పెద్దమనిషివనుకున్నాను... పెరట్లో గాడిదని వుంచుకొనికూడా లేదని అబద్ధం చెప్తున్నావే! నీకు సిగ్గు వేయ్యడం లేదూ?' అని అరిచింది.

"నాకెందుకమ్మా, సిగ్గు? నువ్వే సిగ్గుపడాలి... ఇంతోటి పెద్దమనిషినీ... నా మాట లెక్కచెయ్యకుండా, 'వెధవగాడిద కూత'ని నమ్ముతున్నావు. అందుకు సిగ్గుపడాల్సింది నువ్వే?' అని అంతకన్నా గట్టిగా అరిచాడు నారయ్య. అతని మాటలకి ఏమనాలో పాలుపోక తెల్లబోయి చూసింది దుర్గమ్మ. మరో మాటకి అవకాశం ఇవ్వకుండానే, ఆమె మొహం మీదే ఢడాలున తలుపు వేసేశాడు నారయ్య.." అంటూ కథను ముగించింది అరుణ.

యూపీ, ఆర్టిమస్‌లు మనసారా పకపకా నవ్వుతున్నారు.

"మరి నాకు సెలవిప్పిస్తారా?" అంటూ నిలబడింది అరుణ.

"మళ్ళీ రావాలి సుమా ! ఈ సారి కూడా మరో కథ చెప్పాలి!" అంది యూపీ.

"అలాగే తప్పకుండా" అంటూ ఆర్టిమస్ కోటు జేబులోకి ఎక్కి కూర్చుంది.

అరుణ 'శ్రీనిలయం' చేరేసరికి రాత్రి ఎనిమిది దాటింది. 'అరుణేదీ?' అంటూ రాజేశ్వరి అప్పుడే పేరమ్మని అడుగుతోంది.

"అలా తోటలోకి షికారుగా వెళ్లానందమ్మా!" అని పేరమ్మ జవాబు చెప్తూ వుంటే, అరుణ వెళ్ళి రాజేశ్వరి ఎదురుగా నిలబడింది.

"ఇదిగో-వచ్చింది రాణీగారు! అయిపోయేయా అమ్మా నీ షికార్లూ?" అంటూ చురచురా చూసింది రాజేశ్వరి.

అరుణ కిమ్మనలేదు.

"పేరమ్మా, ఆకలేస్తోంది.. అయనెప్పుడొస్తారో ఏమో, మా ఇద్దరికి వడ్డన చేసెయ్యి!" అంటూ కేకేసింది రాజేశ్వరి.

* * *

శబరజాతి తనకు బహూకరించిన నవరత్నఖచిత సువర్ణఖడ్గాన్ని దాచడం ఒక పెద్ద సమస్య అయి కూర్చుంది అరుణకి. మొలలో పెట్టుకుని ఎన్నాళ్లు తిరగడం? అత్తయ్య రాజేశ్వరి కన్ను పడని ప్రదేశం అంటూ ఏదేనా వుందా అని ఎంత ఆలోచించినా ఆమెకి ఏమీ తట్టలేదు. చివరికి ఏమైతే అది అవనీ అని తెగించి, తన బట్టల పెట్టెలో అడుగున దాచింది.

మాధవయ్య మాస్టారితో జరిగిన విశేషాలన్నీ వివరంగా చెప్పింది. 'మొత్తానికి అనుకున్నది సాధించావన్నమాట!" అన్నాడాయన తన గాజుకళ్ళను మెరిపిస్తూ. ఇంకా మిగిలిన డబ్బుతో ఏమేం తీసుకురావాలో ఆయనకి చెప్పింది అరుణ. పౌర్ణమినాటికల్లా ఆ వస్తువులన్నీ సిద్ధం చేస్తానన్నాడాయన.

రాబోయే పౌర్ణమి శుక్రవారం కోసం క్షణమొక యుగంలా ఎదురు చూసింది అరుణ. చివరికి తక్కుతూ తారుతూ రానే వచ్చింది శుక్రవారం... వుదయాన్నుంచీ సూర్యాస్తమయం కోసం అసహనంగా నిరీక్షించింది. చంద్రోదయం కాగానే-నిర్ణీతమైన సమయానికి భోజనాల గదిలోకి వెళ్ళింది. భోజనం చేస్తూ వున్నంతసేపూ రాజేశ్వరి ఏం మాట్లాడలేదు... అరుణ భోజనం ముగించి చేతులు కడుక్కొంటూ వుండగా - "అరుణా, ఏమిటా తొందర? ఒక్క నిమిషం ఆగు!" అని రాజేశ్వరి ఆజ్ఞ జారీ చేసింది. 'ఏమిటి?' అన్నట్టు అత్తయ్యని చూస్తూ నిలబడింది అరుణ.

"ఇన్నాళ్ళూ నా ఒంట్లో బాగాలేక-నీ సంగతేమిటో కనుక్కోలేదు... ఎలా వున్నాయి నీ చదువు సంధ్యలు?" అంది.

"నువ్వు చదవమన్న పాఠాలన్నీ చదువుతున్నానత్తయ్యా"

"ఊఁ. ఇవాళ రాత్రి ఏమిటి చదువుతావు?"

"పది ఆల్జీబ్రా లెక్కలున్నాయి, అవి చేస్తానత్తయ్యా"

"చేస్తావా, నిద్రపోతావా?" అంది కర్కశంగా.

"ఉహూఁ. నిద్రపోనత్తయ్యా..."

"ఆ లెక్కలన్నీ చేసి రేపు వుదయాన్నే నాకు చూపించు."

"అలాగే అత్తయ్యా" అనేసి తన గదివేపు నడిచింది అరుణ.

ఆ లెక్కలన్నీ తనెప్పుడో చేసేసింది... చూపించడమే తరవాయి. ఇక, ఈ రాత్రికి తను చెయ్యాల్సింది ఏమీలేదు. పెన్సిలు చేత్తో పట్టుకుని దీపం ముందు కూర్చుంది. లెక్కలు చేస్తున్నట్టు నటన ప్రారంభించింది.

భోజనం ముగిసేక అన్ని గదుల తాళాల్నీ స్వయంగా లాగిచూసి సంతృప్తిగా చివరికి తన పడక గదిలోకి ప్రవేశించింది రాజేశ్వరి. భడాల్న తలుపులు వేసుకుంది ... అప్పటిగ్గాని అరుణ గుండె కుదుట పడలేదు. మరో పావుగంట ఆగి, నెమ్మదిగా లేచింది. లైటు ఆర్పేసి మాధవయ్య మాస్టారి దగ్గర్నించి తెచ్చిన వస్తువుల మూటని చేతుల్లోకి తీసుకుంది. అడుగులో అడుగు వేసుకుంటూ భవనంలోంచి బయట పడింది... గేటుకూడా దాటి, చెట్ల నీడల్లో నడుస్తూ 'చిలక సరిస్సు'ని సమీపించింది.

అక్కడ – హంస ద్వీపంలో మేడ అరుగు మీద శబరులు చాలా సేపట్నుంచీ అరుణకోసం ఆందోళనగా ఎదురు చూస్తున్నారు. ఆకాశంలో 'సంద్రాబోజన్' అవతరించకముందే వస్తానన్న అరుణ చంద్రోదయం అయిపోయి రెండు గంటలు దాటినా ఇంకా రాకపోయేసరికి మరింక రాదేమో ననుకున్నారు. ఆమెకి ఏమైనా ప్రమాదం జరిగిందేమోనని అనుమానించాడు గౌమాంగ్. ఎట్టి పరిస్థితుల్లో అయినా వచ్చి తీరుతుందని వాదించాడు బుయ్యా. ఓ పక్కని వేటకు సమయం మించిపోతున్నది. రాత్రి పదిగంటల లోపున వేట ముగిస్తే–అప్పటి నుంచీ పెళ్ళి మీద దృష్టినంతటినీ లగ్నం చెయ్యాలి... 'పొట్టిడు'ని పెళ్ళికొడుకు చెయ్యాలి. 'కుర్‌కుర్'ని పెళ్ళికూతుర్ని చెయ్యాలి... సరిగ్గా పన్నెండు గంటల రెండు నిమిషాలకి మంచి ముహూర్తం వుంది. ఆ సరికి పెళ్ళి జరిగిపోవాలి... ఆ తర్వాత 'గడేబోజన్' వచ్చేవరకూ – అంటే సూర్యోదయం అయ్యేవరకూ ఆటల్లో, పాటల్లో, విందులూ, వినోదాల్లో గడపాలి... ఇదీ శబరజాతి పెద్దలు నిర్ణయించిన పథకం !

అరుణ వచ్చేవరకూ వేటకి వెళ్ళకుండా ఆగాలా వద్దా – అన్న విషయం మీద వాళ్ళలో తీవ్రంగా తర్జనభర్జనలు సాగుతున్న సమయానికి అరుణ రానేవచ్చింది. ఆమెని చూడగానే అందరూ తమ సంతోషం వ్యక్తం చేస్తూ చప్పట్లు కొట్టేరు. పెళ్ళికూతురు గునగునా నడుస్తూ అరుణ ముందు నిలబడింది.

అరుణ కొద్దికొద్దిగా శబర భాష నేర్చుకుంటోంది. ఇప్పుడు చిన్నచిన్న ప్రశ్నలు అర్థం చేసుకోవడం, సమాధానాలు చెప్పడం కాస్త సులువుగానే వుంది. వాళ్ళందరికీ తెలుగు భాష మాట్లాడం వచ్చును. అయినా, శబరభాష అరుణ నోటంట వినాలని వాళ్ళకి సరదా.

బుయ్యాని చూసి తన ఆలస్యానికి కారణం చెప్పింది అరుణ.

'వేటకి పొట్టిడి నాయకత్వాన పాతిక మంది బయలుదేరుతున్నారు. మరో అయిదుగురు వాళ్ళకి సహాయకులుగా వెళ్తున్నారు. ఆ సాహసకృత్యం చూడడానికి అరుణ కూడా వెళ్తుంది. గౌమాంగ్, బుయ్యా, ఇతర శబరులూ గుహలోనే వుండి వంట ప్రయత్నాలూ, పెళ్ళి ప్రయత్నాలూ చేస్తారు –' ఇదీ జరగవలసిన కార్యక్రమం.

"సరే" అంది అరుణ.

వేటస్థలం అక్కడికి ఎంతో దూరం లేదు. మహావుంటే-ఓ ఫర్లాంగు దూరం వుంటుంది. సరిగ్గా ఈ వేళప్పుడు వెన్నెల్లో ఆడుకోడానికి అక్కడికి కుందేళ్ళమంద వస్తుందిట. 'పది గంటల సమయానికి కనీసం రెండు కుందేళ్ళని అయినా పట్టి తీరుతాను' అని శపథం చేశాడట పొట్టిడు. వేట జరుగుతున్న సమయంలో మాటాడ వద్దని అరుణను పదేపదే హెచ్చరించాడు బుయ్యా. కాని, మాట్లాడకుండా ఎలా వుండడమో అర్థం కాలేదు అరుణకి.

పొట్టిడు ముందు దారి తియ్యగా, అతని వెనక ముప్ఫయిమంది శబరులూ నడిచారు. అడుగులో అడుగు వేసు కుంటూ తాపీగా వాళ్ళని అనుసరించింది అరుణ.

కొంతసేపటికి చేరాల్సిన ప్రదేశం చేరుకున్నారు. అక్కడ ఒక పెద్దమామిడి చెట్టు వుంది. చెట్టుకి అటూ ఇటూ ఎన్నో కొమ్మలూ చెట్టు మొదట్లో చిన్న పొదా వున్నాయి. అరుణని ముందుగా చెట్టెక్క మన్నాడు పొట్టిడు. పరికిణీ అడ్డం పడ కుండా కాస ఎత్తి పట్టుకుని, అలవాటే గనక చకచకా చెట్టెక్కింది అరుణ. ఒక కొమ్మ మీద సుఖంగా కూర్చొని కిందని వాళ్ళేం చేస్తున్నారో గమనించసాగింది.

పట్టపగల్లా వున్న వెన్నెల వెలుగులో-ఆరంగుళాలే ఎత్తున్న ఆ సన్నజీవాల కదలిక ఆమెకి స్పష్టంగా కనిపిస్తోంది.

ఒక మాటా, పలుకూ లేకుండా చేయాల్సిన పనులన్నీ చరచరా చేసుకు పోతున్నారు వాళ్ళు. ఎవరెవరు ఏం చెయ్యాలో-కళ్ళతో, చేతుల్తో పొట్టిడు సైగలు చేస్తున్నాడు. పచ్చని గడ్డివున్న నేలమీదికి రెండడుగుల ఎత్తున ఒక కొమ్మ వుంది. ఆ కొమ్మమీద పొట్టిడూ, మరో పదిహేనుమందీ కూర్చున్నారు. చెట్టు మొదటవున్న పొదలో మిగతా పదిహేనుమందీ దాగున్నారు. చెట్టుమీంచి నాలుగు సన్నని, కనీ కనిపించని వురి తాళ్ళు వేలాడదీశారు. కొమ్మ మీదున్న పదిహేనుమందీ వాటిని గట్టిగా పట్టుకుని వున్నారు. చెట్టుమొదట పొదలో దాగున్న వాళ్ళు తమతోబాటు తెచ్చిన మేకులతో, చాకులతో, డప్పుల్తో సిద్ధంగా వున్నారు. పొట్టిడు కొమ్మమీద నిలబడి, బహుశా కుందేళ్ళ రాకకోసమే కాబోలు, చెవులు రిక్కించి - మెడని ఎత్తి అటూ ఇటూ చూస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. ఎక్కడో కీచురాళ్ళ రొద మాత్రం సన్నగా విన్పిస్తోంది. వాటికి జోడుగా సరస్సు ఒడ్డున కప్పలు బెకబెకమంటున్నాయి... అరుణకి ఏదేనా మాట్లాడాలన్పించింది. పొట్టిడిని చూసి నోరు తెరవబోయింది. అంతలో బుయ్యా హెచ్చరిక గుర్తొచ్చింది.

అలా ఒక పావుగంట గడిచింది. కొమ్మమీద కూర్చున్న అరుణ కింద నేల మీద వెన్నెట్లో పచ్చగా మెరుస్తూన్న లేతగడ్డిని కళ్ళార్పకుండా చూడసాగింది.

ఆ సమయంలోనే అరుణ దృష్టి దూరంగా ఓ చోట పడింది. ఏవో చిన్న చిన్న బంతుల్లాగ గెంతుకుంటూ రాసాగేయి. తెల్లగా కొన్ని, గోధుమ రంగులో కొన్ని, మచ్చలు మచ్చలవి కొన్ని అందులో వున్నాయి. పున్నమి వెన్నెల వెలుగుల్లో వాటి రంగులు స్పష్టంగా కన్పిస్తున్నాయి.....సందేహం లేదు! అవి కుందేళ్ళే!!

కుందేళ్ళ గుంపు తామున్న మామిడి చెట్టువేపే రాసాగింది. కొన్ని కొంత

దూరంలో ఆగిపోయాయి. ఆయిదారు కుందేళ్ళు మాత్రం సరిగ్గా మామిడి చెట్టు కిందికి వచ్చేశాయి! ఉండి ఉండి తమాషాగా గెంతుతూ, ఆబగా లేత గడ్డి కొరుక్కు తింటున్నాయి.

అంతే, అలా ఒక్క క్షణం !

మరుక్షణంలో ఓ తెల్లని కుందేలు మెడ ఉరితాడులో చిక్కుకుపోయింది. తక్షణం 'ఢాం ఢాం ఢాం' అంటూ దప్పులు మోగేయి. పొదలో దాగిన పదిహేను మందీ కతులతో, చాకులతో ఆ కుందేలుని చుట్టుముట్టేరు. అంతలో పొట్టిడు తోట రాముడిలాగా కొమ్మ మీంచి కిందికి గెంతేడు. గింజుకుంటోన్న కుందేలుని చూస్తూ ఎవరెవరు ఏమేం చెయ్యాలో ఆదేశిస్తున్నాడు.

అదే క్షణంలో గబగబ చెట్టుమీంచి కిందికి దిగింది అరుణ. పొట్టిడిని చూసి— "ఇదుగో,ఏయ్! దాన్ని నా కళ్ళ ఎదురుగా చంపకండి. నాకు భయం! కావాలంటే దాన్ని నేను మోసుకువచ్చి మేడ దగ్గర మీకు యిచ్చేస్తాను....గుహలోకి తీసుకు పోయి అక్కడ మీరేమైనా చేసుకోండి!" అంది.అనేసి,మరో మాటాడకుండా, మరో మాట విన్పించుకోకుండా,గింజుకుంటున్న కుందేలుని తన చేతుల్లోకి తీసుకుంది.... జాలిగా చూసింది దాన్ని!

"అమ్మగారూ, అడ్డు రాకండి...వద్దు! ఒద్దొద్దు!!" అంటూ పొట్టిడు వీరావేశంతో పిచ్చి పట్టినవాడిలా అరుస్తున్నాడు. మిగతా శబరులు కూడా 'అడ్డు రావద్దు' అని అరిచి గోల చేస్తున్నారు.

అవేమీ పట్టించుకోకుండా, ముందు కుందేలు మెడకి వున్న తాడు ముడిని విప్పింది. తెల్లగా, బొద్దుగా చూడ ముచ్చటగా వుంది ఆ కుందేలు. 'ఇంత అందంగా ముద్దుగా వున్న కుందేల్ని చంపి తినడానికి మనసెలా ఒప్పుతుందో!?' అనుకుంది.

శబరులంతా ఇంకా ఆమెవేపు తిరిగి అరుస్తూ నానా గోలా చేస్తున్నారు. క్షణ క్షణానికీ ఆ గోల మరీ ఎక్కువై చెవుల్లో జోరీగలా తయారైంది.

వాళ్ళని చూసి ఏదో చెప్పబోయేంతలో అరుణ చేతిలోని కుందేలు మైనం ముద్దలా కరిగి, తుర్రున జారిపోయింది. చెంగు చెంగున రెండే గంతులు వేసింది. ఆ తర్వాత చెట్ల నీడల్లో ఎటో మాయమై పోయింది.

ఈ సంఘటనతో శబరులు నోట మాటరాక శిలావిగ్రహాల్లా చాలాసేపు అటే చూస్తూ వుండిపోయారు....అరుణ ఏం చెప్పినా విన్పించుకోలేదు. కాసేపటికి వాళ్ళలో చలనం ప్రారంభమయింది. అరుణ అడిగిన ఏ ప్రశ్నకీ జవాబు యివ్వ కుండా, మౌనంగా మేడవేపు నడవడం ప్రారంభించారు. దాంతో వాళ్ళకి తనమీద కోపం వచ్చిందన్న సంగతి ఇట్టే గ్రహిం చింది అరుణ.

చేసేది లేక, తన తెలివితక్కువని నిందించుకుంటూ, వాళ్ళ వెనకే నీరసంగా నడక ప్రారంభించింది అరుణ.

* * *

పొట్టిడు ద్వారా జరిగిన సంగతంతా విన్న గౌమాంగ్ నోటంట చాలాసేపటి వరకూ మాట రాలేదు. బుయ్యా కూడా మతిపోయిన వాడిలా అరుణని చూస్తూ అలాగే నిలబడి పోయాడు. ఈ వార్త క్షణాల్లో శబరులందరి మెదళ్లలోకి పెను మంటలా వ్యాపించింది.

వెధవ కుందేలు కోసం వీళ్ళింత

గొడవ చేస్తున్నారేమిటా అని చిరాకు పడింది అరుణ. కాని ఆ చిరాకుని బైటికి కన్పించనియ్యలేదు. బుయ్యాని దగ్గరగా రమ్మని తను అరుగుమీద కూచ్చుంది. వాళ్ళ నోటి దగ్గర కూడుని తీసెయ్యాలని గానీ, వాళ్ళ ఆనందం పాడు చెయ్యాలని గానీ తనకి మనస్సులో లేదనీ; తనకి రక్తం, హింస అంటే భయం అనీ;అందుకే అలా జరిగిందనీ అతనికి ప్రాథేయ పూర్వకంగా వివరించింది.

తల వంచి ఆమె చెప్పినదంతా బుయ్యా విన్నాడు. కానీ, ఏం మాట్లాడ లేదు. కాసేపు అతని మాటల కోసం ఎదురు చూసి, చివరికి పొట్టిడు వేపు దృష్టి మరల్చింది అరుణ, అంత అరంగు శాల మనిషీ కోపంతోనో, ఆవేశంతోనో వూగిపోతూ నిలబడివున్నాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో అతని ఛాతీ పొంగుతోంది. అరుణ నిస్సహాయంగా గొమాంగ్ వేపు చూసింది.

"మహా ఘనత వహించిన అమ్మ గారూ! ఈ విధంగా జరుగుతుందేమోనని మేము ముందే వూహించాము. అందుకే మిమ్మల్ని ఏం మాట్లాడవద్దనీ, కలుగ జేసుకోవద్దనీ హెచ్చరించాము. మీరు అలాగే అని మాట ఇచ్చి కూడా దాన్ని అతిక్రమించారు" అన్నాడు గొమాంగ్.

బుయ్యాలో కాస్త చలనం వచ్చి నట్టుంది.

"అమ్మగారూ! మేమంతా ఇలా ఎందుకు బాధ పడుతున్నామో, బహుశ మీకు తెలీకపోవచ్చును. ఇవాళ శుభ కార్యం. అందునా మా జాతి అంతటికీ పెద్ద అయిన 'గొమాంగ్'గారి కూతురి వివాహం. పైగా మహా వీరుడైన పొట్టిడు పెళ్ళికొడుకు. అన్నిటికన్నా ముఖ్యమైనది ఇంకొకటి వుంది. ఇవాళ కనీసం రెండు కుందేళ్ళనైనా వేటాడి తెస్తానని పొట్టిడు ప్రతిజ్ఞ చేశాడు. కుందేలు మాంసం లేనిదే పెళ్ళీ, విందూ రెండూ చాలా అసం పూర్తిగా జరుగుతాయి. నిండుదనం, వుత్సాహం వుండదు...కుందేలు మాంసం మాకు ఎంత ముఖ్యమో, మీకు ఇంత కన్నా ఎక్కువగా వివరించలేను..." అన్నాడు బుయ్యా.

"మీరేం బాధ పడకండి. ఆ మాంసం లేకపోతేనేం-మీ అందరికీ సరిపడా భోజన పదార్థాలు తెచ్చానుగా" అంది అరుణ కొంచెం ధైర్యం తెచ్చుకుని.

"ఎన్ని వున్నా సరే ఆ కుందేలు మాంసం మాకు చాలా ముఖ్యం అమ్మ గారూ! కనీసం, ఆ వాసన మా ముక్కు లకు సోకినా చాలు, అదే పదివేలు. మాట యిచ్చి, తప్పిపోయి మమ్మల్ని చాలా నిరాశపర్చారు. మా జాతికి నేనేం సమా ధానం చెప్పను!" అన్నాడు బుయ్యా.

అరుణ అందరి వేపూ దీనంగా చూసింది. ఇంకెప్పుడూ వీళ్ళనిలా బాధ పెట్టకూడదు అని మనస్సులోనే నిర్ణ యించుకుంది.

బుయ్యా గొమాంగ్ దగ్గరికి వెళ్ళాడు. ఇద్దరూ కాస్సేపు వాళ్ళ భాషలో చిన్న చిన్న గొంతుకలో ఏవేవో మాట్లాడు కున్నారు. మరో నలుగురు పెద్దల్ని పిలిచి మరి కాసేపు చర్చ సాగించారు. చివరికి, ఏదో నిశ్చయానికి వచ్చిన గొమాంగ్ శబరజాతి వేపు తిరిగాడు. వాళ్ళతో నాలుగే నాలుగు మాటలు చెప్పాడు.అంతే! అంతవరకూ శిలాప్రతిమల్లా వున్న శబరులు ప్రాణం పోసిన బొమ్మల్లా

తయారయ్యేరు. చకచక ఏవేవో పనుల్లో అటూఇటూ తిరగడం ప్రారంభించారు. వాళ్ళ ముఖాల్ని బట్టి చూస్తే తన తప్పుని క్షమించినట్టే అనిపించింది అరుణకి. అందరి ముఖాలూ వికసించి వున్నాయి.

"అమ్మగారూ! మా 'కుర్ కుర్'ని పెళ్ళి కూతురిగా అలంకరించే బాధ్యత మీదే" అన్నాడు బుయ్యా.

ఇప్పుడతని కంఠంలో యింతకు ముందున్న కఠినత లేదు. చాలా సౌమ్యంగా నవ్వుతూ అన్నాడు.

"తప్పకుండా. అలాగే" అంది అరుణ ఆనందంగా.

గుహ ద్వారం వద్ద సిగ్గుతో ఒదిగి పోతూ నిలబడి వుంది కుర్ కుర్. తన దగ్గరికి రమ్మని సైగ చేసింది అరుణ. కుర్‌కుర్‌కి అరుణ అంటే ఎంతేతో విశేష మయిన గౌరవం, భక్తి కుదిరేయి. ఆకాశంనుంచి వూడిపడ్డ దేవతని ఆరాధించి నట్టు ఆరాధిస్తోంది. అరుణ ప్రేమకి పాత్రురాలు కావడమే ఆమె ధ్యేయం. ఆ అవకాశం కోసమే ఎదురుచూస్తున్నట్టు ఆమె దగ్గరగా వచ్చి నిలబడింది కుర్ కుర్. కాబోయే పెళ్ళి కూతుర్ని నవ్వుతూ చూసి తన పక్కనే అరుగు మీద కూర్చో మంది.

ఇంతకు ముందులా శబరులంతా అర్ధ నగ్నంగా లేరు. మగాళ్ళు లుంగీలూ, చొక్కాలో వుండడం; ఆడవాళ్ళు పరికిణీ, జాకెట్లతో తిరుగాడ్తూ వుండడం గమ నించింది అరుణ. అయితే తను తెచ్చిన బట్టలు తక్కువ గనక ఇంకా కొన్ని వందలమంది శబరులు యథాప్రకారంగానే వున్నారు. వాళ్ళని చూస్తుంటే అరుణకి ఎన్నో ఆలోచనలు రాసాగేయి.

'నాకే గనక డబ్బుంటే వీళ్ళని ఎంత బ్రహ్మాండంగా తయారు చేసేదాన్ని! మగాళ్ళందరికీ సూట్లూ, బూట్లూ కొనిచ్చే దాన్ని. ఆడవాళ్ళకి రంగురంగుల సిల్కు చీరలూ, జాకెట్లూ యిచ్చేదాన్ని. వాళ్ళం దరికీ తగినంత ఆహారం సమకూరే ఏర్పాట్లు చేసేదాన్ని. ఈ ద్వీపం మీద చిన్న నగరం నిర్మించి యిచ్చేదాన్ని!' అనుకుంది.





"బుయ్యాగారూ! పెళ్ళి ఎన్నిగంటలకి"

"పన్నెండు గంటల రెండు నిమిషాలకమ్మా!" అని జవాబిచ్చేడు.

"మీ దగ్గర వాచీలూ అవీ లేవు గదా. టైమెలా తెలుస్తుంది ?" అంటూ తన సందేహం వెలిబుచ్చింది అరుణ.

"ఆకాశంలో చంద్రుడిని చూస్తే చాలునమ్మా, టైమెంతో మాకు తెలిసిపోతుంది" అన్నాడు బుయ్యా గర్వంగా.

అరుగుమీద కర్రలు వేసి నిప్పు అంటించి మంట వేశారు. ఆ వెలుగులోనే వాళ్ళు పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారు. మంటకి కాస్త దూరంలో చిన్న వేదిక

ఏర్పాటు చేశారు. దాని మీద రెండు చిన్న పీటలు వేశారు. వేదిక చుట్టూ ఏవేవో ముగ్గులు వేస్తున్నారు. పిల్లలు తప్పించి, ఆడా మగా అంతా ఏదో ఒక పనిమీద హడావుడిగా ఇటూఅటూ తిరుగుతున్నారు. మంట దగ్గర గొమాంగ్ నిల బడి వాళ్ళకి ఏవేవో ఆదేశాలు జారీ చేస్తున్నాడు.

అరుణ తను తెచ్చిన రెండు సంచులూ తీసింది. ఆమె పిలుపుతో గొమాంగ్, బుయ్యా, పొట్టిడూ, ఇతర శబర పెద్దలూ వచ్చి ఆమె ఎదురుగా నిలబడ్డారు. పెళ్ళి కోసం తను తెచ్చిన వస్తువులు ఒక్కొక్కటే తీసింది అరుణ. ఏపిలు పళ్ళూ, అరటి పళ్ళూ, జామపళ్ళూ, పెద్దబేసిన్‌తో బెల్లపు పరమాన్నం, రెండు కిలోల పంచదార...వాళ్ళ ముందు పెట్టింది.

"ఇది నీ కోసం ప్రత్యేకంగా కుట్టి, తీసుకొచ్చాను" అంటూ తను తెచ్చిన సూటుని వాడి ముందు పెట్టగానే పొట్టిడు అయోమయంలో పడ్డాడు. బొమ్మకి తొడిగినట్టు తొడుగుదామంటే పొట్టిడు మరీ చిన్న పిల్లాడేం కాదు. ఆకారంలో చిన్నవాడైనప్పటికీ, వయస్సులో పెద్దవాడే కదా! పేంటులోకి కాళ్ళు ఎలా దూర్చాలో, నడుం దగ్గర గుండీలు ఎలా పెట్టుకోవాలో, షర్టు ఎలా వేసుకోవాలో చెప్పింది. ఎలా టక్ చేసుకోవాలో బోధ పర్చింది...

"నేను చెప్పినట్టు చేసి వస్తే-ఈకోటు తొడిగి 'టై' కడతాను" అంది అరుణ.

"అలాగే నమ్మగారూ !" అన్నాడు వాడు.

"ఇదుగో ఇది నీకు నా పెళ్ళి కానుక" అంటూ ఫౌంటెన్‌పెన్ అంత వున్న చిన్న టార్చిలైటుని పొట్టిడు ముందు పెట్టింది.

అందరిలోకీ మహావీరుడు గదా వాడు, తేలిగ్గానే ఎత్తి పట్టుకున్నాడు. కాని, అదేమిటో ఏం చెయ్యాలో వాడికి బోధ పడలేదు. మీట నొక్కితే వెలుగు వస్తుందనీ, దాని సహాయంతో ఎంత చీకట్లో అయినా చూడవచ్చునేసరికి వాడికి పరమానందం కలిగింది.

శబరులకి 'కల్లు' అంటే ప్రాణం అని అరుణకి ఇదివరకే తెలుసు. వాళ్ళ మావయ్య కామేశ్వరరావు గదిలో ఏవేవో సీసాలుంటాయి. దాన్ని విస్కీ అంటారని మాధవయ్య మాస్టారు చెప్పగా తెలిసింది. రెండు రోజులకి ముందే అతని గదిలోకి వెళ్ళి రెండు పెద్ద సీసాల్ని దొంగతనంగా తీసేసింది. ఆ సీసాల్ని శబరులు వింతగా చూశారు.

"మీరు తాగే కల్లు లాంటిదే ఇది. దీన్ని విస్కీ అంటారు. మా మావయ్య దీన్ని నీళ్ళలో కలుపుకొని తాగుతాడు. మీ కిష్టమని తెచ్చేను..." అంటూ అరుణ మాటలింకా పూర్తి కాకముందే శబరులు హర్షధ్వానాలు చేశారు.

గుండు సూదులూ, పెద్ద మేకులూ, చాకులూ వున్న పొట్లం వాళ్ళ ముందు పెట్టింది. పెళ్ళి కూతురు కుర్‌కుర్‌కి తను తెచ్చిన కానుకలను మాత్రం వాళ్ళెవరికీ చూపించలేదు.

"కుర్‌కుర్‌ని కాస్సేపొయాక పెళ్ళి కూతుర్ని చేస్తాను గానీ, ఈలోగా నేను చెయ్యాల్సింది ఏమైనా వుందా ?" అనడిగింది అరుణ.

ఏపిల్సు వగైరా పళ్ళని ముక్కలుగా తరగాలి. వాళ్ళు వందమంది గంటలో చేసే పనిని తను ఒక్కర్తీ పావుగంటలో

చెయ్యొచ్చు గదా అని ఆమె అభిప్రాయం.

"మీరేం చెయ్యక్కర్లేదమ్మా, అన్నీ మావాళ్లే చూసుకుంటారు..." అన్నాడు బుయ్యా ఆదరంగా.

"నేనొక చెయ్యి వేస్తే ఏం?"

"మీరు మా అతిథి. మీరు ఏ పనీ చెయ్యకూడదు !" అన్నాడు గొమాంగ్ వినయంగా.

"మీ యిష్టం"

శబరులు గుంపులుగా పోగై తమకి రెండింతలు వున్న విస్కీ సీసాల్ని చూస్తూ గుటకలు మింగడం గమనించింది అరుణ. బేసిన్‌లో వున్న పరమాన్నాన్ని అరిటాకుల్లో సర్దింది. బేసన్ శుభ్రంగా కడిగింది. అందులో రెండు సీసాల్లో వున్న ద్రవం పోసింది. మరొక సీసాడు నీళ్ళు కూడా పోసింది. నాలుగు అంగుళాల ఎత్తువుంది ఆ బేసిన్......మరు క్షణంలో జనం చిన్న చిన్న పాత్రలు పట్టుకొని 'విస్కీ చెరువు' చుట్టూ పోగ య్యేరు. పాత్రలు ముంచడం, తాగడం, బాగుందిరోయ్ అన్నట్టు కళ్ళు మెరిపించడం-అదే వరస ... బుయ్యా, గొమాంగ్‌లు కూడా వెళ్ళి కరువు తీరా తాగేరు. వెళ్ళి తాగనా అన్నట్టు అరుణ వంక చూసింది కుర్‌కుర్.

"ఇప్పుడు కాదులే. నిన్ను పెళ్ళి కూతుర్ని చేసేక తాగుదువు గాని !" అంది కుర్‌కుర్‌ని అనునయంగా చూస్తూ.

"మీరు తెచ్చిన ఆ కల్లు అమోఘంగా వుందమ్మా"అన్నాడు బుయ్యా తృప్తిగా.

"వుండదూ మరి! ఒక్కొక్క సీసా ఖరీదు రెండు వందల రూపాయలపైన వుంటుందిట. అది ఈ దేశంలోది కాదుట. విదేశాల నుంచి ఓడల మీంచి వస్తాయిట. అందుకే అంత ఖరీదు ! మా మావయ్య చెప్తుంటే విన్నాను..."

రెండు వందల రూపాయలంటే బుయ్యాకి తెలిసింది ఒక్కటే-అది చాలా భయంకరమైన వస్తువు. అది ఎక్కడుంటే అక్కడ పాపం పేరుకుని పోతుంది. ఘోరాలూ, నేరాలూ జరుగుతాయి. హత్యలు జరుగుతాయి. న్యాయం, ధర్మం, పుణ్యం అన్నీ నశిస్తాయి. సాలోచనగా అరుణని చూస్తూండిపోయాడు బుయ్యా.

"మీలో పెళ్ళిళ్ళూ అవీ సాధారణంగా ఎలా జరుగుతాయి?" అనడిగింది.

"మామూలుగా వేట సమయాల్లో మా జాతి యువతీ యువకులు ఒకరి నొకరు చూసుకుంటారమ్మా. మనసైతే ఒకరితో ఒకరు మాట్లాడుకుంటారు. వరుడు తన తల్లిదండ్రుల్లో తను ఫలానా అమ్మాయిని ప్రేమించినట్టు చెప్తాడు... అప్పుడు వరుడి తల్లీ దండ్రీ వగైరాలు వధువు యింటికి పది కుండల కల్లు తీసుకు వెళ్తారు. అది తాగడం అయ్యేక - 'మీ పిల్లని మా అబ్బాయికి యిస్తారా?' అని అడుగుతారు. 'అయిదు చంద్ర కాలాల తర్వాత రండి. ఆలోచించి చెప్తాం' అంటాడు వధువు తండ్రి. అయిదు చంద్ర కాలాల తర్వాత మరో పది కుండల కల్లుతో మళ్ళీ వెళ్తారు మగ పెళ్ళివారు... పిల్లదాని ఇంటి తలుపు తీసి వున్నట్టయితే ఈ సంబంధం వాళ్ళకి ఇష్టమేనని అర్థం. తలుపు మూసివున్నట్టయితే ఇష్టంలేదన్న మాట. ఇష్టమైతే ఫలానా ముహూర్తాన పెళ్ళి చేద్దామనుకుంటారు. ఆ విధంగా నిశ్చయించుకున్న మరో పది చంద్ర కాలాల తర్వాత, మళ్ళీ రెండు కుటుం

బాల వాళ్లూ కలిసి ఆనందంగా కల్లు తాగు తారు...వరుడిని కాబోయే అత్తమామల ఇంట వదిలేసి, అతని తలిదండ్రులు తమ ఇంటికి వెళ్ళిపోతారు. పిల్లవాడు ఆ తగారింట ఏభయి చంద్ర కాలాల పాటు వుండాలి. ఈ కాలంలో-వరుడు అన్ని పనులూ చెయ్యాలి. వేటకి వెళ్ళి ఆహారం తేవాలి. పొయ్యిలోకి కట్టెలు తేవాలి. ఇంటి పన్లన్నీ చెయ్యాలి. వధువుతో కలిసి మెలిసి వుండవచ్చుగాని మాట్లాడకూడదు. మాట్లాడితే వ్రతభంగం అయినట్టే లెక్క. పెళ్ళి మరి జరగదు...ఆ తర్వాత అనుకున్న సమయానికి అందరి సమక్షంలో పెళ్ళి.,ఇంతేనమ్మా..ఆ పెళ్ళి ఎలా జరుగుతుందో-ఇప్పుడు మీరే స్వయంగా చూసారు..." అన్నాడు బుయ్యా.

"అదేమిటి, కట్నాలూ కానుకలూ అవేమీ వుండవా?" అంది అరుణ ఆశ్చర్యంగా.

"వరుడికి వధువునీ, వధువుకి వరుడినీ ఇవ్వటమే కానుక,కల్లూ విందూ కట్నాలు. మరింకేం లేవమ్మా"

కట్నాలు పొయ్యలేక పెళ్ళిళ్ళు కాక పోవడం, బోలెడు కట్నాలు పోసి ఆడపిల్లల తండ్రులు దివాలా తియ్యడం, ఎన్నటికీ పెళ్ళికాని పడుచులు రకరకాలుగా తమ జీవితాల్ని నాశనం చేసుకోవడం...కథలు కథలుగా పేరమ్మ చెప్పగా విన్నది అరుణ. 'మానవ లోకం కన్నా ఈ లోకం ఎంత హాయి!' అనుకొంది.

"అన్నట్టు మరో చిన్న అనుమానం-మీలో కుటుంబ నియంత్రణ వుందా ? అంటే ఒక కుటుంబంలో ఇద్దరు లేక ముగ్గురు పిల్లల కన్నా ఎక్కువ వుండకూడదని శాసనంలాంటిదేమేనా వుందా?" అనడిగింది.

"అలాంటి శాసనం ఏదీ లేదమ్మా ! ఎందుకంటే మాది అసలే బలహీనమైన జాతి. తక్కువ జనాభా వుంది. ఎక్కువ మంది పిల్లల్ని కన్న తల్లుల్ని మేము గౌరవంగా చూస్తాం. మాలో కవలలు, ఒకేసారి నలుగురేసి పిల్లలు పుట్టడం కూడా కద్దు. అందుకే గదమ్మా, తక్కువ వ్యవధిలో మా జనాభా వెయ్యికి పెరిగిందీ !" అంటూ అరుగుమీంచే ఆకాశంలోకి చూశాడు బుయ్యా. "అమ్మా ! ముహూర్తం సమీపిస్తున్నది. తమరింక కుర్‌కుర్‌ని అలంకరించడం మంచిది" అన్నాడు.

కుర్‌కుర్‌ని తన చేతుల్లోకి తీసుకుంది అరుణ. అరుగుమీద నుంచి లేచి, నెమ్మదిగా మెట్లు దిగింది. కాస్సంత దూరం వెళ్ళి ఒక పొదచాటున కూర్చుంది. వెన్నెల పట్టపగల్లా వుంది. ఆ వెండి వెన్నెల్లో కుర్‌కుర్‌ని పెళ్ళికూతురు చెయ్యడం ప్రారంభించింది. మొహాన్ని సబ్బుతో కడిగి తుడిచింది. స్నో రాసి పౌడరు అద్దింది. కుర్‌కుర్ కట్టుకున్న పరికిణీ, లంగా విప్పేసింది. ఆమెకి తను తెచ్చిన బెల్‌బాటమ్ పాంటూ, మణికట్టు వరకూ చేతులున్న ఎర్రని పువ్వుల బుష్షర్టు తొడిగింది. తలకి వాసననూనె రాసి దువ్వి, రెండు జడలు అల్లింది. నుదుటని తిలకందిద్దింది.తనుతెచ్చిన చిన్న బంగారం రంగుపూసలగొలుసుని కుర్‌కుర్ మెడలో వేసింది.

"ఇప్పుడు నువ్వెంత అందంగా వున్నావో తెలుసా ? నీ భర్త పొట్టిడుగానీ నిన్నిప్పుడు చూస్తే మూర్ఛపోతాడు"

అంది అరుణ తను అలంకరించిన కుర్ కుర్‌ని ఆప్యాయంగా చూస్తూ.

తన బట్టలకేసి వింతగా చూసుకుంది కుర్‌కుర్. తల ఎత్తి అరుణను కృతజ్ఞతగా చూసింది.

"నా దగ్గర కెమెరా వుంటే నిన్ను ఫొటో తీసేదాన్ని. అప్పుడు నువ్వెంత అందమైన దానివో నీకు తెలిసేది!" అంది అరుణ మళ్ళీ.

సిగ్గుపడింది కుర్‌కుర్.

"పోనీ, అద్దం వుందా మీ దగ్గర?"

"అద్దం... అంటే?" అంది కుర్‌కుర్ అదేదో దెయ్యమో, భూతమో అయినట్టు.

"అయ్యో, అద్దమంటే తెలీదా? ఈసారి నేనొచ్చినప్పుడు తెస్తాలే"

ఇద్దరూ మళ్ళీ మేడ దగ్గరికి వచ్చేరు. కుర్‌కుర్‌ని దింపి, తనూ అరుగుమీద కూర్చుంది. వింతైన వేషధారణలో వున్న 'కుర్‌కుర్'ని చూసిన శబర పురుషులు ఆశ్చర్యంతో మతులు పోగొట్టుకున్నారు. స్త్రీలు కొందరు ఆనందించినా, చాలామంది అసూయ పడ్డారు. మగాళ్ళ గుంపులో ఫుల్‌సూటులో వున్న 'పొట్టిడు' పెళ్ళి కూతుర్ని ప్రేమగా చూశాడు.

పెళ్ళి ముహూర్తానికింకా అయిదు నిమిషాల వ్యవధి వుంది.

అరుగుమీద వున్న మంటకి ఒక వేపున శబరులూ, ఇంకో వేపున పెళ్ళి కొడుకు కుటుంబం, పెళ్ళి కూతురి కుటుంబం వున్నారు. వేదిక దగ్గర బుయ్యా నిలబడి వున్నాడు. ఆడా మగా అంతా యమగోల చేస్తున్నారు. అంతలో అకస్మాత్తుగా నిశ్శబ్దం ఆవరించుకుంది.

సరిగ్గా ముహూర్తం వేళకి వేదిక మీదికి వధూవరులు ఎక్కారు. పీటల మీద ఎదురు బొదురుగా కూర్చున్నారు. కుర్ కుర్ కుడిచేతిని పొట్టిడి తలమీదా, పొట్టిడి కుడి చేతిని కుర్‌కుర్ తలమీదా వుంచేడు బుయ్యా. "ఈ క్షణం నుంచీ మీరిద్దరూ భార్యాభర్తలు. ఇద్దరూ సమానంగా కష్టపడి పని చెయ్యాలి, ఒకరి కష్టసుఖాల్లో ఇంకొకరు పాలుపంచుకోవాలి" అన్నాడు. అంతే! పెళ్ళయిపోయింది. 'పవిత్రమైన' కల్లుని గడేబోజన్‌కి నైవేద్యం పెట్టేడు బుయ్యా. మరుక్షణంలో – ఫెళ్ళున విందు ప్రారంభమైంది. ఆడా మగా, చిన్నా పెద్దా, ఒకటే తాగడం. తప్పెట్లు తాళాలు... సంగీతం మోత, ఆటలు, పాటలు, నాట్యాలు... ఒకటే సందడి. ఒళ్ళంతా కళ్ళు చేసుకుని అటే చూడ సాగింది అరుణ.

వేదిక మీదినుంచి పొట్టిడూ, కుర్‌కుర్ చిన్న లేడిపిల్లల్లా గెంతేరు. చెట్టాపట్టాలు వేసుకుని బేసిన్ దగ్గరికి వెళ్ళారు. ఒకరి నొకరు ప్రేమగా చూసుకుంటూ యిష్టం వచ్చినంత తాగేరు. తర్వాత నాట్యం చెయ్యడం ప్రారంభించారు.




పెళ్ళి వేడుకలన్నీ చూసి అరుణ సరస్సు దాటేసరికి తెల్లగా తెల్లవారిపోయింది. త్వరగా అడుగులు వేస్తూ గేటు దాటింది. మేడ మెట్లు ఎక్కుతూ సగంలోనే ఆగిపోయింది.

"ఆగిపోయావేం ? రా !!" అని గర్జించింది రాజేశ్వరి.

అరుగుమీద బెబ్బులిలా చిందులు తొక్కుతోంది రాజేశ్వరి. తను భయపడే కొద్దీ మరింత భయపెడుతుందని అరుణ మనస్సులోనే నిర్ణయించుకుంది. ధైర్యంగా మిగతా మెట్లెక్కి రాజేశ్వరి ముందు నిలబడింది.

"ఎక్కడనుంచి వస్తున్నావు?"

రాజేశ్వరి కళ్ళలోకి సూటిగా చూస్తూ "అలా షికారుగా వెళ్ళి వస్తున్నాను" అని జవాబిచ్చింది అరుణ నిర్భయంగా.

"నీ షికార్లకి వేళాపాళా ఏం వుండదా? అర్ధరాత్రి నుంచి ఇప్పటివరకూ నీకు షికార్లేమిటసలు? నువ్వేం చిన్నపిల్లవీ, చితక పిల్లవీ కావు. పెళ్ళీడు పిల్లవి. ఇలా తిరిగేదానివని తెలుస్తే నిన్నెవరయినా పెళ్ళి చేసుకుంటారా?" అంటూ మళ్ళీ గయ్‌మంది.

అరుణ మౌనం వహించింది. సరిగ్గా అదే సమయానికి కామేశ్వరరావు కూడా వచ్చాడు. భార్యనీ, మేనగోడల్నీ అలా చూసి 'మళ్ళీ ఏదో యుద్ధం !' అనుకుని ఆగేడు.

"ఈ చాకు నీకెక్కడిది ?" అంటూ అంత వరకూ తన వెనక దాచిన వస్తువుని తీసి అరుణ కళ్ళముందు పెట్టింది రాజేశ్వరి.

అది చూసి అరుణకి పై ప్రాణాలు పైనే పోయాయి. అది శబరులు తనకి బహూకరించిన నవరత్న ఖచిత సువర్ణ ఖడ్గం ! పిడికి తాపడం చేసివున్న నవరత్నాలు సూర్య కాంతికి మెరిసిపోన్నాయి.

"నాకు తెలీదు."

"తెలీదూ? మరి నీ బట్టల పెట్టెలోకి ఎలా వచ్చింది?"

"ఏమో ! నాకు తెలీదు !" మొండిగా జవాబిచ్చింది అరుణ.

రాజేశ్వరి చేతిలోని కత్తిని తీసుకొని పరీక్షగా చూశాడు కామేశ్వరరావు. కళ్ళు నులుముకొని మరోసారి పరీక్షగాచూశాడు. సందేహం లేదు. బంగారు కత్తి... పిడిని వున్నవి నవరత్నాలు.

"ఎక్కడిది అరుణా, ఈ చాకు నీకెక్కడిది ?" అనడిగాడు కామేశ్వరరావు బుజ్జగిస్తున్నట్టు.

"ఏమో...నాకు తెలీదు మావయ్యా" అంది అరుణ అమాయకంగా.

"నీకు తెలీకుండా, మరి ... నీ పెట్టెలోకి ఎలా వచ్చిందంటావు?"

"ఏమో మామయ్యా !"

"ఏమో... ఏమో... అన్నిటికీ అదే సమాధానం. సరేలే- నీ చేత నిజం ఎలా చెప్పించాలో నాకు తెలుసు. ముందిక్కణ్ణుంచి వెళ్లి ఆ పాచి మొహం కడుక్కో!" అంది రాజేశ్వరి.

'బతుకు జీవుడా'అనుకుని తన గదివేపు దారి తీసింది అరుణ.

"శ్రీనిలయంలో లంకెల బిందెలు చాలా వున్నాయని మా నాన్న చెప్పగా విన్నాను ... బహుశా ఈ చాకు అందులోనిదేనేమో..." అంది రాజేశ్వరి గొంతు తగ్గించి.

"శ్రీనిలయం మొత్తం గాలించి వదిలిపెట్టేంగా మనం?"

"మన దృష్టిలో పడకపోవచ్చు. అరుణకి కన్పించేయేమో!"

"మరి... తనకి తెలీదంటుందే..."

"అంతా వేషం ! రేపు ఈ పాటికల్లా

ఆ నిధినిక్షేపాలు ఎక్కడ వున్నాయో, ఆ కథా కమామీషూ అంతా ఆ య ణ నోటంట కక్కించనూ ?"

ఆ విషయంలో మరెంక తర్జన భర్జన చేసే ఓపిక కామేశ్వరరావుకి లే దు. రాత్రల్లా నిద్ర లేదు. అలసట. నిద్రతో కళ్ళు కూరుకుపోతున్నాయి.

"సరేగాని, కొం చెం జాగ్రత్తగా ప్రవర్తించు" అంటూ తన గది వేపు నడిచాడు.

ఆ మాట విని రాజేశ్వరి మూతి తిప్పింది.

* * *

మొహం కడుక్కుని కాఫీ టిఫిన్ తీసుకుని పరుగుపరుగున మాధవయ్య మాస్టారి కుటీరానికి అరుణ దారి తీసింది. ఓ పక్క నిద్ర ముంచుకొస్తున్నా - తన రహస్యం అత్తయ్య పసికట్టేసి నందుకు ఆమె మనసంతా ఆందోళనతో నిండి పోయింది. ఈ విషయం చెప్పి, వెంటనే మాధవయ్య మాస్టారి సలహా అడగాలని పించింది.

ఆమె వెళ్లేసరికి మాధవయ్య ఇంకా నిద్రపోతూనే వున్నాడు. బ్రహ్మలుంతా బద్ధలైనంత పని చేసి, చప్పట్లు కొట్టి మరీ ఆయన్ని లేపింది అరుణ.

"మాస్టారూ, కొంపమునిగిపోయింది!"

"శ్రీనిలయమేనా ? ము లి గి తే మునగనీ... నువ్వు బైటపడ్డావుగా! అదే పదివేలు!!" అన్నాడు మాధవయ్య ఇంకా కళ్ళు నులుముకుంటూనే.

"అదికాదు మాస్టారూ, నా రహస్యం సగం బైటపడిపోయింది !"

"నువ్విలా సగం సగం చెప్తే నాకు ఎలా అర్థం అవుతుంది అరుణా? పూర్తిగా చెప్పండే ఎలా?"

తను రాత్రల్లా పెళ్లి వేడుకలు చూసి తెల్లారగట్ల శ్రీనిలయంలోకి రావడం, తనకి శబరులు బహూకరించిన నవరత్న ఖచిత సువర్ణ ఖడ్గం అత్తయ్యకి దొరికి పోవడం, ఎలా వచ్చిందని ప్రశ్నించిడం- వగైరా విశేషాలన్నీ పూసగుచ్చినట్టు చెప్పింది అరుణ.

"నన్ను గద్దించి అడిగింది మాస్టారూ... ఏమో ఆ కత్తి సంగతే నాకు తెలీ దన్నాను!"అంది.

"ఇప్పుడు- నువ్వు తెలీదని దబా యించినా, కొన్నాళ్లకి నీ నోటితో నువ్వే చెప్పేస్తావు. చిలక సరస్సు అవతల హంసద్వీపంలోని విలాస గృహం అరుగు కింద గుహలో వేలాదిమంది ఆరంగుళాల శబరులు వున్నారనీ- వాళ్లే ఆ బంగారు కత్తిని యిచ్చారనీ- చెప్పేస్తావు!"

"చచ్చినా ఆ రహస్యం బైటపెట్టను!"

"మీ అత్తయ్య తల్చుకోవాలేగాని- ఇదొక లెక్కా, జమా!"

"ఏం చేస్తుందంటారు ?"

"నిన్ను గదిలో పెట్టి బైట తాళం వేస్తుంది. పచ్చి మంచి నీళ్ళయినా ఇవ్వ కుండా రెండు రోజులు అలాగే వుంచు తుంది. చిన్న చింత రువ్వ పుచ్చుకొని నీకు దేహశుద్ధి చెయ్యవచ్చు కూడా !"

"కొట్టినా,పీక తీసినా సరే చెప్పను!"

"అది నీ శక్తి మీద ఆధారపడివుంది" అన్నాడు మాధవయ్య సాలోచనగా అరుణని చూస్తూ.

"మాస్టారూ ! ఒకవేళ... ఒకవేళ సుమండీ... శబరుల రహస్యం అత్తయ్యకి తెలిసిపోయిందే అనుకోండి... ఏం చేస్తుందంటారు? శబరుల్ని హంసద్వీపం నుంచి తరిమేస్తుందంటారా ?" అనడిగింది

అరుణ సందేహంగా.

"అంతకన్నా భయంకరమైన పనే చేస్తుంది..."

"అక్కడనుంచి వాళ్లని తరిమెయ్యడం కన్నా భయంకరమైన పని యింకేముంది మాష్టారూ ?"

"పిచ్చిదానా! నా దగ్గరనుంచి 'గలివర్ యాత్రలు' పుస్తకం తీసుకెళ్లావు గదా! సరిగ్గా చదవలేదా ?"

"పూర్తిగా చదవలేదు మాష్టారూ! మొదటి ప్రయాణం మాత్రం చదివేను."

"అలా చెప్పు. ఆరంగుళాల మనుషులున్న ద్వీపాలు లిల్లిపుట్, బ్లెఫస్కూ సందర్శించి వచ్చిన తర్వాత గలివర్ మళ్లీ మరోసారి సముద్ర ప్రయాణానికి సిద్ధమయ్యాడు. ఈ సారి 'బ్రాబ్‌డింగ్ నేగ్' అనే ద్వీపాన్ని ఒంటరిగా చేరుకున్నాడు. అక్కడ మనలాంటి మనుషులే అరవై గజాల ఎత్తున్న వాళ్లున్నారట. గలివర్ ప్రమాదవశాత్తూ ఓ రైతు చేతుల్లో చిక్కుకున్నాట్ట. 'జూ' లో జంతువుల్ని ప్రదర్శించినట్లు గలివర్‌ని ఆ దేశం వారందరికీ ప్రదర్శించేడట. గలివర్‌కి తమ భాష నేర్పించాడట. రకరకాల పనులు చచ్చేట్టు అతని చేత చేయించి తను బాగా డబ్బు సంపాదించాడట. చివరికి గలివర్‌ని ఆ దేశపు మహారాణికి అమ్మేశాడట. ... ఆ తరువాత ఆ దేశం నుంచి గలివర్ బైట పడటం అదీ వేరే కథ అనుకో... !"

"అందే శబరుల్ని కూడా ఆ తయ్య



అలాగే అమ్మేస్తుందంటారా మాష్టారూ !" అంది అరుణ భయంగా.

"అందులో అనుమానం ఏమీ లేదు. మన దేశంలో డబ్బూ, బోలెడు తీరు బాటూ వున్న సోమరిపోతు ధనవంతులు చాలామంది వున్నారు. కుక్కలికీ, పిల్లులకీ బదులు వాళ్లు చాలా ఆనందంగా శబరుల్ని కొని పెంచుకుంటారు... ఒక్కొక్క మనిషినీ కనీసం వెయ్యి రూపాయలైనా సరే ఇచ్చి కొంటారు.అంటే ఆ లెక్కని మీ అత్తయ్య పది లక్షల రూపాయలు సంపాదిస్తుందన్నమాట !"

"అన్యాయం మాష్టారూ! కుక్కల్లా, పందుల్లా అమ్ముడుపోవడానికి వాళ్లు జంతువులేం కారు... వాళ్ళూ మనుషులే!" అంది అరుణ ఆవేశంగా.

"జంతువులు కారు గనకే, మనుషులు గనకే ఆరంగుళాల ఎత్తున్న వాళ్ళూ బలహీనులూ గనకే- వాళ్లకి ఆ గిరాకీ! అసలు ఈ సంగతి విదేశస్తులకి తెలిస్తే- ఒక్కొక్కర్నీ లక్షరూపాయిలిచ్చి కూడా కొనుక్కుపోవచ్చు !"

మాధవయ్య మాష్టారు అలా అనే సరికి ఏం మాట్లాడాలన్నా అరుణకి నోరు రాలేదు. చాలా సేపు ఆయన్నే చూస్తూండి పోయింది. చివరికి "అంతేనంటారా మాష్టారూ ?" అంది దిగులుగా.

"అంతేమరి"

"కానీ, ఒక విషయం మీరు మర్చిపోతున్నారు మాష్టారూ...వాళ్ళు ఆరు అంగుళాలవాళ్ళే అయినప్పటికీ—వాళ్ళూ మనుషులే! వాళ్ళకీ మనలాగే మెదడూ ఇతర అంగాలూ వున్నాయి. వాళ్ళని బానిసల్లా అమ్మేసే హక్కు అత్తయ్యకి లేదు!"

"నిజమే. చట్టప్రకారం మనుషుల్ని అమ్మడం నేరం. కానీ, ఇక్కడ ఒక చిన్న లిటిగేషన్ వుంది. ముందు వాళ్ళు మనుషులా, జంతువులా అన్న సంగతి తేల్చుకోవాలి. వాళ్ళు మనుషులే అయితే, వాళ్ళని అమ్మే హక్కు మీ అత్తయ్యకి లేదు. వాళ్ళు మనుషులు కానట్టయితే, వాళ్ళు నీ ద్వీపంమీద ఎన్నో ఏళ్ళనుంచీ వుంటున్నారుగనుక, వాళ్ళు నీ సొత్తే అవుతారు. వాళ్ళమీద నీకే హక్కు వుంటుంది."

"మాష్టారూ ! హక్కులూ, చట్టాలూ పేరుకి మాత్రమే! అత్తయ్య నన్నెన్ని హింసలు పెడుతూందో మీరు చూస్తూనే వున్నారు. నేనేం చెయ్యగలిగాను?"

"మీ అత్తయ్య మావయ్యల బలానికి మనం తట్టుకోలేము...అసలు, నువ్వు చెప్పేగదా వాళ్ళకి శబరుల గొడవ తెలిసేదీ...? ఆ తర్వాతగదా అమ్మడం ప్రసక్తి వచ్చేదీ! మరీ గట్టిగా అడిగితే ఆ బంగారు కత్తి దొరికించని ఒప్పేసుకో"

"దొరికిందంటే వూరుకుంటుందా మా అత్తయ్య? 'ఎక్కడ దొరికింది' అనడుగుతుంది. చెప్పేదాకా చిత్రహింస పెడుతుంది."

"ఆగాగు! మంచి ఆలోచన వచ్చింది. శ్రీనిలయానికి కుడివేపున గెస్టు హౌస్ వుంది చూశావా ? అందులో నేలమాళిగ ఒకటుందని మీ తాతగారు ఎవరితోనో చెప్పగా విన్నాను. ఆ నేలమాళిగలో కత్తి దొరికిందని చెప్పు. ఆ నేలమాళిగ పేరు చెప్పేసరికే వాళ్ళు భయపడిపోతారు. మానవ మాత్రులెవరూ ఆ చీకటి గుయ్యారంలోకి వెళ్ళే సాహసం చెయ్యలేరు !"

"ఎంచేత మాష్టారూ?"

"అందులో దెయ్యాలున్నాయని ఒక కట్టుకథ వుందిలే"

"భలే వూహ తట్టింది మాస్టారూ! చాలా థాంక్స్"

"నో మెన్షన్. నువ్వు మాత్రం ధైర్యంగా వుండు. దేనికీ చలించకు. నీకు ఏమయినా అపకారం జరుగుతుందని ఏ మాత్రం తెలిసినా వెంటనే పేరమ్మ ద్వారా నాకు కబురుచెయ్యి"

"అలాగే. పాపం, ఆ శబరులు అందుకే గాబోలు మొదట నా కళ్ళ పడ్డానికి ఇష్టపడలేదు."

"మరేంటనుకున్నావు? అన్నట్టు నీ పది గజాల ఫ్రెండ్స్ ఎలా వున్నారు?"

"ఈ మధ్య అటు వెళ్ళలేదు మేస్టారూ! అయినా వాళ్ళకేం,చక్కగా రాజారాణీల్లా వుండి వుంటారు...సరేనండీ, నేనింక వెళ్ళి వస్తాను. నిద్ర వచ్చేస్తోంది" అంటూ లేచింది అరుణ, ఆవులిస్తూ.

"మంచిదమ్మా, వెళ్ళిరా!"




చిలక సరస్సు దాటి హంస ద్వీపం మీద అడుగు పెట్టింది అరుణ. శబరులు వుండే మేడ వేపు వెళ్ళబోయి, అంతలో ఏదో ఆలోచన రాగా ఆగిపోయింది.

నిద్రలేమి వల్ల కళ్ళు మూసుకుపోతున్నాయి. సమయం పది గంటలు కావస్తుందేమో, ఎండ చుర్రు మంటోంది. ఆ ఎండ అరుణ నెత్తిని మాడ్చేస్తోంది. మొదట మాష్టారి దగ్గర్నించి ఇంటికి పోయి, ఆ పాట్నే పక్కమీద వాలి నిద్రపోదాం అనుకుంది. కానీ,ఎంచేతోఅంత త్వరగా శ్రీనిలయం వేపు వెళ్ళాలని పించలేదు. శబరులకి ఈ వార్త చెప్పి తగు జాగ్రత్తలో వుండమని హెచ్చరించా లనిపించింది. అందుకే పడవ ఎక్కి హంస ద్వీపం చేరింది. తీరా వచ్చేసరికి అరుణకి మరో అనుమానం పట్టుకుంది.

తమ రహస్యం తనకి తెలీకుండా శబరులు ఎంతో జాగ్రత్త పడ్డారు. తను వాళ్ళకి అపకారం చెయ్యదని నమ్మిన తర్వాతే గద, వాళ్ళు తనతో స్నేహం చేసింది... ఈ రహస్యం తనకీ, మాధవయ్య మాష్టారికీ, శుక్రగ్రహవాసులకి తప్ప- ఇంకెవరికీ ఇప్పటివరకూ తెలీదు. అరుణ భరోసా ఇచ్చిన మీదట శుక్రగ్రహవాసుల వల్లా, మాష్టారివల్లా తమకి అపాయం జరగదని శబరులు నమ్మేరు... రాజేశ్వరి అత్తయ్యకి తమ రహస్య స్థావరం తెలిసి, తమని బానిసల్లా అమ్మేసే అవకాశం వుందని తెలిస్తే వాళ్ళు అక్కడుంటారా? రాత్రికి రాత్రే మరో చోటికి తరలి వెళ్ళిపోరూ? ఆఖరికి తనకి కూడా తెలీని చోటికి వెళ్ళిపోతారేమో! — ఈ అనుమానం రాగానే అరుణ అడుగులు ఆగి పోయాయి.

'లాభంలేదు. వెనక్కి తిరగడం మంచిది.' అనుకుంది అరుణ.

అలా అనుకున్నంతలో— రోదసీ నౌక మీద ద్వారం దగ్గర నిలబడి తన వేపు నవ్వుతూ చూస్తోన్న యూపీ కనిపించింది. తను అటు చూడగానే రమ్మంటూ చేయి వూపసాగింది. నీరు

సంగా కాక్షీడుస్తూ అటు నడిచింది అరుణ.

యూవీ నిచ్చెనమీంచి కిందికి దిగింది. నేలమీద కూర్చోగానే "గుడ్ మార్నింగ్ మిసెస్ యూవీ!" అంటూ—ఆమె గౌను జేబులోకి ఎక్కి కూర్చుంది అరుణ.

ఏదో యంత్రం ముందు నిలబడి పరీక్ష చేస్తున్న ఆర్టిమస్ చప్పుడు విని వెనక్కు తిరిగి చూశాడు. యూవీ జేబులో వున్న అరుణని చూసి పలకరింపుగా నవ్వాడు.

యూవీ, ఆర్టిమస్‌లు చెరో కుర్చీలోనూ కూర్చొని తమ మధ్య వున్న బల్లమీద యథాప్రకారం అరుణని కూర్చోబెట్టారు.

"హలో అరుణా! ఏమిటి విశేషాలు?" అనడిగేడు ఆర్టిమస్.

విషయాలన్నీ వివరంగా అరుణ చెప్తూంటే—మౌనంగా విన్నారు వాళ్ళిద్దరూ.

"మమ్మల్ని కూడా నీతోపాటు తీసుకెళ్ళే ఎంత బావుండేది అరుణా 'అరంగుశాల శబరుల పెళ్ళి' మేం కూడా చూసే వాళ్ళంగా!" అంది యూవీ నిష్టూరంగా.

"బావుంది. నన్ను చూస్తేనే వాళ్ళకి ఏదో పెద్ద పర్వతం చూసినట్టు వుంటుందిట. ఇక మిమ్మల్ని చూస్తే చెప్పనక్కర్లేదు. గుండె ఆగి ఢామ్మని చస్తారు. లేదా కళ్ళు తేలవేసి మూర్ఛపోతారు !" అని జవాబిచ్చింది అరుణ.

మనస్ఫూర్తిగా నవ్వేరు ఇద్దరూ.

"అన్నట్టు...అరుణా! మీ మేస్టారు చెప్పినట్టు ధైర్యంగా వుండు. అన్నీ వాటంతట అవే చక్కబడతాయి. నీకింకా సహాయం కావాల్సొస్తే మేం వున్నాంగా" అని 'ఏమంటావు?' అన్నట్టు తల ఎగరవేశాడు ఆర్టిమస్.

అతని మాటలు వినగానే అరుణకి మరికాస్త ధైర్యం వచ్చింది. 'అమ్మయ్య' అనుకొని హాయిగా వూపిరి పీల్చుకుంది.

"సరేగానీ, ఎలాగూ వచ్చావు గనక, చిన్న కథ చెప్పి వెళ్ళిపో" అంది యూవీ.

ఏ కథ చెప్పనా అని ఆలోచించింది అరుణ.

"మంచి కథలేవీ సమయానికి తట్టడం లేదు...పోనీ ఓ చిన్న గ్రీక్ పురాణ కథను చెప్తాను...మీకు నచ్చుతుందో...నచ్చదో!" అంది.

"ఏం ఫర్వాలేదు. నీ తియ్యని నోటంట వింటూ వుంటే ఎలాంటి కథ అయినా నచ్చుతుంది...మాకు! కదూ డార్లింగ్?" అంది యూవీ భర్తని చూస్తూ.

చిన్నగా నవ్వుతూ "అసలు, అందుకే నిన్ను వూరికే కథలు చెప్పమంటూ వుంటుంది. నువ్వు మాట్లాడితే చక్కని సంగీతం వింటున్నట్టు వుంటుందట !" అన్నాడు ఆర్టిమస్.

ఆ పొగడ్తలకి కొంచెం సిగ్గేసింది.

"సరే కథ చెప్పడం ప్రారంభిస్తాను. వినండి. నాకు గ్రీక్ పేర్లు సరిగ్గా తెలీవు. రోమన్ పేర్లతో కథ చెప్తా" అంటూ మొదలు పెట్టింది.

"పూర్వం-ప్రోక్రిస్, సెఫాలస్ అనే భార్యాభర్తలు వుండేవారు. వాళ్ళెంతో అన్యోన్యంగా అనురాగంగా వుండేవారట.. ఇలా వుండగా-ఒకనాడు అడవిలో ఒంటరిగా వున్న సెఫాలస్‌ని చూసి అరోరా అనే దేవత ప్రేమించిందట. సెఫాలస్ ఎంతో అందగాడు. అతన్ని పెళ్ళి చేసుకోవాలని అరోరా ఎంతగానో ముచ్చట

పడింది. తనున్న ప్రదేశానికి బలవంతంగా అతన్ని తీసుకువెళ్ళింది. అక్కడ తన మనస్సులోని భావం అతనికి, ఎంతో దీనంగా చెప్పింది... కాని సెఫాలస్ అందుకు ఒప్పుకోలేదు. తనకి వివాహం అయిందనీ,తన భార్య పేరు ప్రోక్రిస్ అనీ, ఆమెని తప్ప ఇంకెవర్నీ తను ప్రేమించ లేననీ - అరోరాకి ఎంతో ఆవేదనగా చెప్పాడు సెఫాలస్. అయినా సరే-ఎన్నోరకాల ఆశలు అరోరా అతనికి చూపించింది. తనని పెళ్ళాడితే, మహా రాజుని చేస్తానంది. కాని సెఫాలస్ దేనికీ లొంగలేదు. ఆఖరికి అరోరాకి విసుగూ, కోపం వచ్చాయి. 'సరే-నీ ప్రియురాలు ప్రోక్రిస్ దగ్గరికే వెళ్ళు. కాని, ఆమెని అంతగా ప్రేమించినందుకు నువ్వెంతో విచారించేరోజు తప్పకుండా వస్తుంది!' అంది.

ఆ విధంగా అరోరా అన్న మాటలే సెఫాలస్ దాంపత్య జీవితానికి 'శాపం' అయ్యాయి. అరోరా చెరనుంచి తిరిగి వచ్చాక, భార్యాభర్త లిద్దరూ కొన్నాళ్ళ పాటు సంతోషంగా కాలం గడిపారు. ప్రోక్రిస్ భర్తకి రెండు కానుకలు ఇచ్చింది. ఒకటేమంటే : పరుగెత్తడంలో దానికదే సాటి అయిన మేలుజాతి జాగిలం. రెండోది: గురి తప్పని సూది మొనవున్న బల్లెం... ఈ రెండిటినీ, వేటకి వెళ్ళేప్పుడు తనతోబాటు సెఫాలస్ తీసుకువెళ్ళాడు.,. అవి లేకుండా ఏనాడూ వేటకి వెళ్ళేవాడు కాదు... ఈ మధ్య సెఫాలస్ ఓ వింత అలవాటుకి గురి అయ్యాడు. వేటాడిన కాసేపటికి ఏదో ఓ చెట్టు కింద కూర్చొనే వాడు. బల్లేన్ని పక్కనే పెట్టేవాడు. చెట్టు మొదలుకి వీపు ఆనించి అలసటగా ఒళ్ళు విరుచుకునేవాడు. తర్వాత-మృదువైన ఓ ఆరా రా! త్వరగా వచ్చి నా హృదయతాపం చల్లార్చు. నీ తియ్యని గాలుల్ని నా మొహం మీదికి రానీ!'-అనే వాడు. 'ఆరా' అంటే 'గాలి' పేరు అన్న మాట...!

"ఒకరోజు... సెఫాలస్ మాటల్ని ప్రోక్రిస్ స్నేహితురాళ్ళు వినడం తటస్థించింది. 'ఆరా'అంటే ఎవరో స్త్రీ అనుకున్నారు వాళ్ళు. చివరికి ఈ కబురు చిలవలు పలవలో ప్రోక్రిషవరకూ వెళ్ళింది. మొదట ఈ విషయాన్ని ఆమె నమ్మలేదు. ఎంతో ఆలోచించి, మథనపడి, ఆఖరికి తనేస్వయంగా విచారించాలని నిశ్చయించుకుంది. యథాప్రకారం ఒకనాడు భర్త వేటకని బయల్దేరేడు. అతనికి తెలీకుండా రహస్యంగా తను కూడా వెంబడించింది...

"మామూలుగా మిట్టమధ్యాహ్నపు సమయానికి సెఫాలస్ వేటని ఆపు చేశాడు. ఒక చెట్టుకింద కూర్చున్నాడు. బల్లెం కింద పెట్టాడు. కుక్క కూడా అతని పక్కనే నీడలో కూర్చుంది. అల వాటు ప్రకారం చెట్టు మొదలుకి చేరబడి 'మృదువైన ఓ ఆరా, రా! త్వరగావచ్చి నా హృదయతాపం చల్లార్చు. నీ తియ్యని గాలుల్ని నా మొహం మీదికి రానీ!' అన్నాడు.

"భర్త మాటల్ని వినగానే ప్రోక్రిస్‌కి తన చెలికత్తెలు చెప్పిన వూహాగానాలు గుర్తుకొచ్చాయి. తన భర్త నిజంగానే మరో స్త్రీని ప్రేమిస్తున్నాడని గుట్టిగా నమ్మింది. ఈ సత్యం భరించలేక ఆమె అక్కడే స్పృహ తప్పి పడిపోయింది.

"ఎండుటాకుల మీద ఆ చప్పుడు వినగానే సెఫాలస్ వెంటనే లేచి నిల

బడ్డాడు. ఏదో క్రూర జంతువు తన మీదికి వురికే ప్రయత్నంలో వుందని భ్రమించాడు. చప్పున నేలమీద వున్న బల్లెం అందుకొని, ఆ చప్పుడు వినవచ్చిన దిక్కుగా రివ్వున విసిరాడు...తీరా వెళ్ళి చూసేసరికి క్రూర జంతువుకి బదులు రక్తపు మడుగులో పొర్లుతున్న తన భార్య ప్రోక్రిస్ కనిపించింది... ఆ అవసాన దశలో కూడా 'ఆరా'ని వివాహం చేసుకోవద్దని భర్తని ప్రార్థించింది ప్రోక్రిస్...సంగతంతా అప్పుడు సెఫాలస్‌కి అర్థం అయింది. 'ఆరా' అంటే గాలికి తను పెట్టిన పేరనీ, వేరే స్త్రీ ఎవరూ కాదనీ ఆమెకి వివరించాడు... భర్త మాటలు వినేసరికి ఆమె ముఖంలోని బాధ మాయమైంది. సంతృప్తిగా, ఆనందంగా, అతని ఒళ్ళో ప్రాణాలు విడిచింది!" అంటూ కథ ముగించింది అరుణ.

బరువుగా నిట్టూర్చింది యూపీ.

"అరోరా దేవత ఆ విధంగా తన పగ తీర్చుకుందన్న మాట !" అన్నాడు ఆర్టిమస్.

"అది దేవతేమిటి నా మొహం, బ్రహ్మరాక్షసి!" అంది అరుణ కోపంగా.

"మీ అత్తయ్య జ్ఞాపకానికి వచ్చినట్టుందే !" అంది యూపీ తమాషాకి, నవ్వుతూ.

"అత్తయ్య కాదుగాని, నిద్ర ముంచుకు వస్తోంది !... మరింక వెళ్తానండీ!" అంటూ లేచి నిలబడింది అరుణ.

అరుణ శ్రీనిలయం చేరేసరికి మధ్యాహ్నం పన్నెండు దాటింది. తన గదివేపు వెళ్తుంటే అత్తయ్య గదిలో ఏవేవో గుసగుసలు వినిపించేయి. నిద్రమీద తప్ప అరుణకి మరి దేనిమీదా ధ్యాసలేదు. తిన్నగా తన గదిలోకి వెళ్ళి మంచంమీద పడుకుని నిద్రపోయింది.

అలా నిద్రపోయిన అరుణకి మళ్ళీ మెలకువ వచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటలైంది. కడుపులో ఆకలి కరకరమంటూ వుంది. తలంతా ఒకటే దిమ్ముగా వుంది. లేచి స్విచ్ వేసి దీపం వెలిగించింది. బాత్‌రూంలోకి పోయి, కాళ్ళూ చేతులూ మొహం కడుక్కుని వచ్చింది. తన గదిలోకి అడుగుపెడుతూనే-మంచంమీద కూర్చున్న అత్తయ్యనీ, మావయ్యనీ చూసి నిర్ఘాంతపోయింది.

"అరుణా, నీ మంచికోసమే చెబుతున్నాను. మర్యాదగా అల్లరి చేయకుండా నీకి కత్తి ఎక్కడ దొరికిందో చెప్పు"అంది రాజేశ్వరి చాలా ప్రశాంతంగా.

కావాలనే చాలాసేపు ఆలస్యం చేసి, చివరికి "నేలమాళిగలో దొరికింది!" అంది అరుణ.

"ఎక్కడుంది నేలమాళిగ?"

"అతిథి గృహంలో..."

"అక్కడ దెయ్యాలుంటాయని విన్నానే. నువ్వొక్కర్తివీ అక్కడికి వెళ్ళేవా ? భయం అన్పించలేదూ ?"

"లేదు"

"ఇలాంటి బంగారు వస్తువులు ఇంకా అక్కడ వున్నాయా?"

"ఏమో నాకు తెలీదు. చీకట్లో నాకేం కన్పించలేదు. ఈ చాకు ఒక్కటే దొరికింది"

వాళ్ళిద్దరి మాటలు వింటూ సిగరెట్ తాగుతూ, ఏదో ఆలోచిస్తున్నాడు కామేశ్వరరావు. తన పథకం పారకుండా మధ్యలో ఈ నిధి గొడవ వచ్చిపడినందుకు అతనికి మహా విసుగ్గా వుంది. క్రూరంగా

నిప్పులు కక్కుతూన్నట్టు వికృతంగా వున్న రాజేశ్వరి మొహాన్నీ, అప్పుడే విరిసిన కలువలా అందంగా అమాయకంగా వున్న అరుణ మొహాన్నీ మార్చిమార్చి చూశాడు.

'అరుణలాంటి అందాలరాసి భార్యగా లభించడం ఎంత అదృష్టం! ఈ రాజేశ్వరి దెయ్యాన్ని ఎలాగోలా వదిలించుకుంటే సరి! అందాల భరిణలాంటి అరుణా, ఆమె పేరనున్న లక్షల ఆస్తీ తనదే అవుతుంది...' ఇలా ఆలోచనల్లో కామేశ్వర రావు కొట్టుకుపోతున్నాడు.

"నీ మాటలమీద నాకు నమ్మకం లేదు. నువ్వు నిజం చెబుతున్నావన్న విశ్వాసం ఎంచేతో కుదరడం లేదు...నేనూ మీ మావయ్యా వెళ్ళి ఆ నేలమాళిగలో చూస్తాం. అక్కడ నిధి నిక్షేపాలున్నాయా సరే సరి! లేదా నిజం చెప్పేవరకూ నీకు తిండీ తిప్పలూ వుండవు!!" అంటూ లేచింది రాజేశ్వరి. "పదండి" అంది భర్తను వుద్దేశించి.

ఇద్దరూ గది బయటికి నడిచారు. తలుపులు వేసి బైట గొళ్ళెం పెట్టడం, దానికి తాళం వెయ్యడం—ఈ చప్పుళ్ళన్నీ అరుణకి స్పష్టంగా వినిపించేయి. దిగాలుగా మంచంమీద కూర్చుంది.

ఇప్పుడేం చెయ్యడం ?

వీళ్ళు వెళ్ళి ఆ నేలమాళిగ అంతా పరిశోధిస్తారు. వీళ్ళే రాక్షసులు. వీళ్ళకి దెయ్యాలంటే భయం ఏముంది ? పైగా అందులో ఏవో నిధి నిక్షేపాలున్నాయని ఆశ కూడా పడుతున్నారు. వెళ్ళి వెతికిన తర్వాత—తీరా ఏమీ లేవని తెలిస్తే—వీళ్ళు తనని ఏం చేస్తారో ? తను మధ్యాహ్నం కూడా భోజనం చెయ్యలేదు. ఇప్పుడూ భోజనం లేదు. ఈ సంగతి పేరమ్మకి తెలుసో, తెలీదో! లేకపోతే నల్లమందు వేసుకుని గుర్రుకొడుతూ నిద్ర పోతున్నదో...!

—ఇలా ఆలోచనల్లో మునిగి వున్న అరుణకి ఏదో చప్పుడు వినిపించింది. ఆ దిక్కుగా చూసేసరికి, తన గదికివున్న కిటికీమీద 'ఆరంగుళాల పొట్టిడు' సూటూ బూటూ వేషంలో కన్పించాడు. వాడి పక్కనే బెల్‌బాటమ్స్‌లో సిగ్గులు చిందిస్తూ కుర్‌కుర్ నిలబడి వుంది. పొట్టిడి చేతుల్లో తనిచ్చిన పెన్‌టార్చ్, చిన్న చాకూ కన్పించాయి. అరుణ తమవంక చూడగానే ఇద్దరూ తలలు వంచి నమస్కరించారు.




వాళ్ళని అలా చూస్తూ వుంటే ఒక్కసారి ఎగిరి గంతులు వెయ్యాలనీ డాన్స్ చెయ్యాలనీ అన్పించింది అరుణకి. మంచం దిగి కిటికీ దగ్గరికి వెళ్ళింది.

"అమ్మగారూ ! నిన్న పెళ్ళి హడావుడిలో మీకు సరిగ్గా విందు ఏర్పాట్లు చూడలేక పోయాం. పోనీ ఇవేళ వస్తారేమోనని ఇప్పటివరకు చూశాం. చివరికి మా సైన్యాధిపతి ఢింగరీని చూసి రమ్మని పంపించాం. వాడికి ఈ భవనం, ఇందులోని గదులూ అన్నీ బాగా తెలుసు. వాడు ఒక తాడు సహాయంతో మీ కిటికీ ఎక్కేడు. ఎవరో రెండు మానవ పర్వ

తాలు ఏవో నిధి నిక్షేపాలకోసం మిమ్మల్ని వేధించడం, మీరు ఏదో చెప్పడం, అదంతా మాకు సరిగ్గా చెప్పలేదు గానీ, మీకు 'భోజనం పెట్టం' అని వారన్నట్టు చెప్పాడు. మా బుయ్యా గారికి ఈ సంగతి చెప్పాం. మీరు చెప్పగా, మా అందరికీ మీ అత్తయ్యగారి సంగతి తెలుసు. అందు చేత ఢింగరీ ఈ విషయం చెప్పగానే మీ భోజనం కోసం ఏర్పాట్లు చేశాం!" అంటూ గుక్క తిప్పుకోకుండా చెప్పాడు పొట్టిడు.

అరుణ నీరసంగా నవ్వుతూ కుర్‌కుర్ తలని తన చూపుడు వేలితో నిమిరింది. సిగ్గుల మొగ్గలా ముడుచుకు పోయింది కుర్‌కుర్.

"నువ్వెందుకు వచ్చావ్ ?"

"మిమ్మల్ని చూడాలనిపించింది అమ్మ గారూ!" అంది.

పొట్టిడు కిటికీ వూచ పట్టుకుని బైటికి చూశాడు. తమాషాగా ఏదో ఈల లాంటిది వేశాడు.

మరుక్షణంలో కిటికీలోంచి బుయ్యా, ఢింగరీ, ఇంకో పదిమంది శబరులూ ప్రత్యక్షమయ్యారు. కిటికీని ఆనుకొని గిలకలాంటిదేదో అమర్చారు. తనిచ్చిన ట్వయిన దారాన్ని పేని బలమైన తాడుగా చేశారు. నూతిలోంచి చేద తోడి నట్టు తాడు లాగడం ప్రారంభించారు.

ఈలోగా కిటికీకి దగ్గరగా గోడకి ఆనుకుని వుండేట్టు తన మేజా బల్లని అమర్చింది అరుణ. కిటికీలో ప్రత్యక్ష మైన పాత బోర్న్‌విటా డబ్బా చూసి ఆశ్చర్యపోయింది. దాన్ని అందుకుని చూసింది. అందులో ఒక చిన్న ఏపిలు పండు వుంది. అది తీశాక, మళ్ళీ డబ్బాని జారవిడిచారు వాళ్ళు. మళ్ళీ తాడు లాగ డం ప్రారంభించారు. నేలకి రెండు గజాల ఎత్తున వుంది కిటికీ. నేలమీద ఇంకా ఇరవై మంది శబరులు వున్నారు. ఈసారి డబ్బాతో ఒక చక్కెరకేళీ అరటి పండు వచ్చింది.

అలా అంచెలవారీగా వచ్చిన పళ్ళని బల్లమీద వుంచింది అరుణ. ఆ బల్లమీదే ఓ పక్క బుయ్యా, పొట్టిడూ, ఢింగరీ, ఇతర శబరులూ కూర్చున్నారు. తన కుర్చీ తెచ్చుకుని బల్ల దగ్గరగా వేసి కూర్చుంది. మారుమాటాడకుండా భోజన పదార్థాలమీద యుద్ధం ప్రారంభించింది.

ఆమె తింటున్నంతసేపూ శబరులు మౌనంగా వున్నారు. అరుణ గదిని చూస్తూ ఆశ్చర్యపోసాగారు. ఆ ఆరు అంగుళాల మనుషులకి - ఇరవై గజాల ఎత్తూ, ముప్ఫయి గజాల వెడల్పూ, నలభై గజాల పొడవూ వున్న అరుణ గది ఏదో వింత ప్రపంచంలా కనిపించింది. 'అవును మరి. మానవ పర్వతానికి ఈ మాత్రం గది వుండాల్సిందే' అను కున్నారు వాళ్ళు. గదికి మధ్యని ఇంటి కప్పు దగ్గర వెలుగుతూన్న రెండు ఫ్లోర సెంట్ విద్యుద్దీపాల్నీ చూసి ఆశ్చర్య



పోయారు. కుర్‌కుర్ అరుణ మంచం చూసి 'ఎంత విచిత్రంగా వుందో! దాని మీద కనీసం అయిదువందల మంది పడు కోవచ్చు' అనుకుంది. మంచం పక్కనే వున్న పుస్తకాల రేక్‌నీ, అందులోని పుస్తకాల్ని బుయ్యా ఆరాధనగా చూశాడు 'అరుణకుమారీ దేవి, నా అంత పొడవూ వెడల్పూ వున్న పుస్తకాల్ని చదువు తుందన్న మాట. అందులోని అక్షరాలు, నా తలకాయంత వుంటాయేమో!' అను కున్నాడు.

నాలుగు ఏపిలుపళ్లూ, పది అరటి పళ్లూ, ఏభై ద్రాక్షపళ్ళూ, రెండుగ్లాసుల పాలూ వరసగా, చకచకా అరుణ బొజ్జ లోకి వెళ్ళిపోయాయి. గ్లాసుడు మంచినీళ్లు తాగి 'బ్రేవ్'మని త్రేన్చింది అరుణ.

ఆ చప్పుడు విని కుర్‌కుర్ కిలకిల నవ్వింది. మిగతా శబరులకు ఆనందం కలిగింది, అరుణ అలా త్రేన్చిందంటే ఆమె కడుపు నిండిందని అర్థం—ఆ సంగతి వాళ్ళకి తెలుసు.

"అమ్మయ్య... ఇప్పుడు నాకెంతో హాయిగా వుంది" అంది. తనకి ఎదురుగా బల్లమీదున్న శబరుల్ని చూస్తూ వుంటే—ఆ ఆహార పదార్థాలు తీసుకురావడానికి వాళ్ళెంత కష్టపడ్డారో. కొద్దికొద్దిగా ఆమెకి అర్థం కాసాగింది.

హంసద్వీపంలో వీళ్లుండే మేడ అరుగుకీ సరస్సు ఒడ్డుకీ మధ్య ఫర్లాంగు దూరం వుంది. మామూలు మనుషులకి ఫర్లాంగు దూరం పెద్ద లెక్కలోకి రాకపోవచ్చు. మనం ఒకడుగు వేస్తే వాళ్ళు పదిహేను అడుగులు వేస్తారు. రెండు ఫర్లాంగుల దూరం చిలక సరస్సు మీద చిన్న చిన్న పడవల్లో ప్రయాణం చెయ్యాలి. ఇవతలి ఒడ్డు చేరుకోగానే మళ్ళీ మరో రెండు ఫర్లాంగుల దూరం నడిచి శ్రీనిల యం చేరుకోవాలి. శ్రీనిలయం గేటుకీ మేడకీ మధ్య మరో ఫర్లాంగు దూరం వుంది... చిన్న అడుగుల్తో, శత్రు భయంతో ఇంత దూరం ఎలా ప్రయాణం చేశారో వాళ్లు...? పాతికపైగా వున్న ఈ రాక్షసికొంపల్లో తనగది ఎక్కడ వుందో తెలుసుకోవాలి! ఇంత చెయ్యా లంటే ఈ ఆరు అంగుళాల మనుషులకి చాలా అసాధారణమైన తెలివితేటలు వుండాలి. విపరీతమయిన ధైర్యసాహ సాలు కావాలి.

"అన్నట్టు... బుయ్యాగారూ! మీకు పాలు ఎక్కడివీ?" అంది అరుణ హఠాత్తుగా కప్పలంత వుండే వాళ్ల ఆవులు అరుణకి ఎంచేతో అకస్మాత్తుగా గుర్తుకి వచ్చాయి.

మొదట మా ఆవుల పాలే తెద్దామను కున్నాం అమ్మగారూ! కాని మీకు తెలుసు గదా, మాలో చంటిపిల్లలకి వాటి పాలే ఆహారం. పైగా అన్ని పాలు ఇంత దూర ప్రయాణంలో వృధా గా ఒలికిపోతా యేమోనని అనుమానం. అన్నిటికన్నా ముఖ్యంగా మాకింకో సందేహం వచ్చింది. మా ఆవుల పాలు మీరు తాగుతారో తాగరో అని!"

"మరైతే ఈ పాలు ఎక్కడివీ?"

పొట్టిడూ, ఢింగరీ ముసిముసిగా నవ్వుకున్నారు.

"చెప్తాను...మహా వీరుడైన పొట్టిడినీ ఢింగరీని మీ వంటగదిలోకి పంపించాను. వాళ్ళు ఉరుములు వురిమే చప్పుడు చేస్తూ, గాఢంగా నిద్రపోతున్న మీ వంటమనిషినీ, ఆమె ప్రక్కనే కూర్చున్న మహా భయం కరమైన మార్జాలాన్నీ చూశారు. ఆ పిల్లి

మాకో ఏనుగులాగే కన్పించింది అమ్మ గారూ! అయినా సరే - మా వాళ్ళు ధైర్యంగా వంటగది అంతా వెదికేరు. మీరు తినే పదార్థాలు ఏవీ కన్పించలేదు వాళ్ళకి. చివరికి చప్పుడు కాకుండా ఒక పెద్ద ఖాళీ గిన్నెని వాళ్ళు మోసుకు వచ్చారు. మీ వంటగది పక్కనే మహా పర్వతాల్లాంటి ఆవులు నాలుగు కన్పిం చాయి. మా అదృష్టవశాత్తూ ఒక ఆవు నేలమీద పడుకుని వుంది. అందరం నిశ్శ బ్దంగా వెళ్ళేం. నలుగురం ఆ పెద్దగిన్నెని పట్టుకున్నాం. పొట్టిడూ, మా సైన్యాధిపతి ఢింగరీ పాలు పితికారు. ఇంతటి సాహస కార్యం మా జాతి చరిత్రలోఇదే ప్రథమం అమ్మగారూ!"

"నా కోసం ప్రాణాలకి తెగించారన్న మాట!" అంది ఆవేదనగా.

"అది మా ధర్మం అమ్మగారూ!" అన్నాడు పొట్టిడు.

"అమ్మగారూ, కిందని ఇంకా ఇరవై మంది శబర పీరులున్నారు. వాళ్ళు మీ గృహం, మీ వస్తువులూ చూడాలని కుతూహల పడ్తున్నారు. మీ సెలవైతే వాళ్ళని రమ్మంటాను" అన్నాడు సైన్యాధి పతి ఢింగరీ.

"ఓ. తప్పకుండా! వెంటనే రమ్మ నండి" అంది అరుణ.

ఢింగరీ 'ఉఉఊ' అంటూ త మా షాగా కేక వేశాడు. మరుక్షణంలో తాడు మీంచి ఎక్కి ఒక్కొక్కరే కిటికీలో ప్రత్యక్షం కాసాగేరు. అందరూ బల్లమీద సమావేశం అయ్యేరు. అంతా పద్ధతి ప్రకారం కూర్చున్నారు. రాజులూ, రాజరికాలూ పోయినా వీళ్ళింకా అప్పటి పద్ధతులు పాటించడం అరుణకి వింతగా తోచింది.

బల్లమీద మధ్యగా బుయ్యా కూర్చొని వున్నాడు. అతని కుడిపక్క పొట్టిడూ, కుర్ కుర్ జంటగా కూర్చున్నారు. బుయ్యాకి ఎడంవేపున వాళ్ళ సైన్యాధిపతి ఢింగరీ కూర్చొనివున్నాడు. మిగతా ముప్పయ్ మంది శబరులూ వాళ్ళ వెనక వరసకి పదిమంది చొప్పున, మూడు వరు సల్లో కూర్చున్నారు.

"ఘనత వహించిన అరుణ కుమారీ దేవిగారూ! ఏమైనా విశేషాలు చెప్పండి!" అన్నాడు బుయ్యా.




శ్రీనిలయం భవనానికి కుడివేపున కొద్ది దూరంలో వుంది అతిథి గృహం. అరుణా వాళ్ళ తాతగారు బ్రతికి వున్న రోజుల్లో ఆ గృహం అతిథులకి విడిదిగా ఇచ్చేవారు. ఆ గృహం ఏభై గజాల ఎత్తుంటుంది. అందులో మధ్యగా పెద్ద హాలూ, అటు రెండు గదులూ, ఇటు రెండు గదులూ వున్నాయి. ప్రధాన ద్వారానికి కుడివేపునున్న గదిలో నేల మాళిగలోకి వెళ్ళే ద్వారం వుంది. నేల మాళిగ చిన్నదేం కాదు. నలభై గజాల లోతు వుంది. నూటాఏనభై మెట్లు దిగితే నేలమాళిగ చేరుకోవచ్చు. నేలమాళిగ మధ్యగా ఖరీదైన ఎర్రని తివాసీ మీద పాతకాలంనాటి ఇరవై కుర్చీలు నలుచద

రంగా పేర్చబడి వున్నాయి. నేలమాళిగ నాలుగు గోడల దగ్గరా ఎత్తయిన బల్లల మీద ఆ కాలం నాటి ఇనప్పెట్టెలు ఏభై వున్నాయి. అన్నిటికీ తాళాలు వేసి వున్నాయి.

రెండు సుత్తులూ, రెండు టార్చ్ లైట్లూ, ఒక లాంతరూ పట్టుకొని అతిథి గృహం ఎదురుగా బెదురుతూ నిలబడ్డారు రాజేశ్వరి, కామేశ్వరరావూ. లోపలికి వెళ్ళాలంటే ఇద్దరికీ కాస్త భయంగానే వుంది. మొదట ఎవరినయినా సాయం తెచ్చుకుందామనుకున్నారు. కాని, నిధి నిక్షేపాల సంగతి తెలిస్తే వాళ్ళు వూరు కుంటారా? ఇద్దర్నీ నరికి పోగులు పెట్టి అక్కడే వదిలేసి, ఆ నిధి నిక్షేపాల్తో వాళ్ళు వుడాయించరూ? అంచేత ఎవరి సహాయమూ లేకుండానే అక్కడికి వెళ్ళా లని నిర్ణయం చేసుకున్నారు.

"ఊఁ. అడుగు ముందుకు వెయ్యండి. ఏమిటా ఆలోచన?" అంది రాజేశ్వరి మెల్లిగా.

"భయంగా వుందే!" అన్నాడు కామే శ్వరరావు.

"నేనున్నానుగా! ఎందుకూ భయం? పధ్నాలుగేళ్ళ గుంట ముండ ఒక రీ వెళ్ళింది...చెట్టంత మగాడికి మాత్రం భయం!!" అంది వెక్కిరిస్తూ.

అప్పటికీ కామేశ్వరరావులో పౌరుషం, చలనం రాలేదు. తనకి ఎదురుగా పది దెయ్యాలు భయంకరంగా వికటాట్ట హాసం చేస్తున్నట్టనిపించి ఒళ్ళు ఝల్లుమంది.

"నాటకాల్లో ఆడారి వేషాలు వెయ్యా డానికి తప్ప మీరెందుకూ పనికి రారు. ఇంత వాజమ్మ అని తెలిస్తే నేసలు పెళ్ళి చేసుకొనేదాన్నే కాదు...మా నాన్న నా గొంతు కోశాడు..." అంటూ కళ్ళొత్తు కుని, ముక్కు ఎగపీల్చింది రాజేశ్వరి.

అయినా, కామేశ్వరరావులో చలనం రాలేదు. కాని అతని మెదడు చురుగ్గా ఏదో ఆలోచిస్తోంది. నేలమాళిగలో నిధి నిక్షేపాలుంటే చేతిలోని సుత్తితో రాజేశ్వరిని అక్కడే చంపెయ్యాలి. దాన్ని అక్కడే వదిలేసి నిధి నిక్షేపాల్తో బయటికి వచ్చి ఏమీ ఎరగనట్టు వూరుకోవాలి. ఈ సంగతి ఎవరికీ తెలీదు. తెలిసినా, ఏదో దెయ్యం చంపిందనుకుంటారు...కొన్నాళ్ల ఓపిక పడితే అందాల భరిణ అరుణ తనదవుతుంది. శ్రీనిలయం, హంసద్వీపం, లక్షల ఆస్తీ తన హస్తగతం అవుతాయి. ఈస్ట్మన్ కలర్లో తనే స్వయంగా ఒక సినిమా తియ్యవచ్చు...హీరోగా ఒక వెలుగు వెలగవచ్చు...ఇలా ఆలోచనలలో కొట్టుకుపోతున్నాడు.

"సరే నేనే ముందు నడుస్తాను...నా వెనక రండి మీరు!" అంటూ రాజేశ్వరి దారి తీసింది.

తలుపు తీసి హాలు మధ్యకి వెళ్ళారు. కుడి వేపునున్న మొదటి గదిలోకి ప్రవే శించారు. అక్కడే వుంది నేలమాళిగ తలుపు. తాళం ఏం లేదు గాని గడియవేసి వుంది. గడియ తీసి, అడుగులో అడుగు వేస్తూ మెట్లమ్మట నేలమాళిగలోకి ప్రవే శించారు. అదో రకమైన పాత వాసన, గాలిలో కంపు, సాలెగూళ్ళు, బూజులు, చీకటి గుయ్యారంలా వుంది.

అయినా గుండెలు రాయి చేసుకుని లోపలికి ప్రవేశించారు. తమతో తెచ్చిన లాంతర్ని వెలిగించి ఒక బల్లమీద పెట్టేరు. నాలుగు వేపులా వున్న ఇన ప్పెట్టెల్ని చూసేసరికి కామేశ్వరరావు

మొహం చేటంత అయింది. రాజేశ్వరి కళ్లు జిగ్గుమన్నాయి. 'దెయ్యాలూ లేవు, గియ్యాలూ లేవు!' అనుకుంది.

"మొత్తం ఏభై పెట్టెలున్నాయి చూశారా? దాన్నిండా బంగారం వుండి వుంటుంది. ముందు తాళాలు పగల గొడదాం... రండి!" అంది.

ఒక తాళం కప్పమీద బలం అంతా వుపయోగించి సుత్తితో ఒక దెబ్బ వేసింది రాజేశ్వరి. ఆ శబ్దానికి నేల మాళి గంతా హోరుమంది. ఒక్కసారి ఇద్దరి గుండెలూ అవిసిపోయాయి. కొన్ని క్షణాలపాటు ఆగి చుట్టూ చూసింది. తర్వాత ఇంకా బద్దలుకాని తాళాన్ని చూసింది. ఆనక బొమ్మలా నిలబడున్న భర్తని చూసింది. "ఊఁ కానియ్యండి!" అంటూ ఇంకా వూడిరాని తాళం కప్పమీద మరో దెబ్బ వేసింది రాజేశ్వరి.

* * *

తన దుస్తుల్నీ, పుస్తకాల్నీ, రాసుకునే పెన్నూ పెన్సిళ్ళనీ అరుణ వాళ్ళకి చూపించింది. శబరులు వాటిని ఆశ్చ ర్యంగా చూశారు. 'కీ' ఇస్తే నడిచే కారులో పొట్టిడునీ, కుర్‌కుర్‌నీ కూర్చోబెట్టి తన గదంతా తిప్పింది. అలా వరసగా శబరు లందరూ తమ కారు కోరిక తీర్చుకున్నారు.

ఒక పావుగంట గడిచేక మళ్ళీ అందరూ బల్లమీద సమావేశం అయ్యారు. అరుణ జరిగిన కథంతా చెప్పింది. వాళ్ళు తనకు ఇచ్చిన నవరత్నఖచిత సువర్ణ ఖడ్గం అత్తయ్యకి దొరకడం దగ్గర్నుంచీ, శుక్రగ్రహవాసుల్తో తన సంభాషణ వరకూ పూసగుచ్చినట్టు వివరంగా తెలియజేసింది.

అంతా చెప్పి వాళ్ళవేపు దిగులుగా చూసింది.

"అందుకేనన్న మాట నన్ను గదిలో పెట్టి బైట తాళం వేసింది!" అంది అరుణ.

ఆమె మాటలు వింటూ బుయ్యా ఆలో చనలో పడ్డాడు. శుక్రగ్రహవాసులూ మాధవయ్య మాస్టరూ తమకి సాయం చేస్తామని అన్నా అతనికి ధైర్యంగా లేదు. అరుణ మాటల్ని బట్టి చూస్తే శబరజాతి భవిష్యత్తు అంతా ఆమె గుప్పిట్లో వుందన్న సంగతి అతనికి అర్థమైంది. ఈ రాత్రికి రాత్రే మరో చోటికి, అరుణకి కూడా తెలియనివ్వకుండా వలస వెళ్ళి పోదామా— అన్న ఆలోచన కూడా వచ్చింది.

అలా కొన్ని నిమిషాల పాటు ఆలో చనల్లో మునిగి, గంభీరంగా వుండిపోయా రందరూ.

"అమ్మో! అమ్మో!! ఎంత చిన్న మనుషులో! ఎంత చిన్న మనుషులో!!" అని అప్పటికి ముందే వచ్చిన రాజేశ్వరి వెర్రిగా కేకలు వేసింది.

ఆ కేకలు వినగానే అరుణ త్రుళ్ళి పడింది. దిగ్గున లేచి వెనక్కి తిరిగి చూసింది. దెయ్యాల్లా నిలబడున్న అత్త య్యనీ, మామయ్యనీ చూసింది. ఒక్క క్షణం ఏం చెయ్యాలో ఆమెకి పాలు పోలేదు. తేరుకున్న వెంటనే చప్పున శబరుల వేపు తిరిగింది. "పారిపోండి! పారిపోండి!!" అంటూ గట్టిగా అరిచింది. శబరుల్లో కంగారుగా కదలిక ప్రారంభ మయింది.

"ఏమండీ... పట్టుకోండి... పట్టు కోండి!" అంటూ పిచ్చిదానిలా అరవ సాగింది రాజేశ్వరి. ఇద్దరూ బల్ల దగ్గరికి

వెళ్లి చేతులు దాచారు. వాళ్ళకి దొరక్కుండా శబరులు చకచకా కిటికీవేపు పరుగులు పెట్టారు. తమని పట్టుకోవడానికి వచ్చిన చేతివేళ్లమీద మేకుల్నీ, గుండుసూదుల్నీ ప్రయోగించారు. అంతనొప్పీ భరిస్తూనే, అతి కష్టం మీద ముగ్గుర్ని మాత్రం ఆ భార్యాభర్తలు పట్టుకోగలిగారు.

మిగతా వాళ్లంతా పారిపోయారు!

అత్తయ్య మావయ్యల చేతుల్లో దొరికిపోయి గింజుకుంటూ వున్న బుయ్యానీ, పొట్టిడునీ, కుర్‌కుర్‌నీ జాలిగా చూసింది అరుణ.

ఆ గదిలోనే చిన్న చిలక పంజరం వుంది. చిలక చచ్చిపోయినా పంజరం మాత్రం అలాగే వుంచేశారు. ముగ్గుర్నీ అందులో పెట్టి దానికి బైట గొళ్ళెం పెట్టి, చిన్న తాళం వేశాడు కామేశ్వరరావు.

"ఇదన్న మాట సంగతి ? అందుకా మమ్మల్ని ఇన్ని తిప్పలు పెట్టేవు ?" అంది రాజేశ్వరి - తాళాలు పగలగొట్టి బొబ్బలెక్కిన తన చేతుల్ని చూసు కుంటూ.

"ఈ అరంగుళాల మనుషులేనా నీకా కత్తి ఇచ్చేరూ ?" అని అడిగింది మళ్ళీ.

జవాబివ్వలేదు అరుణ.

"నేలమాళిగలో పెట్టెలన్నీ వృథాగా వెతికాం. పాత గుడ్డముక్కలూ, కాగితాలూ, చెత్తా చెదారం తప్ప వాటిల్లో ఇంకేం లేవు. ఎందుకలా అబద్ధం చెప్పావు అరుణా?" అన్నాడు కామేశ్వరరావు.

అప్పటికీ నోరు తెరవలేదు అరుణ.

"ఇదిగో అరుణా! నీకిదే ఆఖరిసారి చెప్పడం— వీళ్లెక్కడి వాళ్లో, ఎంత మంది వున్నారో... మర్యాదగా మంచిగా చెప్పేసెయ్యి. నీకు మంచి బట్టలు కుట్టిస్తాను. నగలు చేయిస్తాను. లేకపోతే - ఇలాగే పస్తుల్తో కడుపు మాడి ఛస్తావు !" అంది రాజేశ్వరి అదే తన ఆఖరి నిర్ణయం అని తెలియజేస్తూ.

అరుణ కిమ్మన లేదు.

"మొద్దులా అలా చూస్తావేం ? నోరు లేదా? సరే- మరో రెండు రోజులు ఆకలితో మాడితేగానీ నీకుబుద్ధి రాదు!?" అంటూ భర్త వైపు తిరిగింది రాజేశ్వరి. "పదండి. మన గదిలోకిపోయి మాట్లాడు కుందాం!" అంది భర్తతో.

ముగ్గురు శబరులూ వున్న పంజరం పట్టుకొని ఆమెను అనుసరించాడు కామేశ్వరరావు.

తన గది తలుపులు మూసి గడియ పెట్టడం, దానికి తాళం వెయ్యడం స్పష్టంగా విన్నది అరుణ.

దిగాలుగా చేతుల్లో తల పెట్టుకుని మంచంమీద కూలబడింది.

ఇప్పుడేం దారి ?




పంజరంలో వున్న శబరుల్ని రాజేశ్వరీ, కామేశ్వరరావూ పరీక్షగా చూశారు. వాళ్ళు ధరించిన దుస్తుల్ని వింతగా చూశారు. బుయ్యా ఎనిమిది అంగుళాల పొడవూ, పొట్టిడు ఆరు అంగుళాల పొడవూ, కుర్‌కుర్ అయిదున్నర అంగుళాల పొడవూ వుండడం ఇద్దరూ గమ

నించారు.

"చిన్నప్పుడెప్పుడో స్కూలు ఫైనల్లో కాబోలు 'గలివర్స్ ట్రావెల్స్' అన్న పుస్తకం చదివాను. అందులో గలివర్ అనే నావికుడు లిల్లిపుట్ ద్వీపం వెళ్ళడం- అక్కడ అరంగుళాలున్న మనుషుల్ని చూడడం - అదీ చదివాను. అప్పట్లో అదంతా కల్పిత కథ అనుకున్నాను.. ఇప్పుడు వీళ్ళని చూస్తూంటే లిల్లిపుట్లు వున్నారనిపిస్తోంది..." అన్నాడు కామేశ్వరరావు.

"ఇంతకీ వీళ్ళ భాష ఏమిటో?"

"లిల్లిపుట్ భాష అంటారు దాన్ని."

"మన తెలుగు భాష రాదా?"

"ఏమో?"

"వాళ్ళు తొడుక్కున్న సూటూ, బెల్ బాటమ్‌లూ చూశారా ? మన అరుణే కుట్టించివుంటుంది... అన్నట్టు వీళ్ళ భాష మన అరుణకి తెలిసే వుంటుందండీ...!"

"ఏం లాభం ? నోటికి తాళం వేసుకు కూర్చుంది."

"ఇలాంటివాళ్ళు యింకా చాలామంది వున్నట్టున్నారండీ...మన కళ్ళతో మనం ముప్పైమందిని చూశాం...ఏమంటారు ?"

"కనీసం వందమందయినా వుంటారనిపిస్తూంది నాకు" అన్నాడు కామేశ్వరరావు.

మళ్ళీ ఇద్దరి దృష్టి పంజరంలో వున్న ముగ్గురు శబరులవేపూ మళ్ళింది. కొన్ని నిమిషాలపాటు సాలోచనగా వాళ్ళని చూశారు.

"ఏమండీ,నాకో అయిడియా వచ్చింది! అరుణ ద్వారా నయాన్నో, భయాన్నో వీళ్ళ స్థావరం తెలుసుకొని.....వీళ్ళని అమ్మితే?" అంది రాజేశ్వరి.

"బాగానే వుంటుంది."

"ఏ మాత్రం వస్తుందంటారు?"

"కుక్కల్నీ, పిల్లుల్నీ వందలు పోసి కొంటున్నారిప్పుడు. ప్రాణం వున్న ఆరు అంగుళాల మనుషులంటే ఎగిరి గంతేసి మరీ, వెయ్యేసి రూపాయలు ఇచ్చి కొంటారు."

రాజేశ్వరి మొహం సంతోషంతో ప్రసన్నం అయింది.

"ఆ లెక్కని వందమంది లిల్లిపుట్లని అమ్మితే మనకి ఖచ్చితంగా లక్ష రూపాయలు వస్తాయి...కదండీ?"అంది ఆశగా.

"వస్తాయిగాని-అరుణని మాత్రం మరీ అంత బాధపెట్టకు. ఎలాగో మెల్లిగా ఉపాయంగా ఆ రహస్యం లాగు...భోజనం పెట్టకుండా మాత్రం మాడ్చి చంపకు?" అన్నాడు కామేశ్వరరావు!

"మేనగోడలి మీద అంత ప్రేమ ఒక్కసారి పుట్టుకు వచ్చిందే పాపం ! ఏమిటి కథ?" అంది రాజేశ్వరి వెక్కిరింతగా.

"ప్రేమా కాదు దోమా కాదు. అరుణ మూలంగానే మనం బతుకున్నాం. అరుణకి వచ్చిన డబ్బుతోనే మనం అన్ని సుఖాలూ అనుభవిస్తున్నాం. ఆ సంగతి గుర్తుంచుకో...!" అంటూ లేచాడు కామేశ్వరరావు.

"ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో నాకు తెలుసులెండి. మీరేం సలహాలు చెప్పక్కర్లేదు !" అంది ఈసడింపుగా.

అలాంటి ఈసడింపులూ, వెక్కిరింపులూ కామేశ్వరరావుకి కొత్త కాదు. వాటికి బాగా అలవాటుపడిపోయి వున్నాడు.

"సరేలే. నేనోసారి విశాలపట్నం వెళ్ళి



వసాను.

మద్రాస్ నుంచి ఓ సినిమా డైరెక్టర్ వచ్చాడని చెప్పానుగా... అతనికి వీళ్ళని చూపించి, అతని అభిప్రాయం కూడా తెలుసుకుంటాను" అంటూ శబరులున్న పంజరాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

"భద్రం సుమండీ...తాళం వెయ్యడం మర్చిపోకండి. లేకపోతే తప్పించుకుపోతారు వాళ్ళు. వేలెడంత లేరుగాని ఒకో వెధవకీ బోలెడంత రోషం వుంది. వాళ్ళ చేతుల్లో సూదులో మేకులో ఏవో వున్నట్టున్నాయి....వాటితో నా చేతులమీద ఎలా గుచ్చేరో చూడండి!" అంటూ తన చేతిమీద, వేళ్ళమీద చర్మం గీసుకుపోయిన గుర్తులు అతనికి చూపించింది.

'మంచి శాస్తి జరిగింది' అని మనసు



లోనే అనుకుని, పైకి "అలాగేలేవే– జాగ్రత్తగానే వుంటాన్లే!" అంటూ ఆ గది లోంచి బయటికి నడిచాడు.

అరుగు దిగి, సైకిలు టైర్లు పరీక్ష చేశాడు. ముందు చక్రం టైరు పంచర్ అయింది. 'చచ్చాను. మూడు మైళ్ళు నడవాల్సిందే!' అనుకుంటూ పంజరాన్ని హేండిల్ బార్‌కి తగిలించాడు. నెమ్మదిగా సైకిలు నడిపించుకుంటూ విశాలపట్నం వేపు దారి తీశాడు.

అతని వెనక మూడు గజాల దూరంలో ఖబరుల సైన్యాధిపతి అయిన ఢింగరీ వురకలు వేసుకుంటూ, పరుగులు పెట్టు కుంటూ వెంబడిస్తున్న సంగతి కామేశ్వర రావుకి తెలీదు.

* * *

రాజాచారి బసలోకి అడుగుపెట్టిన కామేశ్వరరావు తలుపులు దగ్గరగా వేసి

అతనికెదురుగా కుర్చీలో కూర్చున్నాడు. మంచంమీద వెల్లకిలా పడుకుని రంగు రంగుల కలలు కంటూ ఊహా లోకాల్లో విహరిస్తున్న రాజాచారి అతన్ని చూస్తూ లేచాడు.బద్ధకంగా ఒళ్ళు విరుచుకున్నాడు.

"ఏమిటి సార్, సంగతులు?"

"సంగతులు చాలా వున్నాయి గురువు గారూ! ముందు ఈ పంజరాన్ని చూడండి" అంటూ చేతిలోని పంజరాన్ని తమిద్దరికీ మధ్యనున్న టీపాయ్‌మీద పెట్టేడు.

పంజరంలోని శబరుల్ని ఇంతింత కళ్ళు చేసుకొని చూశాడు రాజాచారి. అరంగుళాల మనుషుల్ని చూస్తూంటే అతనికి మతిపోయింది.

"బొమ్మలు చాలా బాగున్నాయి సార్! ఎవడోగాని అద్భుతంగా తయారు చేశాడు. ఎక్కడ కొన్నారూ ?" అ న డి గా డు రాజాచారి.

"భలేవారండీ గురువుగారూ! అవి బొమ్మలుగావు. ప్రాణం వున్న మను షులు."

"మరి కదలరేం?" అనడిగాడు సందే హంగా.

"మనం వాళ్ళకి రాక్షసుల్లా కన్పి స్తున్నామేమో! చంపి తినేస్తామని భయ పడుతున్నారు కాబోలు "అంటూ కామేశ్వర రావు పంజరం వేపు తిరిగాడు "ఒరేయ్ లిల్లిపుట్లూ! అటూ ఇటూ తిరగండ్రా. మా గురువుగారు చూసారూ!" అనరిచాడు.

అయినా సరే, శబరులు కదలలేదు. ఒకరితో ఒకరు మాట్లాడ కూడదని కూడా వాళ్ళలో వాళ్లు కూడబలుక్కున్నారు. ఈలోగా రాజాచారి పెట్టెలోంచి భూతద్దం తీసి వాళ్ళని పరీక్షగా చూడసాగేడు.

"నిజమే సార్. అచ్చం మనలాగే వున్నారు. కన్ను, ముక్కు తీరూ అంతా మనిషి రూపే... కాని అలా ప్రాణం లేనట్టు బిక్కచచ్చి పోవడమే ఏం బాగా లేదు" అన్నాడు.

"మీ దగ్గర దబ్బనంలాంటి దేదైనా వుందా ? ఒక్క పోటుపొడిస్తే వాళ్ళే చచ్చినట్టు కదులుతారు" అన్నాడు కామే శ్వరరావు.

ఆ మాట వినేసరికి శబరులకి భయం పట్టుకుంది. బుయ్యా తమ భాషలో వాళ్ళి ద్దరికీ ఏదో చెప్పాడు. దాంతో వాళ్లు పంజరంలో అటూ యిటూ తిరగడం ప్రారంభించారు.

అది గమనించిన రాజాచారి - "సార్, వీళ్ళకి మనభాష కొంచెం వచ్చినట్టుందండీ. మీరామాట అనగానే దెబ్బకి దెయ్యం జడిసినట్టు కదలడం ప్రారంభించారు" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇప్పటికేనా వీళ్ళు బొమ్మలు కారనీ, ప్రాణం వున్న మనుషులనీ నమ్ముతారా?" అన్నాడు కామేశ్వరరావు గర్వంగా.

"ఎందుకు నమ్మనూ? బ్రహ్మాండంగా నమ్ముతాను."

"ఇలాంటి అరంగుళాల మనుషులు ఇంకా కొన్ని వందలమంది వున్నట్టున్నారు. ఆ రహస్యం మా అరుణకి తెలుసు. ఎన్ని రకాలుగా అడిగినా నోరు తెరవటం లేదు. ఏమీ మాట్లాడదు. వీళ్ళు ముగ్గురూ మాత్రం లక్కీగా మాకు దొరికారు. ఏం చేద్దాం చెప్పండి గురువుగారూ? మీ సలహా కోసం వచ్చాను."

"సార్ ! మెదడుకి మేత వేసే పనే పెట్టారు మీరు. గొంతు చాలా సేపటి నుండీ ఎండిపోయి వుంది. ముందు ఓ మందు సీసా తెప్పించండి. విస్కీ గుర్రం

ఎక్కితేగానీ ఆలోచనలు పరుగెత్తవు" అన్నాడు రాజాచారి పళ్ళు బైట పెట్టి నవ్వుతూ.

* * *

అదీ ఇదీ మాట్లాడుతూ ఇద్దరూ సగం సీసా ఖాళీ చేశారు. అంతసేపూ దీక్షగా శబరుల్ని చూశాడు రాజాచారి. అమూల్యమైన అతని సలహాకోసం ఎదురు చూడసాగాడు కామేశ్వరరావు. విస్కీ నిషాలో మునుగుతూన్న వాళ్ళిద్దరివంకా, ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని బిక్కు బిక్కుమంటూ చూడసాగారు ముగ్గురు శబరులూ.

చాలాసేపటికి రాజాచారి నోరు తెరిచాడు.

"సార్ కామేష్‌గారూ! మన తెలుగు సినిమాల్లో మరీ ముఖ్యంగా వుండాల్సిన రెండు ఏమిటి?"

"పాటలూ... డాన్సులూ..."

"ఒళ్ళు కనిపించేలా, మత్తెక్కించే డాన్సులు వుంటే ?"

"జనం మరీ విరగబడి చూస్తారు."

రాజాచారి అతని సమాధానం విని సంతృప్తిగా తలాడించేడు. "గుడ్. ఇప్పుడు మనం అదే చేద్దాం. తొడలు కనిపించేలా నిక్కర్లూ, పరికిణీలూ, జాకెట్లూ కుట్టిద్దాం. డాన్స్ నేర్పిద్దాం. ఆ ముసలాడు మరీ పనికిమాలిన వాడిలా వున్నాడు. వాడిని వదిలేద్దాం. ఈ పిల్లకి ఆటా పాటా నేర్పించి అందరి ముందూ ఆడిద్దాం. ఆ మగాడి చేత కుప్పిగంతులూ, సర్కస్ ఫీట్లూ చేయిద్దాం... జనం తండోపతండాలుగా వచ్చి చూస్తారు. వూరూరూ తిరిగేమంటే - ఎంత లేదన్నా కనీసం లక్ష రూపాయలు సంపాదించవచ్చును. ఏమంటారు?"

"మీ ఆలోచన బ్రహ్మాండంగా వుంది. కాని వీళ్ళు మనం అనుకున్నట్టు ఆటలూ పాటలూ నేర్చుకుంటారా అని నా సందేహం"

"నేర్చుకోకపోతే మీరు చెప్పిన బ్రహ్మాస్త్రం వుందిగా! దెబ్బకి దెయ్యం కూడా జడుస్తుంది... వీళ్ళో లెక్కా? తిండీతిప్పలూ లేకుండా రెండు రోజులు మాడిస్తే సరి! వాళ్ళే దారికొస్తారు..." అన్నాడు రాజాచారి.

"మిగతా లిల్లిపుట్లు కూడా దొరికితే బాగుణ్ను గురూగారూ"

"దొరికితే మరీ మంచిది. ఒక్కొక్కర్నీ వెయ్యి రూపాయిలకి అమ్మేద్దాం. లేకపోయినా మరేం కొంప మునిగిపోలేదు. వీళ్లున్నారుగా. వీళ్ళకి రకరకాల నాట్యాలూ ద్వంద్వార్థాల పాటలూ నేర్పిద్దాం. ఒకో వూళ్ళో కనీసం లక్ష రూపాయిలేనా వసూలవుతాయి. ఓ ఇరవై లక్షలు సంపాదించేక - వీళ్ళని అమ్మి పారేద్దాం. తలమాసిన వెధవ ఎవడో ఒకడు కొనుక్కోకపోడు. ఈ ఏర్పాట్లూ, పబ్లిసిటీ... ఆ తతంగం అంతా చేసే పూచీ నాది. మీరు నిర్భయంగా వుండండి."

"అంతా మీ దయ సార్"

"ముందు ఆ బెల్ నొక్కి బోయ్‌ని పిలిపించండి. దగ్గర్లో ఎవరేనా టైలర్ వుంటే అర్జంటుగా లాక్కు రమ్మనండి!"

* * *

టైలర్ రాగానే పంజరంలో వున్న కుర్‌కుర్‌ని బయటికి తీశాడు కామేశ్వరరావు. కుర్‌కుర్ అతని చేతుల్లో గింజుకుంది. కసిగా అతని వేళ్ళని కొరికింది. దాన్ని చప్పున టేబిలు మీద పెట్టి "అమ్మా! దొంగముండ వేలు కొరికేసిం

దండీ !" అన్నాడు.

టేబిలు మీద నిలబడ్డ కుర్‌కుర్‌ని టైలర్‌కి చూపిస్తూ "పిల్ల ఎలాగుంది ?" అన్నాడు రాజాచారి.

"పంచదార చిలక లాగుందండీ..అమ్మ బాబో ఏలెడంతుంది. ఎక్కడ దొరికింది బాబూ?" అన్నాడు టైలర్.

"అదంతా మనకనవసరం గానీ, ముందు ఈ ప్రశ్నకి జవాబు చెప్పు ... నీకు సినిమాలు చూసే అలవాటుందా ?"

"అలాగంటారేటండీ ? ఏ ఆల్లోకి ఏ సినిమా వొచ్చినా మనం తొలాటకి ఎల్లాల్సిందేనండి ! మనం సూడని సినిమా లేదండి బాబూ, మీ దయవాల్ల!"

"వెరీగుడ్ 'దీపలక్ష్మి' నీకు తెలుసా"

"ఆ డేన్సులు సే సే దీపలచ్చే కదండీ ?"

"అవును"

"తెలీకేమండి బాగా తెలుసు. దీపలచ్మి డేన్సులంటే ఆ సినిమా మూడుసార్లు సూసానండి"

"మంచి పని చేస్తావు...నీలాంటివాళ్ళ మూలంగానే మా సి ని మా పరిశ్రమ దివ్యంగా వుంది. స రే గా నీ, ఈ అమ్మాయిని ఆ 'దీప లక్ష్మి'లా తయారు చెయ్యాలి. కొలతలు తీసుకో నేను చెప్పిన ప్రకారం తెల్లారేసరికి లాగులూ, పరికిణీలూ, జాకెట్లూ కుట్టెయ్యాలి !"

"కొ లతలెందుకండి ? ఓసారి ముట్టుకుని సూస్తానండి"

"అలాగే కాని జాగ్రత్త.కరవగలదు! చూడ్డానికి ఎలకలా వుందిగానీ, దానిది బ్రహ్మరాక్షసి నోరు !" అన్నాడు కామేశ్వరరావు.



టైలర్ జాగ్రత్తగా ముట్టుకుని చూశాడు. "రేపుదయానికల్లా రెడీ సేసేస్తానండి !" అంటూ కామేశ్వరరావు ఇచ్చిన ఏభై రూపాయిలూ పట్టుకు పోయాడు. యధాప్రకారం కుర్‌కుర్‌ని పంజరంలో పెట్టి తాళం వేశాడు కామేశ్వర రావు.

ఆ తర్వాత స్పృహ తప్పేవరకూ రాజాచారీ, కామేశ్వరరావూ తాగేరు... తలుపులు వెయ్యడం కూడా మరిచిపోయి ఇద్దరూ నిద్రలో మునిగారు. అలా ఓ అరగంట గడిచింది,

అల్లంతదూరంలో మంచం కింద అంతసేపూ నక్కివున్న ఢింగరీ అదే సమయం అనుకొని పని ప్రారంభించాడు. నిద్రపోతున్న కామేశ్వరరావు జేబులోని తాళం చెవి సంగ్రహించాడు. చప్పుడు కాకుండా తాళం తీసి, పంజరంలో వున్న ముగ్గుర్నీ విడుదల చేశాడు. తాళ్ళ సాయంతో నలుగురూ కిందకి దిగి, ఆ గదిలోంచి బైటపడ్డారు.




ఇంకా తెల్లవారకముందే కామేశ్వరరావు శ్రీనిలయంలోకి వచ్చి పడ్డాడు. నిద్రపోతున్న రాజేశ్వరిని లేపి 'అరంగుళాల మనుషులు' తప్పించుకుపోయిన సంగతి చెప్పాడు. అది వినేసరికి రాజేశ్వరి నిద్రమత్తు పూర్తిగా వదిలి

పోయింది. భర్తని చెడామడా తిట్టింది. చేతకాని దద్దమ్మ అంటూ వాపోయింది. అన్నింటినీ చేదు మాత్రలు మింగినట్టు మింగేడు కామేశ్వరరావు.

"అందుకే మరీమరీ చెప్పాను, జాగ్రత్త సుమండీ అని! సీసా కనిపిస్తే చాలు ఒళ్ళు తెలీదు మీకు..." అని విసుక్కుంది.

"అరుణ ద్వారా తప్ప మనకి వాళ్ళ స్థావరం దొరికే అవకాశం లేదు. ఏమైనా చెప్పిందా అరుణ?" అనడిగాడు కామేశ్వరరావు.

"ఇదుగో నిద్ర లేచి అడుగుదామను కుంటున్నాను..." అంటూ రాజేశ్వరి మంచం దిగింది. "మొహం కడుక్కుని వస్తానుండండి...ఇద్దరం కలిసి అరుణ గదిలోకి వెళ్దాం" అంది బాత్‌రూం వేపు వెళ్తూ.

కాసేపటికి ఇద్దరూ అరుణ గదిముందు నిలబడ్డారు. తాళం తీసి వాళ్ళు గదిలోకి నడిచేసరికి, మంచం మీద కూర్చున్న అరుణ లేచి నిల్చుంది.

"కూర్చో అరుణా, కూర్చో!" అన్నాడు కామేశ్వరరావు ఆప్యాయంగా. రెండు కుర్చీలను తెచ్చి అరుణ మంచానికి దగ్గరగా వేశాడు. భార్యాభర్తలిద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు. తను తెచ్చిన ఫ్లాస్కులోని హార్లిక్స్ ఓ కప్పులో పోసి "తాగు అరుణా" అంటూ ఆమెకి అందించేడు.

అది అందుకొని మారు మాటాడకుండా తాగేసింది అరుణ. అంతసేపూ అరుణని కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ చూసింది రాజేశ్వరి.

"అరుణా! నీకు తెలుసో తెలీదో గానీ, మన ఆస్తిలో సగం అప్పుల్లో తాకట్టుల్లో వుంది. ఇలా కొన్నేళ్ళు పోతే నీకు యుక్త వయస్సు వచ్చేసరికి ఒక్క పైసా ఆస్తి కూడా మిగలదు. శ్రీనిలయం, హంసద్వీపం ఇప్పుడు అమ్ముదామన్నా కొనే నాథుడు ఎవడూ లేడు. ఈ చుట్టు పక్కల ఎవరికీ అంత తాహతు లేదు. ప్రస్తుతం మనకి వున్న అప్పులన్నీ తీరి బాగుపడాలంటే కనీసం లక్ష రూపాయలు కావాలి. నిన్న రాత్రి ఇక్కడికి వచ్చిన లిల్లిపుట్లని అమ్మితే మనం బాగా డబ్బు సంపాదించవచ్చు. అప్పులన్నీ తీరిపోతాయి. వడ్డీలబెడద మరింక వుండదు. నీకు మంచి ఖరీదయిన బట్టలు కుట్టించే శక్తీ, చక్కని బంగారం నగలు చేయించే తాహతూ వస్తుంది... అంచేత మరింక అల్లరిపెట్టకుండా 'వాళ్లు' ఎక్కడ వుంటారో, ఎంత మంది వుంటారో చెప్పేసెయ్" అన్నాడు. కామేశ్వరరావు ఎక్కడ లేని అనురాగం ఒలకపోస్తూ.

"నిజంగానే నాకు తెలీదు మావయ్యా! అప్పుడప్పుడూ మన ఇంటికి వస్తూ వుంటారు. అంతే."

"రోజూ వస్తుంటారా?"

"ఉఁహూఁ. అప్పుడప్పుడు ఏ నెలకో ఓ సారి వస్తూంటారు."

"వాళ్ళెంత మంది వున్నారు?"

"ఏమో నేను లెక్క పెట్టలేదు మావయ్యా"

"వాళ్ళకి మన భాష వచ్చా?"

"ఏమో నాకు తెలీదు మావయ్యా"

అరుణ సమాధానాలు వింటూన్న కొద్దీ రాజేశ్వరికి తలతిక్క ఎక్కువ కాసాగింది.

"పోనీ వాళ్ళ మీద నీకింత ప్రేమగా వుంటే ఓ ఇద్దరు ముగ్గుర్ని నువ్వా

వుంచుకో. వాళ్ళతో ఆడుకో. నీ యిష్టం వచ్చినట్లు వాళ్ళని పెంచుకో. కావాలంటే అందుకు అయ్యే డబ్బు మేమిస్తాం. ఏమంటావు?"

అరుణ మవునంగా వుండిపోయింది.

"మీ పిచ్చిగానీ, మంచికీ మర్యాదకీ లొంగే ఘటం కాదిది. తొమ్మిదేళ్ళయి పెంచుకొస్తున్నాను. ఈవిడగారి సంగతి నాకు బాగా తెలుసు. ముద్ద పెట్టకుండా మరో మూడు రోజులు మాడిస్తే గానీ దీనికి బుద్ధిరాదు!" అంది రాజేశ్వరి.

"మీ అత్తయ్య మాటలు విన్నావా అరుణా? కావాలని కష్టాలు ఎందుకు కొని తెచ్చుకుంటావు? ఆ పిల్లిపిల్లలు ఎక్కడుంటారో చెప్పెయ్యి. నిన్ను మీ అత్తయ్య ఏమీ అనకుండా వుండేలా చూస్తాను. చెప్పేస్తే- ఆ తర్వాత రాజకుమారిలా వుందువుగానీ!" అన్నాడు కామేశ్వరరావు ఎంతో అనునయంగా.

"నిజమే మావయ్యా, నా కసలేం తెలీదు!" అని నీరసంగా జవాబు చెప్పింది అరుణ.

'మీరు నన్ను కొట్టినా, తిట్టినా, సరికి పోగులు పెట్టినా నా సమాధానం అదే!' అన్నట్లున్న అరుణ వ్యవహారం చూస్తే కామేశ్వరరావుకి కూడా కొంచెం విసుగు వచ్చింది. నిన్నటికి నిన్న- రాత్రి- రాజా దారి గదిలో పంజరంలో వున్న ఆరంగుళాల మనుషుల్ని చూస్తూ అతనెన్నో వూహలని అల్లుకున్నాడు. ఎన్ని పథకాలో వేశాడు. మొట్టమొదటి పథకమే ఇలా బెడిసి కొట్టడం అతనికి ఒంటికి కారం రాసుకున్నట్టుగా వుంది.

"ఈ నంగనాచి కబుర్లు మాని- నిజం చెప్తావా చెప్పవా?" అంది రాజేశ్వరి గొంతు చించుకొని అరుస్తూ.

"నేను నిజమే చెప్తున్నాను అత్తయ్యా"

"నీ మొహం ఈడ్చా! నువ్వు నిజం చెప్తున్నావా?" అంటూ పట్టరాని కోపంతో లేచి, అరుణని కొట్టడానికి చెయ్యెత్తింది రాజేశ్వరి.

అరుణకి దెబ్బ తగలకుండా భార్య చేతిని పట్టుకుని ఆపాడు కామేశ్వరరావు.

"ఎందుకలా తొందర పడతావు? అరుణ మంచిపిల్ల. కాసేపు ఆలోచించుకోనీ... కొడితే తిడితే ఎవరైనా సమాధానం చెప్తారా?" అంటూ కన్ను గీటి రాజేశ్వరిని ఆపాడు.

తరువాత అరుణ వేపు తిరిగి—

"అరుణా! సాయంకాలం వరకూ టైమిస్తున్నాం. బాగా ఆలోచించుకో. నేను చెప్పినవన్నీ మనస్సులో పెట్టుకో. మళ్ళీ మేం సాయంకాలం వస్తాం... 'వాళ్ళ' వివరాలన్నీ ఏదీదాచకుండా చెప్పేసెయ్!" అంటూ లేదాడు కామేశ్వరరావు. యధాప్రకారం గది బైట గొళ్ళెం పెట్టి తాళం బిగించి వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్ళగానే నీరసంగా నిట్టూర్చింది అరుణ. నిన్నరాత్రి శబరులు తెచ్చిన పాలూ,ఫలహారం తప్ప కడుపులో మరింకేం లేదు. ఏదో పాపం దయ తల్చి మావయ్య ఇన్ని హార్లిక్స్ నీళ్ళు ఇచ్చేడు. కాస్త ఆకలిగానే వున్నా అరుణని అదంతగా బాధ పెట్టడం లేదు... కాని ఆమె మస్తిష్కంలో ఎన్నో ప్రశ్నలు జోరీగల్లా రొద చేస్తున్నాయి.

నిన్న రాత్రి వీళ్ళు పంజరంలో బంధించి తీసుకెళ్ళిన ముగ్గురు శబరులూ ఏమయ్యేరు?

తన మూలంగా వాళ్ళు దొరికిపోవడం

వల్ల మిగతా శబరులకి తన మీద కోపం వచ్చిందా?

కోపంతో, అవమానంతో, భయంతో వాళ్ళు హంసద్వీపం వదిలి ఎటయినా వెళ్ళి పోయారా?

తను రెండు రోజులుగా భోజనం చెయ్యలేదన్న సంగతి పేరమ్మకి తెలుసా? తెలిసి కూడా ఏం చేస్తోంది?

భోజనం సంగతి సరే—ఈ 'విషమ పరిస్థితి'ని మాధవయ్య మాస్టారికి కబురు పెట్టాలన్నా పేరమ్మగానీ, తోటమాలి గానీ కన్పించరేం!

తను చెప్పకపోతే—బుయ్యాని, పొట్టి డునీ, కుర్‌కుర్‌నీ నా నా విధాలుగా హింసించి చిత్రవధ చేసి, వాళ్ళ స్థావః తెలుసుకుంటారేమో!

ఈ సంకట స్థితిలో తనకి సహాయం చెయ్యడానికి ఎవరొస్తారు? పోలీసులా? యూపీ, ఆర్టిమస్‌లా?

వాళ్ళకేనా సరే, పరిస్థితి ఇదని ఎలా తెలియజెయ్యడం?

ఇలా ఒకవేపు ప్రశ్నలు రొద చేస్తూ వుంటే, కడుపులో ఆకలి కరకరమంటూ వుంటే—మానసికంగా అలసిపోయి, నిద్ర లోకి జారింది అరుణ ... సాయంకాలం చిరుచీకటి పడుతూవుండే సమయానికి మళ్ళీ మెలకువ వచ్చింది. నీరసంగా నడవలేక నడుస్తూ బాత్‌రూంలోకి పోయి మొహం కడుక్కుంది. నిస్త్రాణగా మంచం మీద వెల్లకిలా వాలిపోయింది... అంతలో మళ్ళీ తలుపు చప్పుడవడం గమనించింది. తలు పులు తీసుకొని మళ్ళీ ఇద్దరు దెయ్యాలూ లోపలికి వచ్చారు. వస్తూనే—"ఏమి ఆలో చించుకున్నావు అరుణా?" అనడిగాడు కామేశ్వరరావు. అరుణని చిరచిర లాడుతూన్న మొహంతో చూడసాగింది రాజేశ్వరి.

అంతలో బైట ఏదో కలకలం విని పించింది. 'మాట్లాడ వద్దు' అన్నట్టు భర్తకి సైగ చేసింది రాజేశ్వరి.

* * *

అరుణ గది కిటికీ కింద అవతల నేల మీదశబరుల ఉపసైన్యాధిపతి బుర్రిడు వున్నాడు. వాడి ఆధ్వర్యంలో అయిదు వందల మంది శబర సైన్యం అక్కడికి వచ్చింది. ఏదో పెద్ద యుద్ధానికి తరలి వెళుతున్నట్టు సన్నద్ధమై వచ్చారు వాళ్లు. అందరి చేతుల్లోనూ చాకులూ, మేకులూ, గుండుసూదులూ, విల్లమ్ములూ, బల్లేలూ మొదలయిన ఆయుధాలున్నాయి. వాళ్ళు కిటికీ కింద నిలబడి పైకి చూస్తూ రక రకాల నినాదాలు ఇస్తున్నారు.

"రాజేశ్వరి దుర్మార్గం నశించాలి!"

"కామేశ్వరరావు కుటిలత్వం నశిం చాలి!"

"అరుణ కుమారీదేవి వర్ధిల్లాలి!"

"శబరులు మనుషులే ... బానిసలు కారు!"

"శబరులు మానవులే ... జంతువులు కారు!"

"బుయ్యాగార్నీ, పొట్టిడునీ, కుర్ కుర్‌నీ, ఢింగరీనీ వెంటనే విడుదల చెయ్యాలి!"

"లేకపోతే యుద్ధం తప్పదు!"

"విజయమో, వీరస్వర్గమో!!!"

"అరుణకుమారీ దేవికీ జయ్!!"—అని నినాదాలు చేస్తూ డప్పులూ, తప్పెట్లూ వాయించసాగేరు.

* * *

నోరు తెరిచి ఏదో అనబోతున్న అరు ణని తన బలమయిన చేతుల్తో మూసే శాడు కామేశ్వరరావు. చప్పుడు కాకుండా



అడుగులో అడుగు వేస్తూ రాజేశ్వరి కిటికీ దగ్గరికి వెళ్ళింది. తను వాళ్ళకి కనిపించకుండా, ఓరగా తొంగి చూసింది. మళ్ళీ అంత నెమ్మదిగానూ భర్త దగ్గరికి వచ్చింది.

"ఏమండీ...వందలకొద్దీ వున్నారండీ! అందరూ ఆరంగుళాల వాళ్ళే! వెధవల చేతుల్లో కత్తులూ, కటార్లూ వున్నాయి. చెరో దుప్పటి తీసుకొని వాళ్ళని అందులో మూట కట్టేద్దాం. తర్వాతఏదైనా పెట్టెలో పెట్టెయ్యవచ్చు" అంది మెల్లిగా. అలాగే నని కామేశ్వరరావు తల వూపాడు. అరుణ మంచం మీద వున్న రెండు దుప్పట్లూ తీసుకొని ఇద్దరూ కంగారుగా బైటికి పరుగెత్తారు.

ఒక్క అంగలో కిటికీ దగ్గరికి వెళ్ళింది అరుణ.

"పారిపోండి !... పారిపోండి ...! తలో దిక్కూ చెదిరి ఇంటికి వెళ్ళండి.. మిమ్మల్ని కూడా పట్టుకోడా నికి వాళ్ళొస్తున్నారు వాళ్ళ బలం ముందు మీరాగలేరు...ఊ...వేగిరం పారిపోండి!!" అని శబరుల్ని చూస్తూ సత్తువ కొద్దీ అరిచింది... మరుక్షణంలో బిల బిలమంటూపోయారు వాళ్ళు.

రాజేశ్వరీ, కామేశ్వరరావూ వెళ్ళే సరికి అక్కడ ఒక్క పురుగు కూడా లేదు ! ఆ చుట్టుపక్కల వున్న పొదల్లో డొంకల్లోఅరగంటసేపు నానా హైరానా పడ్డూవెతికారు...వాళ్ళ ప్రయత్నం అంతా నిష్ప్రయోజనం అయింది. ఈసురో మంటూ మళ్ళీ అరుణ గదిలోకి వచ్చారు.

"నీ పని యిలా వుందా? ఉండు. నీకు తగిన శాస్తి నేను చేస్తాను" అంటూ రాజే

శ్వరి అరుణ జుత్తు దొరకపుచ్చుకుంది. బరబరా ఈడుస్తూ శ్రీనిలయంకి కాస్తంత దూరంలో వున్న అతిథిగృహంలోకి లాక్కెళ్ళింది. కుడివేపునున్న గదిలోకి ఈడ్చింది. నేలమాళిగ తలుపు తెరిచి-లోపలి మెట్లమీదికి అరుణని నెట్టింది. అక్కడే వదిలేసి బైట తలుపులువేసింది. గొళ్ళెం...దానితో పాటు అడ్డగడియ



కూడా వేసింది.

"తర్వాత తాళం వేద్దాం" అంది భరతో.

"పాపం, తినడానికేమన్నా పెట్టేవా" అన్నాడు కామేశ్వరరావు.

"ఆఁ. నా శ్రాద్ధం పెట్టేను. ముందు నడవండి!" అంది రాజేశ్వరి మండిపడ్తూ.

* * *

అరుణని నెలమాళిగలో బంధించి అప్పటికి రెండు రోజులైంది. ఆ రెండు రోజులూ ఉదయం, సాయంత్రం వెళ్లి ఆమెని చిత్రవధ చేసింది రాజేశ్వరి. తిడితే పడింది. చావగొట్టినా దెబ్బలన్నీ భరించింది. ఎంత ఆకలి వేసినా సహించి అణుచుకుంది. కామేశ్వరరావు దయతల్చి యిచ్చిన లాంతరు వుండడంతో మరీ అంత భయం అన్పించలేదు. చచ్చిపోయిన తన తల్లి దండ్రుల్నీ, తాతగార్నీ తల్చుకుని వెక్కి వెక్కి ఏడ్చింది... ఆ కన్నీటితో ఆమె ఓణీ చెంగంతా తడిసి ముద్దయిపోయింది.

'శబరుల రహస్యం' చెప్పేవరకూ తనని యిలాగే హింసిస్తారు... చివరికి తన ప్రాణాలు కూడా తీసేస్తారేమో! ఒకవేళ తను చచ్చిపోయినా ఆ సంగతి ఎవరికీ తెలీదు. ఒకవేళ ఎవరికైనా అనుమానం వచ్చి వెతికినా, తనని ఏ దెయ్యమో చంపేసిందనుకుంటారు...!— అనుకుంటూ దుఃఖోద్వేగంతో కుమిలి కుమిలి ఏడవసాగింది అరుణ.

* * *

మహాభారతంలోని విరాటపర్వంలో పీకలమొయ్యా మాధవయ్య మాస్టారు మునిగివున్నాడు. కుక్కిమంచంలో పడుకుని, రెండు తలగడలు తలకింద పెట్టుకుని సుఖంగా చదువుకుంటున్నాడు. అతనికి తలదాపున మంచం అంత ఎత్తున స్టూలు వుంది. చదువుతూ మధ్యమధ్యలో మంచి నీళ్లతో గొంతు తడుపుకోసాగేడతను. అతని దృష్టి అంతా అక్షరాల మీదే వున్నా, మనస్సంతా అరుణమీదే వుంది. 'మూడు రోజులైె అమ్మాయి అరుణ ఇటు రాలేదు. ఏమైనా ప్రమాదంలో చిక్కుకోలేదు గదా, పిచ్చి పిల్ల!' అని మాటిమాటికి అనుకుంటున్నాడు.

మరో పక్కని పుస్తకంలోని అక్షరాలకి లొంగిపోతున్నాడు.

అంతలో అతని తలదగ్గరున్న స్టూలు మీద ఏదో చప్పుడైంది. కాని పుస్తకంలో మునిగిపోయి వున్న మాస్టారు అది గమనించలేదు. ఏ ఎలకో ఆ చప్పుడు చేసి వుంటుందనుకున్నాడు.

ఈ సారి సగం ఖాళీ అయిన మంచి నీళ్ల గ్లాసు టంగ్ టంగ్ మంది.

'వెధవ ఎలకలు చంపేస్తున్నాయి' అనుకుంటూ స్టూలు వేపు తిరిగేడు. స్టూలు మీద ఆరంగుళాల మనుషులు అయిదుగురు నిలబడివున్నారు. ఒక్కసారి కలా, నిజమా అనుకున్నాడాయన. కళ్లజోడు తీసి శుభ్రంగా తుడిచి మళ్లీ పెట్టుకున్నాడు. ఈసారి పరీక్షగా అటు చూశాడు. మాధవయ్య మాస్టారి దృష్టి తమమీద పడగానే – ఆ అయిదుగురూ తలలు వంచి నమస్కారం చేశారు.

ఆ అరంగుళాల మనుషులు శబరులనీ, అరుణ ఫ్రెండ్సనీ చప్పున గుర్తించాడు మాధవయ్య. పుస్తకం పక్కన పడేసి, అందర్నీ చూస్తూ రెండు చేతులూ జోడించి "నమస్కారం... నమ

స్కారం..." అన్నాడు.

తమబోటి అల్పుల్ని గౌరవిస్తోన్న మాస్టారుగారి పెద్దమనిషి తరహాకి వాళ్ల మనస్సులో అమితానందం చెందేరు. కొంచెం గర్వించారు కూడా! గౌమాంగ్, బుయ్యా, పొట్టిడూ, ఢింగరీ, బుర్రిడూ- వరసగా తమని తాము పరిచయం చేసుకున్నారు. తమతమ హోదాల్ని మాస్టారికి తెలియజేశారు.

"చాలా సంతోషం... మీరు నా పూరింటికి వచ్చి పావనం చెయ్యడం చాలా సంతోషకరంగా వుంది నాకు!" అంటూ ఆదరంగా అన్నాడు. అంతలో ఏదో జ్ఞాపకం వచ్చిన వాడిలా- "క్షమించండి...నేను కల్లు వగైరా మత్తుపదార్థాలు తాగను... మీకు సరైన ఆతిథ్యం నేను చెయ్యలేను!"

"క్షమించాలి మహాప్రభూ ... మేం అందుకు రాలేదు!" అన్నాడు గౌమాంగ్.

"సరే, ఏమిటి విశేషాలు? ఊరక రారు మహాత్ములు!" అన్నాడు.

"మహా ఘనత వహించిన శ్రీ మాధవయ్యగారికి ఒక విషాద వార్త తెచ్చినందుకు చింతిస్తున్నాం..." అన్నాడు బుయ్యా.

"విషాద వార్తా!?కొంపదీసి అరుణాదేవి ఏదైనా ప్రమాదంలో చిక్కుకోలేదు గదా?"అన్నాడు మాధవయ్య కంగారుగా. అతనికి కొంచెం చెముడు వుంది. అంచేత వాళ్ళ దగ్గరగా తల పెట్టి- "చెప్పండి త్వరగా!" అన్నాడు.

"మహా ఘనత వహించిన మాధవయ్యగారూ! మూడు రోజుల్క్రితం గదిలో బంధింపబడి వున్న అరుణకుమారీదేవికి- మేము ఫలహారం తెచ్చాం. ఆ సందర్భంలో వారి అత్తమామలైన రాజేశ్వరిగారూ, కామేశ్వరరావుగారూ - నన్నూ, పొట్టిడినీ, వాడి భార్యఅయిన కుర్‌కుర్‌నీ బలవంతాన బంధించారు. మా రహస్య స్థావరంగురించి చెప్పమని అరుణమ్మగార్ని ఒత్తిడి చేశారు. భోజనం పెట్టకుండా పస్తులుంచి హింసిస్తున్నారు. వంటమనిషి పేరమ్మకు వారం రోజులు సెలవిచ్చి ఎక్కడికో పంపేశారు. అయినా, మామీద అరుణమ్మగారికిగల అపారమైన గౌరవాభిమానాలవల్ల-అన్ని చిత్రవధలనూ భరిస్తూ కూడా ఏమీ చెప్పలేదు..." అంటూ ఆగేడు బుయ్యా.

"అయితే మీరెలా తప్పించుకున్నారు?"

"మా సైన్యాధిపతి ఢింగరీ చాకచక్యం, సాహసం ప్రదర్శించి మమ్మల్ని వాళ్ళ చెరనుండి తప్పించాడు. ఆ విశాలపట్నం నుండి దారి వెతుక్కుంటూ ఇక్కడికి రావడానికి మాకు ఒక చంద్రకాలం, ఒక సూర్యకాలం పట్టేయి అయ్యగారూ... ఈ లోగా మా ఉప సైన్యాధిపతి 'శ్రీనిలయం'లోనే వుండి గూఢచారిలా ప్రవర్తించి అసలు రహస్యం తెలుసుకున్నాడు..."

"వెరీగుడ్. వెల్‌డన్! ఏమిటా అసలు రహస్యం?"

"రాక్షస స్వరూపిణి అయిన రాజేశ్వరిగారు మన అరుణమ్మ జుత్తు పట్టుకుని అమానుషంగా ఈడుస్తూ-ఒక పాడుపడిన భవంతిలో బంధించారు. మేము ఐదుగురం ఆమె బంధింపబడి వున్న గదిలోకి వెళ్ళేందుకు ప్రయత్నం చేశాముగాని, అది మా శక్తికి మించినపని అని తేలిపోయింది. మా ద్వీపవాసులం చిన్నా, పెద్దా అందరం కలిసి వచ్చినా ఆ తలుపు

తియ్యడం మాకు అసాధ్యం!"

"అంటే తలుపుకి తాళం బిగించారా?"

"తాళం లేదు అయ్యగారూ! అదేదో పెద్ద దూలం ఆ తలుపుకి అడ్డంగా వేశారు. ఆ దూలం నేలకి నూటా ఎనుబది అంగుళాల ఎత్తున వుంది. మాతోపాటు కొన్ని నిచ్చెనలు తెచ్చాం. దురదృష్టవశాత్తూ మా నిచ్చెనలన్నీ పన్నెండు అంగుళాలవే! ఒకవేళ తాళ్ళ సహాయంతో అంత ఎత్తుకి ఎక్కగలిగినా – ఆ దూలం తియ్యడం మా శక్తికి మించిన కార్యం!!"

"దూలమా? అంటే అడ్డు గడియ వేశారన్నమాట! అది తియ్యడం ఎంత సేపు? పదండి వెళ్దాం" అంటూ మంచంలో లేచి కూర్చున్నాడు.

"అందుకే మీ దగ్గరకు వచ్చాం అయ్యగారూ! అన్నట్టు–ఇంకొక విషయం. అరుణమ్మకి పాపం, రెండు రోజులయి భోజనం లేదు. మీ దగ్గర ఏమైనా భోజన పదార్థాలుంటే తీసుకువెళ్దాం!" అన్నాడు గౌరాంగ్.

మాధవయ్య మంచం దిగి, చిన్న టిఫిన్ కారియర్‌లో మజ్జిగా, అన్నం కలిపి పెట్టాడు. అదీ, ఏవో పళ్ళూ, రొట్టె సంచీలో పెట్టాడు. "పదండి వెళ్దాం!" అని ఆగిపోయాడు. రెండు ఫర్లాంగుల దూరం తనంటే నడవగలడుకానీ వీళ్ళు ఉరకలూ, పరుగులూ వేసుకుంటూ రావడం కష్టం కదూ? మూతలేని పెద్ద డబ్బాలో వాళ్ళందర్నీ నిలబెట్టేడు. ఒక చేత్తో సంచీ, ఇంకో చేత్తో శబరులున్న డబ్బా పట్టుకుని నిలబడ్డాడు. "ఇంతకీ అరుణని వాళ్ళెక్కడ బంధించారు?" అనడిగాడు...

"శ్రీనిలయంకి కుడివేపున చాలా దూరంలో ఒక శిథిల భవనం వుందయ్యగారూ, అక్కడే బంధించారు?" అన్నాడు ఉపసైన్యాధిపతి బుర్రిడు. "నేలమాళిగలో బంధించారన్న మాట, దుర్మార్గులు!" అన్నాడు మాధవయ్య కోపంతో బోసి నోటి దవడలు ఆడిస్తూ.

* * *

మరో పావుగంటకి మాధవయ్యా, శబరులూ అతిథి గృహం చేరుకున్నారు. నేలమాళిగ తలుపుకి వున్న అడ్డుగడియని మాధవయ్య తీశాడు. మీదనుంచే లోపలికి చూశాడు. కిందని లాంతరు వెదజల్లుతూన్న గుడ్డి వెలుగు కన్పించింది. తలుపులు దగ్గరగా వేసి మెల్లిగా మెట్లు దిగాడు. ఆఖరి మెట్టు దిగేసరికి ఎదురుగా వున్న దృశ్యం చూసి మాధవయ్య స్తంభించిపోయాడు. గబగబా సంచీ కింద పెట్టి, డబ్బాలో వున్న శబర పెద్దల్ని బయటికి తీశాడు. వాళ్ళు కూడా ఎదురుగా వున్న దృశ్యం చూసి స్తంభించిపోయారు. అందరూ కొన్ని క్షణాలపాటు అవాక్కయి నిలబడిపోయారు.

అరుణని ఓ స్తంభానికి విరిచి కట్టేశారు. కాళ్ళూ చేతులూ తాళ్ళతో బంధించారు. ఆమె ధరించిన వస్త్రాలన్నీ చిందరవందరగా వున్నాయి. జుత్తు రేగిపోయి వుంది. మొహం మీద, కొట్టినట్టున్నారు వాళ్ళు, నల్లగా మచ్చలున్నాయి.

మరోక్షణం వృథా చెయ్యకుండా మాధవయ్య మాస్టారు తొందరగా వెళ్ళి ఆమె కట్లన్నీ విప్పాడు...బంధనాలు పోగానే అరుణ నిస్సత్తువగా అతనిమీదికి ఒరిగిపోయింది. మాధవయ్య తివాసీ మీద కూర్చొని అరుణ తలని తన ఒళ్ళో పెట్టుకున్నాడు. శబరులు చిన్న చిన్న పాత్రల్తో ఆమె ముఖం మీద నీళ్ళు

జల్లేసు......కాసేపటికి కళ్లు తెరిచింది అరుణ.

మాధవయ్య మాస్టార్నీ, శబరుల్నీ చూసి, అంత నీరసంలోనీ ఆనందంతో ఎంతో పొంగిపోయింది...ఏదో మాట్లాడదామని ఆమె నోరు తెరవబోగా వారించాడు మాధవయ్య.

"ముందు ఈ మజ్జిగా అన్నం తిను. నీ కోసం అరటిపళ్ళు కూడా తెచ్చేను. భోజనం లేకుండా పాపం, ఎన్నాళ్ళనుంచీ ఇలా వున్నావో!" అన్నాడు.

మౌనంగా భోంచేసింది అరుణ.

నిస్సత్తువగా వున్నా జరిగిన కథంతా ఆయనకి చెప్పింది అరుణ. తమకోసం ఇన్ని పాట్లూ, ఇన్ని హింసలూ అనుభవిస్తూన్న అరుణని చూసి శబరుల హృదయం ద్రవించిపోయింది.

అంతలో నేలమాళిగ మీద ఎవరివో అడుగుల చప్పుడు విన్పించింది. టార్చిలైట్ల కాంతి వాళ్ళమీద పడింది.

"అత్తయ్యా...మావయ్యా..." అంది అరుణ గాభరాగా. మాధవయ్య కంగారుగా లేచి నిల్చున్నాడు.

శబరులు చీకటి నీడల్లోకి జారుకున్నారు.

"ఓహో శిష్యురాలికోసం గురువుగారు కూడా వచ్చారన్నమాట! మరీ మంచిది! ఇదుగో మాధవయ్యా! ఆ లిల్లిపుట్లు ఎక్కడుంటారో అరుణని బుజ్జగించి కనుక్కో. నీకూ ఏదో కాస్త ముట్ట చెప్తాంలే! లేకపోతే మీ ఇద్దరికీ ఇదే గతి! మళ్ళీ రెండు రోజులు పోయాక వస్తాం. ఈలోగా ఆలోచించుకోండి!!" అన్నాడు కామేశ్వరరావు.

"మొన్న తాళం వెయ్యడం మర్చిపోయాం. ఇవాళ తాళం వేసి మరీ వెళ్తున్నాం...జాగ్రత్త!" అని వురిమింది రాజేశ్వరి.

* * *

మూతపడిన తలుపుల బలం పరీక్షించి, అవి బద్దలు కొట్టడం రాక్షసులకి తప్ప మానవమాత్రులకి సాధ్యం కాదని తెలుసుకున్నాడు మాధవయ్య. మెట్లన్నీ దిగివచ్చి ఉస్సురంటూ కూలబడ్డాడు.

"నా మూలంగా మీరందరూ అనవసరంగా చిక్కుల్లో ఇరుక్కున్నారు...తిండీ తిప్పలూ లేకుండా మనల్ని మాడ్చి చంపడానికి కూడా వాళ్ళు తెగించారు. ఇప్పుడేం చెయ్యడం?" అన్నది అరుణ మాధవయ్యని చూస్తూ.

ఆయన మాట్లాడలేదు. ఎటో చూస్తూ ఆలోచనలో పడ్డాడు.

"మహాఘనత వహించిన అరుణ కుమారీ దేవిగారూ, మీరేమీ బాధ పడకండి. మా కోసం మీరిన్ని కష్టాలు పడుతున్నారు. మాకళ్ళతో మేము స్వయంగా చూస్తూనే వున్నాము. మిమ్మల్ని రక్షించడానికి మాశబరజాతి యావత్తూ ప్రాణాలు ధారపోస్తాం!" అన్నాడు బుయ్యా ఆవేశంగా.

"అవును. మీ కోసం మా ప్రాణాలు ధారపోస్తాం!" అంటూ గొమాంగ్, పొట్టిడూ, ఢింగరీ, బుర్రిడూ ముక్త కంఠంతో ఘోషించారు.

"నా మీద మీకు గల అభిమానానికి చాలా థాంక్స్. కాని, ఈ విపత్తునుంచి తప్పించుకోవడం ఎలా ? నేలమాళిగ తలుపు నాలుగు అంగుళాల మందం వుంటుంది. బైట చాలా పెద్ద తాళం కప్పే బిగించి వుంటారు వాళ్లు. ఇక్కడి నుంచి మనం బైట పడాలంటే తలుపులు బద్దలు గొట్టడం తప్ప వేరే దారి లేదు.

అది కూడా మనకి సాధ్యం కాదు. అందుకు కావల్సిన పనిముట్లేవీ మన దగ్గర లేవు!" అంది అరుణ నిరాశగా.

"నాలాంటివాళ్లు పదిమంది వచ్చినా ఆ తలుపులు బద్దలుకొట్టటం అసాధ్యం!" అన్నాడు మాధవయ్య.

మరికాసేపు అందరూ ఆలోచనల్లో పడ్డారు... రెండు నిమిషాలు పోయాక అరుణ తలెత్తి బుయ్యాని చూసింది ...

"అదంతా ఎందుకుగానీ, బుయ్యాగారూ! నేను చెప్పినట్టు చెయ్యండి. శుక్రగ్రహవాసి ఆర్టిమస్ మనకి సహాయం చేస్తానని ఇదివరలో మాట యిచ్చారు. ఇంతవరకూ ఆయనగారి సహాయం కోరే అవసరం, అవకాశం రాలేదు. ఇప్పుడు వచ్చింది గనక వారి తోడ్పాటు కోరుదాం..."

"ఆయన సాయం చేస్తారా అని...?" అన్నాడు బుయ్యా.

"ఆ సందేహం ఏమీ అక్కర్లేదు. తప్పక సహాయం చేస్తారు!"

"మీకా నమ్మకం వుంటే సరే! మమ్మల్నేం చెయ్యమన్నారో చెప్పండి?"

"చిలక సరస్సు దాటి వెళ్ళండి. హంసద్వీపంలో మీరు వుండే స్థావరానికి ఈశాన్య దిక్కుగా ఫర్లాంగు దూరంలో నాలుగు పెద్ద స్తంభాలు వుంటాయి. దాని మీద బ్రహ్మాండమైన గోళం వుంటుంది... మీరు తిన్నగా వెళ్ళి రోదసీ నౌక స్తంభాన్ని ముట్టుకోండి...చాలు! మరు క్షణంలో యూపీ గానీ, ఆర్టిమస్ గానీ వస్తారు. వాళ్ళకిసంగతంతా చెప్పండి చాలు! అంతే-మన పని అయిపోతుంది."

"సరేనమ్మగారూ!" అంటూ అయిదు గుర్రూ లేచారు.

"ఒక చిన్నమాట... వాళ్లు పదిగజాల మనుషులు... మీకన్నా మూడు పందల అరవై రెట్లు పొడవు వుంటారు. వాళ్ళని చూసి ఏం భయపడకండి! మీరంటే వాళ్ళకి చాలా ముద్దు" అంది అరుణ.

నిచ్చెనల సాయంతో మెట్లు ఎక్కుతూ నేలమాళిగ తలుపుని చేరుకోవడం ప్రారంభించారు శబరులు.

* * *

హంసద్వీపం చేరుకున్న శబరులు పరుగులు పెట్టుకుంటూ రోదసీ నౌకవేపు పురకలు వేశారు. నేల మీద వెల్లకిలా పడుకుంటే గానీ వాళ్ళకి రోదసీనౌక తాలూకు గోళం కన్పించలేదు. అయిదు గురూ ఒక్కసారే రోదసీనౌక స్తంభాల మీద చేతులు వేశారు.

వెంటనే గోళం తలుపు తెరుచుకుంది. ఆర్టిమస్ కిందికి తొంగిచూశాడు, 'ఇంత రాత్రప్పుడు అరుణ ఎందుకు వచ్చింది చెప్మా!' అనుకుంటూ...... కాని కింద ఎవరూ కన్పించలేదు. అలాగే చాలా సేపు ద్వారంలో నిల్చున్నాడు. అంతలో కిందని ఏదో దీపం వెలిగి వలయాకారంలో తిరగడం గమనించాడు... 'అలా చేస్తే గాని ఆయన దృష్టికి అందం అని' పొట్టిడి వూహ. అది ఫలించింది. ఆర్టిమస్ నిచ్చెన మీంచి కిందికి దిగడం ప్రారంభించాడు.

అతని కాళ్ళ కింద పొరపాటున పడి ఎక్కడ పిప్పి అయిపోతామోనన్న భయంతో దూరంగా జరిగారు శబరులు. నేలమీదికి దిగిన ఆర్టిమస్ సూక్ష్మ దృష్టికి శబరులు కన్పించారు. కానీ, వాళ్ళు వేస్తున్న కేకలు ఏం విన్పించలేదు. ఏం చెయ్యడమా - అని క్షణం ఆలోచించి, జాగ్రత్తగా నేలమీద వెల్లకిలా పడుకున్నాడు. శబరులకి తన చెవి చూపించి

దగ్గరగా రమ్మన్నాడు...... వాళ్ళు అయిదుగురూ అంతపెద్ద చెవిని చూసి ఆశ్చర్యపోతూనే ముందుకి నడిచారు.

"మహోఘనత వహించిన ఆర్టిమస్ గారికి, శబరజాతి తరఫున మా అభివాదాలు. అరుణకుమారీ దేవి చాలా ప్రమాదంలో, చావుబతుకుల్లో వుంది. ఆమె అత్తమామలు—అరుణనీ, మాధవయ్యగార్నీ ఒక బ్రహ్మాండమైన నేల కింద వున్న గదిలో బంధించి తాళం వేశారు. మీ సహాయం కోసం వచ్చాం. అరుణమ్మను మీరే రక్షించాలి!" అన్నాడు బుయ్యా.

"ఎక్కడుంది ఆ గది?" అన్నాడు ఆర్టిమస్ మెల్లిగా.

"శ్రీనిలయం కుడివేపున"

"నేను అందులో దూరగలనా ?"

రెండు నిమిషాల సేపు ఆలోచించిన మీదట 'ఓ' అన్నారు వాళ్ళు.

"అయితే పదండి !" అని వాళ్ళని కోటు జేబులో పెట్టుకోబోయి ఆగిపోయాడు. లోపల వూపిరి తిరక్కఛస్తారేమో! తన చేతుల్ని దోసిలిలా పట్టి అందులో వాళ్ళని కూర్చోబెట్టాడు. తన శరీరంలో ఛాతి మీదవున్న ఏదో మీటని నొక్కాడు. అంతే ఆర్టిమస్‌తో సహా శబరులందరూ ఆకాశంలోకి తేలిపోసాగేరు. కిందకి చూస్తే కళ్ళు తిరుగుతాయేమోనని వాళ్ళు కళ్ళు మూసుకున్నారు. చిలక సరస్సు దాటి, అతిథి గృహం ముందు ఆగేరు. ముందు శబరులు దారి చూపించగా, వెనక ఆర్టిమస్ నడిచాడు.

* * *

రెండు నెలలు గడిచాయి.

ఇప్పుడు అరుణకి మాధవయ్యా మాస్టారూ, వంటమనిషి పేరమ్మా గార్డియన్లు.

కారులో హైస్కూలుకి వెళ్ళిచదువుకుంటోంది...ఈ భూలోకం మీద వుండడానికి తగరని – రాజేశ్వరినీ, కామేశ్వరరావునీ, రాజాచారినీ తమతోబాటు శుక్రగ్రహం తీసుకుపోయాడు ఆర్టిమస్ ...

బుద్ధి వచ్చే వరకూ అక్కడే వుంచి ఆ తర్వాత భూలోకానికి పంపిస్తామన్నారు ... భూలోకం మీద వుంటే ఎప్పటికయినా ముప్పు తప్పదని శబరులకి చంద్రలోకంలో చిన్న కాలనీ కట్టించి యిచ్చాడు ఆర్టిమస్. వందమంది ఒకేసారి పట్టే రాకెట్ కూడా వాళ్ళకి ఇచ్చాడు... వాళ్ళకి అరుణని చూడాలని అనిపించినప్పుడల్లా రాకెట్ మీద 'శ్రీనిలయం' వస్తూ వుంటారు. సెలవుల్లో శుక్రగ్రహం, చంద్రలోకం చూసి వస్తూ వుంటుంది అరుణ.

అరుణకిప్పుడు పధ్నాలుగు నిండి పదిహేనేళ్ళొచ్చేయి. ప్రస్తుతానికి తన కష్టాల కథ ముగిసినా—పరిస్థితులు చక్కబడినా, అరుణకి ఏ మాత్రం గర్వం, అతిశయం లేవు.

కానీ—

వీధివీధికి ఒక నరరూప రాక్షసుడు వుండే ఈ మానవ లోకంలో తనకి మున్ముందు ఏ కష్టాలు రానున్నాయో అని, ఆమె ఎప్పటికప్పుడు తనను తాను హెచ్చరించుకుంటూనే వుంటుంది...

—అదీ కథ!



# బీటు

దొరపురంలో దొంగతనాలెక్కువగా జరుగుతున్నాయి. వాటిని అరికట్టేందుకు తీవ్రంగా కృషి చేస్తోంది పోలీసు శాఖ. గుండెలు తీసిన బంటుగా పేరు పొందిన ఇన్‌స్పెక్టర్ వైకుంఠరావుని ఆ ఊళ్ళోకి బదిలీ చేసి, దొంగలను పట్టుకునేందుకు తగిన సౌకర్యాలు కల్పించింది.

ఆ పోలీసు స్టేషన్‌లో కానిస్టేబుల్ కనకాంబరంకి మంచి పేరుంది. తనపై అధికారుల ఆజ్ఞల్ని పొల్లుపోకుండా క్షణాల మీద అమలు జరుపుతాడని గుర్తించి ఈ మధ్యే కనకాంబరంకి ఇంక్రిమెంటు కూడా ఇచ్చారు.

ఓ రోజు రాత్రి ఇన్‌స్పెక్టర్ వైకుంఠరావు తనతో పాటు నమ్మకస్తుడైన కనకాంబరంను వెంటబెట్టుకుని ఊళ్ళోకి బయలుదేరాడు. ఓ పెద్దమనిషి మీద అనుమానం కలిగి అతన్ని వెంబడిస్తూ చాలా దూరం వెళ్ళారు ఇద్దరూ.

ఆ పెద్దమనిషి ఓ ఇంట్లో దూరాడు. దూరంనుంచి ఇదంతా గమనించిన ఇన్‌స్పెక్టర్, కనకాంబరానికి దూరంగా వీధిలో కనిపిస్తున్న లైటుని చూపించి "అదిగో! ఆ లైటుదగ్గర నువ్వు బీటు వెయ్యి. తిరిగిరాగానే నాకు రిపోర్టు ఇవ్వు" అని చెప్పి వెనుదిరిగి వెళ్ళిపోయాడు. కనకాంబరం లైటువైపు పరుగుతీశాడు.

నెల రోజులు గడిచాయి. నీరసంగా సోలిపోతూ, మొహం వేళ్ళాడేసుకొచ్చాడు కనకాంబరం. ఇన్‌స్పెక్టర్ వైకుంఠరావు అతన్ని చూసి మండిపడ్డాడు. 'బాధ్యత లేనివాడివి' అని చివాట్లేశాడు.

"వెంటనే వచ్చి రిపోర్టు ఇవ్వమంటే నెల్లాళ్ళపాటు అడ్రసు లేకుండా ఎక్కడికి పోయావయ్యా...ఏమైనా అవసరమైన పనివుంటే చెప్పి పోకూడదూ!" అని అరిచాడు ఇన్‌స్పెక్టర్.

కానిస్టేబుల్ కనకాంబరం తెల్లమొహం



వేసి "అదేమిటి సార్! ఈ నెల్లాళ్ళూ నేను క్షణం కూడా రెస్టు లేకుండా డ్యూటీలోనే వున్నాను. ఆ రోజు మీరు నాకు చూపించిన లైటు ఒక కారుది. దాన్ని వెంబడిస్తూ బెంగుళూరుదాకా వెళ్ళి దానితో పాటు ఈవేళే తిరిగి వచ్చాను. అదిప్పుడు ఇక్కడే ఉంది" అన్నాడు కనకాంబరం కళ్ళు తేలవేస్తూ.

—శర్మిల

# పొగడ్త

ప్రతి సినిమాకీ విడుదలైన రోజే వెళ్ళే సీతాపతికి శోభ పరిచయమైంది.

శోభ పెళ్ళి కాని పిల్ల, అందమైన చిన్నది. ఆమె ఎదురుగా వుంటే ఏం మాట్లాడాలో తెలీటం లేదు సీతాపతికి. ఆడపిల్లల్తో ఆకర్షణీయంగా మాట్లాడి, వారితో కలిసి షికార్లు కొట్టడంలో మాంచి అనుభవం సంపాదించిన సుంద్రావు దగ్గరికి సలహాకోసం పరుగెత్తాడు.

సుంద్రావు సీతాపతి చెప్పిందంతా విని ఫకాల్న నవ్వాడు.

"ఒరే అమాయికప్పక్షీ! ఆడపిల్లల్ని ఆకర్షించుకుని మనచుట్టూ తిరిగేట్టు చేసే వశీకరణ మంత్రం పొగడ్త. ఎలాంటి ఆడదైనా సరే పొగడ్తకి ఇట్టే బోల్తా పడుతుంది. ఉబ్బి తబ్బిబ్బయి పోతుంది. ఓసారేమయిందో తెలుసా? కోమలి అనే చిలక పరిచయమైంది బస్‌లో ప్రయాణం చేస్తూండగా. పక్క పక్క సీట్లలో కూర్చుని మాట్లాడుకుంటూండగా ఏదో చిన్న పురుగు ఆమె కళ్ళలో పడేసరికి ఆమె కంగారుపడింది. వెంటనే నేను కల్పించుకుని "కోమలీ! విశాలమైన నీ నేత్రాల నుండి తప్పించుకుని ఆ పురుగు ఎక్కడికి పోతుంది. నీవేం బాధ పడకు" అంటూ మెల్లగా ఆ పురుగుని తీసి పారేశాను. అంతే! నా పొగడ్తకి ఆమె మనసు మంచులా కరిగిపోయింది. ఇహ అప్పట్నుంచి నన్ను వదిలితే ఒట్టు!" అని హితబోధ చేశాడు సుంద్రావు.

"మహా ప్రసాదం గురో...వస్తా!" అంటూ పరుగు తీశాడు సీతాపతి.

అలా సంతోషంగా వెళ్ళిన సీతాపతి రెండో రోజు చెంపలు వాచిపోయి, కుంటుతూ వచ్చాడు దిగులుగా.

"ఏమిటోయ్ పతీ! నీ 'లా' సక్సెస్ అయిందా?" ఆతృతగా అడిగాడు సుంద్రావు.

"చాల్లేవోయ్ వెధవ కబుర్లూ... నీవూనూ! నీ మాటలు వింటే 'బడితె పూజ' తప్పదని అనుభవం మీద తెల్సు



కున్నాను. అమ్మో...చెంప నొప్పి..." అంటూ కూలబడ్డాడు సీతాపతి.

"ఇంతకీ ఏమైందోయ్?" సుంద్రావు కంగారుగా అడిగాడు.

"నీవు నిన్న చెప్పిన చిట్కా విని నా శోభ దగ్గరికి పరుగెత్తాను. నాఅదృష్టమో, దురదృష్టమోగానీ అప్పుడే నా కళ్ళెదుటే ఆమె నోట్లో దోమ దూరింది.... నేను తక్షణం నీ పాఠం గుర్తుకు తెచ్చుకుని... ఏం చేశానంటే......"

—కొండూరి కమల కుమారి

# రైలుబండి

మధ్య తరగతి మాధవరావు అద్దెకుండే ఇల్లు-ఒకే ఒకగది. ఆ గదిలో ఒకేఒక మంచం. అతనికి ఇద్దరు పిల్లలు-కవలలు-చిట్టిబాబు,చిన్ని తండ్రి. పిల్లలిద్దరూ ఎనిమిదేళ్ళ వాళ్ళయారు. పైగా గడుగ్గాయిలు. ఇంకా ముప్ఫైఐదేళ్ళయినారాని మాధవరావుకి ఒకేఒక గదిలో ఇబ్బందిగానే ఉంది. పగలంతా ఎన్ని చిరాకులున్నా కాస్త సద్దుమణిగాక భార్య వరలక్ష్మితో సరదాగా గడిపితే అవన్నీ మర్చిపోగలడు. కానీ ఈ మధ్య ఆ అవకాశం పూర్తిగా నశించిపోయింది.

అద్దెలు మండిపోతున్న నగరంలోరెండు గదుల ఇంట్లో ఉండగల స్తోమత తనకు లేదు. మరి పిల్లలా పెద్ద వాళ్ళయ్యారు. గత కొద్ది కాలంగా వరలక్ష్మి ముఖంలో కూడా ఈ తాలూకు అసంతృప్తి కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది.

ఒకరోజు ఆఫీసు నుంచీ వస్తూ ఓ స్టంటు సినిమాకు నేల టిక్కెట్లు రెండు కొని ఇంటికివచ్చి పిల్లలిద్దరికీ ఇచ్చి సినిమాకి వెళ్ళమన్నాడు. ఎప్పుడూ లేంది ఇదేమిట్రా అని ఓ క్షణం ఆశ్చర్యపోయినా, మహా హుషారుగా ఇద్దరూ సినిమాకి వెళ్ళి పోయారు. పది గంటల వరకూ భార్యతో ఆనందంగా గడపవచ్చు అనుకున్న మాధవరావు ప్లానుకి వరలక్ష్మి సిగ్గుల మొగ్గయిపోయి తక్షణం భర్త కౌగిట్లో ఒదిగి పోయింది.

చాలా కాలం తర్వాత మాధవరావు, వరలక్ష్మి ఆరోజు తనివితీరా ఆనందించారు. ఓ రెండు రూపాయలు ఖర్చయినా ఈ పద్ధతే బాగుందని, మాధవరావు మర్నాడు కూడా ఆఫీసు నుంచీ వస్తూ జంతువుల పోరాటాలున్న మరో సినిమా టిక్కెట్లు తీసుకుని ఇంటికి రాగానే పిల్లలిద్దరికీ ఇచ్చి తరిమేశాడు. ఎన్నడూ లేంది నాన్న ఇలా చెయ్యడంలో ఏదో తిరకాసు ఉందని అనుమాన మొచ్చి, చిట్టిబాబు, చిన్నితండ్రి బయటి కెళ్ళినట్టే వెళ్ళి అదను చూసి ఇంట్లోకి దూరి మంచం కింద దాక్కున్నారు. మాధవ




రావు హుషారుగా భార్య బుగ్గమీద చిటికేసి "ఏమోయ్ భార్యామణీ! ఇప్పుడు మనం రైలుబండి ఆట ఆడదాం. నువ్వా ఆ గోడ దగ్గరకెళ్ళు. నేను ఈ గోడ దగ్గరుంటాను. నేను విజిల్ వేయగానే ఇద్దరంఎదురెదురుగా రావాలి. తెల్సిందా?" అన్నాడు. వరలక్ష్మి తలూపింది. మాధవరావు విజిల్‌వేసి "ఛుక్, ఛుక్, ఛుక్" అంటూ మెల్లి మెల్లిగా ముందుకు వెళ్తున్నాడు. వరలక్ష్మి కూడా అలానే రైలుబండిలా "ఛుక్ ఛుక్" అంటూ ముందు ముందుకు రాసాగింది. ఇద్దరూ బాగా చేరు

వయ్యారు. అప్పుడు మాధవరావు "ఇప్పుడు మాధవరావు ఎక్స్‌ప్రెస్‌కీ, వరలక్ష్మి ఎక్స్‌ప్రెస్‌కీ జంక్షన్" అని వరలక్ష్మిని తటాలున వాటేసుకోబోయాడు. అంతలోనే పిల్లలిద్దరూ మంచం కింద నుంచీ హటాత్తుగా ఊడిపడి "స్టాప్!" అని పెద్దగా అరిచారు.

అనుకోని పరిణామానికి మత్తులోవున్న మాధవరావు ఉలిక్కిపడి "ఓరి...మీ రెక్కడ్నుంచీ వచ్చార్రా!" అనడిగాడు కంగారుగా. "ఈ బండిలోనే దిగామండీ" అన్నారు చిట్టిబాబు, చిన్నితండ్రి.

—అకాష్




పట్టు వదలని విక్రమార్కుడు ఎప్పటి లాగే శవాన్ని భుజం మీద వేసుకొని మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు.

అప్పుడు శవంలోని భేతాళుడు "రాజా! ప్రతీసారి నేను కథ చెప్పడం నువ్వు చిక్కు విప్పటం ఈ వరస క్రమం వల్ల విసుగెత్తి పోయింది. ఈసారి నేను ఒక శ్లోకం చెబుతాను. దాన్ని వివరిస్తూ నువ్వో కథ అల్లి చెప్పు. చెప్పకపోయావో నీ తల వెయ్యి వ్రక్కలవుతుంది తెల్సుగా" అన్నాడు.

విక్రమార్కుడు "సరే" ననగానే భేతాళుడు ఓ శ్లోకం చెప్పాడు.

"శుక-పిక-బకస్య
హనుమ-కర్ణ-కుంభకర్ణాః"

విక్రమార్కుడు ఓ నిమిషం ఆలోచించి కథ చెప్పసాగాడు. "దేవదాసు బార్‌కి వెళ్ళి మందు ముందు కూచ్చున్నాడు. మొదటి పెగ్గు కొట్టగానే 'శుక' అంటే చిలక పలుకులు పలకటం మొదలెట్టాడు. రెండో రవుండుకి 'పిక' అంటే కోకిల్లా గొంతెత్తి పాటందుకుని మూడో రవుండుకి 'బకం' అంటే కొంగలా దొంగ జపం మొదలెట్టాడు. ఎందుకో తెలుసా? తాను అవుటయి పోతున్నాననే విషయం ఇతరులకి తెలియకుండా వుండాలని. నాలుగో రవుండుకి 'హనుమ' అంటే కోతిలా



గంతులు వేశాడు. అశోక వనంలో ఆంజనేయుళ్ళా బార్‌లోని ఫర్నిచర్‌ని ఫట ఫట లాడించాడు. అయిదో రవుండుకి వాచీ ఉంగరాలతో సహా సర్వం దానం చేసి కర్ణుడు అయ్యాడు. ఆరో రవుండుకి కుంభకర్ణుడిలా హాయిగా నిద్ర పోయాడు."

ఈ విధంగా విక్రమార్కుడికి మౌన భంగం కలగగానే భేతాళుడు శవంతో సహా మాయమైపోయాడు.

—పి.యస్. రాజు

# నిరుద్యోగి పెళ్లి

సుబ్బయ్యగారింటికి పెళ్ళివారు వచ్చారు.

కాఫీలూ, టిఫిన్లూ అయ్యాక అమ్మాయి అబ్బాయిని, అబ్బాయి అమ్మాయిని చూశారు. అందరికీ అన్నీ నచ్చాయి. ఇహ బేరాల్లోకి దిగారు.

"మరి ఎంతిమ్మంటారు ?" అడిగాడు అమ్మాయి తండ్రి అబ్బాయి తండ్రిని.

"ఏముంది. ఈ రోజుల్లో ఎస్సెల్సీ గాడు కూడా ఐదు వేలుకి తక్కువ దొరకటంలేదు... మావాడు గ్రాడ్యుయేటు మరి... కనీసం పదివేలు"

"చాల ఎక్కువ. ఏడువేలిస్తాం"

"మొన్నొచ్చిన గుంటూరు సంబంధమే ఎనిమిది వేలిస్తామన్నారు"

"సరే. ఎనిమిదికి ఒప్పుకున్నాం"

"మరి లాంఛనాలు... ఆడపడుచు కట్నం ?" అబ్బాయి తండ్రి అడిగాడు

"మీరే చెప్పండి"

"ఏముంది. ఇదివరకొచ్చిన కాకినాడ సంబంధం వాళ్ళు రెండు వేలిస్తామన్నారు"

"సరే, రెండు వేలకు ఒప్పుకున్నాం"

"మరి పెళ్ళి బట్టలు..." సిగరెట్ వెలిగిస్తూ అడిగాడు అబ్బాయి తండ్రి.

"తమరే సెలవివ్వండి"

"రెణ్నెల్ల క్రితం వచ్చిన రాజమండ్రి సంబంధం సూటుకి వెయ్యి, బూటుకి రెండొందలిస్తామన్నారు"

"అలాగే! సూటుకి వెయ్యి, బూటుకి రెండొందలుకు ఒప్పుకున్నాం."

"మరి మావాడు నిరుద్యోగి..." నాన్చాడు అబ్బాయి తండ్రి సిగరెట్ పొగ రింగులుగా వదుల్తూ "ఇహ మీవాడే గనుక ఉద్యోగం కూడ మీరే చూడండి"

"ఉద్యోగం దొరకటం కష్టం.

"దొరికేవరకు మీరే పోషించండి"

"సరే తప్పుతుందా" అని నిట్టూర్చి "మరి పెళ్ళెక్కడ ?" —సందేహం వెలిబుచ్చాడు అమ్మాయి తండ్రి.

"దానిదేముంది. మీకు భారమనుకొంటే మా యింటి వద్దే పెడదాం... బ్యాండు ఖర్చు, బ్రాహ్మడి ఖర్చు, పందిరి ఖర్చు మీరు పెట్టుకోండి"




తిరిగి వచ్చిన మగ పెళ్ళి వారికి నాల్రోజుల తర్వాత ఉత్తరం వచ్చింది. అందులో వున్న సారాంశం ఇది—

'ఎంప్లాయ్‌మెంట్ గురించి విచారించగా తేలిందేమిటంటే- మీ అబ్బాయి రిజిస్ట్రేషన్ 1978 సంవత్సరం. కాని ఇక్కడ ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసులో 1973 సంవత్సరం వారికి మాత్రమే కాల్స్ వస్తున్నాయి. కాబట్టి మీ సంబంధం మాకొద్దు'

—బాలం వెంకట్రావు

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402